# విషయసూచిక





# మహాభారతము

## వచనము

## ఆశ్రమవాస పర్వము

హరిహరనాథా! జనమేజయమహారాజు వైశంపాయన మునీంద్రుని జూచి యిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! పిత్ర ధనమైన రాజ్యమును ధర్మరాజు ధర్మమార్గముచేత గ్రహించి అశ్వమేధాది పుణ్యకార్యములను చేసెను. పాండవులు పిమ్మట యేప్రకారము ప్రవర్తించిరో చెప్పుము. పుత్రమరణ దుఃఖితులగు ధృతరాష్ట్ర గాంధారులను ఏ ప్రకారముగా ప్రవర్తించిరో అదియును తెలుపుమని ప్రార్థించగా అప్పుడు వైశంపాయనుడు జనమేజయుని జూచి యిట్లనెను.

జనమేజయ మహారాజా! పాండవులు ధృతరాష్ట్రుని యందు భక్తి కలిగి వినయముతో ధృతరాష్ట్రుని సేవించుచుందురు. ధృతరాష్ట్రుని యోగక్షేమములు సర్వదా విచారించుచుందురు. ధృతరాష్ట్రుని అభిప్రాయములను తమకు తెలుపుటకు విదురుని యుయుత్సు సంజయునిని నియమించిరి. వారు ముగ్గురును సర్వదా ధృతరాష్ట్రుని దగ్గరనుండి అతడు చెప్పుమాటలను పాండవులకు తెలుపుచు అతనికి కావలసిన పదార్థములను ఇప్పించుచుందురు. పాండవులును ప్రతి నిత్యము ధృతరాష్ట్రుని దగ్గరకు వచ్చి నమస్కరించి సేవించుచు కార్యములందు అతడు చెప్పినట్లు ప్రవర్తించుచుందురు. ధృతరాష్ట్రుడును

పాండవులయందు పుత్రభావముంచి మిక్కిలి ప్రీతితో ప్రవర్తించు
చుండును.

జనమేజయ మహారాజా! కుంతి ద్రౌపదీ సుభద్రలును ప్రతి
నిత్యము గాంధారీదేవి సమీపమునకు వచ్చి నమస్కరించి సేవించుచు
ఆమెకు కావలసిన సకలపదార్థములను ఇచ్చుచు సంతోషపరచు
చుండిరి. చిత్రాంగద ఉలూచులును, ద్రౌపదితో వెళ్ళి గాంధారిని
పూజించుచు నమస్కరించుచు సకలపదార్థములను యిచ్చుచుండిరి.
ధర్మరాజు ధృతరాష్ట్ర గాంధారులకు సకలపదార్థములను ప్రతినిత్యము
పంపించుచు వారి మనస్సునకు ప్రీతికలిగించుచుండును. తల్లిదండ్రులను
పోషించునట్లు ధర్మరాజు ధృతరాష్ట్ర గాంధారులను పోషించు
చుండెను. పాండవులందరును ధృతరాష్ట్రుడే తమకు తండ్రిగాను.
గాంధారీదేవియే తమకు తల్లిగాను భావించుకొని పోషించుచుండిరి.

ధృతరాష్ట్ర గాంధారులును పాండవులయందు పుత్రభావము
కలిగి ప్రీతితో ప్రవర్తించుచు తమకు కావలసిన ధనాదిపదార్థము
లను తెప్పించుకొని తామనుభవించుచు నానాధర్మములను జరుపు
చుండిరి. ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో తన అభీష్టములను చెప్పి
కావలసిన ధనమును తీసికొని అనేక దేవాలయములను అనేకము
లగు చెరువులను కట్టించుచుండును. బ్రాహ్మణులకును దేవాలయము
లకును అనేక గ్రామములను అగ్రహారములను దానము లిచ్చు
చుండును.

అతడు చేయు దానములకన్నిటికి ధర్మరాజు సంతోషించి సమ్మ
తించుచుండును. ధర్మరాజును సేవించుటకు వచ్చువారందరును, ధృత
రాష్ట్రుని సేవించుచుండురు. ధృతరాష్ట్రుడు అందుకు సంతోషించి
పాండవులను తన కొడుకులనుగా భావించియుండును. ధృతరాష్ట్ర
గాంధారుల కొడుకులందరును యుద్ధమందు చచ్చినందున వారి మనస్సు

సుఖ సౌఖ్యము కలుగకుండునట్లు వారియందు పరిమభక్తితో ధర్మ
రాజు ప్రవర్తించుచుండెను. కొడుకులు లేని ధృతరాష్ట్ర గాంధారులు
యే కారణము వలననైనను, దుఃఖింతురేమోయని తలచి భయము
చేత ధర్మరాజు వారలకు దుఃఖము కలుగకుండునట్లు ప్రవర్తించు
చుండెను.

ధర్మరాజు తన తమ్ములతోడను మంత్రులతోడను. స్నేహి
తులతోడను కాపులతోడను చెప్పిన మాటలను చెప్పెదను
వినుము. సహోదరాది జనులారా! మీరు రాజు ధృతరాష్ట్రుని
అతని సేవించుచు అతని మనస్సు సంతోషపరచిన యెడల నాకు
సంతోషము కలుగును. అతనికి యిష్టముగాని పనిని చేసిన యెడల
నాకు దుఃఖము కలిగించినట్లగును. మీరు ధృతరాష్ట్రుని సర్వదా
సేవించుచు అతడు చెప్పిన పనులు చేయుచు అతని మనస్సు సంతోష
పెట్టుచుండవలెను. అని ధర్మరాజు ప్రతిదినము చెప్పుచుండును.
వారందరును ఆ ప్రకారమే జరుపుచుండిరి.

భీముడును ధృతరాష్ట్రునియందు భక్తి కలిగి సేవించుచు అతని
ఇష్టప్రకారము ప్రవర్తించుచుండెను. అయినను జూదమాడునప్పుడు
దుర్యోధనుడు తమకు పెట్టిన కష్టములను భీముడు తలచుకొని ధృత
రాష్ట్రుని యందు కోపము కలిగి వెలుపలకు కనుపడనీకుండెను. ధృత
రాష్ట్రుడు తన కొడుకులగు దుర్యోధనాదులకు శ్రాద్ధము చేయు దిన
మందు సకల విభవములతో జరుపుచుండెను. అట్టి దినమున ధృత
రాష్ట్రుని చేత దానములిప్పించుటకొరకు అనేక గోవులు బంగారము
మొదలగు పదార్థములను ధర్మరాజు పంపించుచుండును. ధృత
రాష్ట్రుడు తన కొడుకులున్నప్పటివలెనే సకల భోగములను అనుభ
వించుచు, మంచి దాన ధర్మములు చేయుచుండును. ఆ ధృతరాష్ట్ర
గాంధారులకు ధర్మరాజు శుశ్రూషలు చేయుచు గురుశిష్య మర్యా
దగా ప్రవర్తించుచుండును.

ధృతరాష్ట్ర గాంధారులును, ధర్మరాజునందు పుత్రభావము నుంచి. ఆయురారోగ్యైశ్వర్య విజయములు కలుగునట్లుగా మనస్సునందు తలచుచుందురు. ధర్మరాజు ఆ ధృతరాష్ట్రుని వలనను, అతని కొడుకుల వలనను. తమకు కలిగిన కీడులను, ఒక సారియైనను తలపకుండెను. పాండవులకు పూర్వము ధృతరాష్ట్రుడు అతని కొడుకులును కలిగించిన కీడులను వారిని ధర్మరాజు పోషించు పద్ధతినిచూచి జనులందరును ఆశ్చర్యపడుచుందురు.

జనమేజయమహారాజా! హస్తినాపురమందుండు జనులైనను. దేశములయందుండు జనులైనను ధృతరాష్ట్రుడు పాండవుల తండ్రియనియే తలచిరిగాని పెద్దతండ్రియని యెరుగరు. పాండవులకును, ధృతరాష్ట్రునకును కొంచెమైనను భేదమున్నట్లు జనులకు తెలియదు, ఈ ప్రకారముగా ధర్మరాజు ధృతరాష్ట్ర గాంధారీదేవులను పూజించుచు నడుచుకొనెను. ధృతరాష్ట్రుడు తన కొడుకు లున్నప్పటికంటె ధర్మరాజువలన అధికమగు ప్రీతికలిగి యుండును. భీముడు ధృతరాష్ట్రుని దగ్గరకు వచ్చినపుడు ధృతరాష్ట్రుడు తనకొడుకులను తలచుకొని దుఃఖించుచుండును. ధృతరాష్ట్రుని భీముడు చూచినపుడు అతని కొడుకులు తమకు పెట్టినబాధలు తలచుకొని కోపించుకొనుచుండును. ఇట్లు ధృతరాష్ట్ర భీములకు మనస్సునందు సరిపడక అతనిమీద యితనికి యితని మీద అతనికి విరోధము గలిగియుండును.

జనుల దగ్గిర పైకిమాటలాడునపుడు మంచి తియ్యని మాటలను మృదువుగా సంభాషించుచుందురు. అందుకు బంధువులందరును మెచ్చుకొనుచుందురు. జనమేజయ మహారాజా! మరియొక విశేషమును చెప్పెదను వినుము. ధృతరాష్ట్రుడు ఒంటరిగా నున్నపుడు ధృతరాష్ట్రుని దగ్గరకు భీముడు పోయి అతని చుట్టు ప్రక్కలనే యుండి గాంధారీదేవి వినుచుండగా అన్న మాటలను చెప్పెదను

వినుము. ఈ గ్రుడ్డివారల కొడుకులను నూరుగురును వెదకి వెదకి చంపితిని. ఒక్కని నైనను విడువలేదు. శత్రువులను రాజసింహములు నా బాహుబల మను పంజరమున చిక్కి నశించిరిగాని తప్పించుకొన జాలరైరి. దుర్యోధనాదులు బుద్ధిహీనులై నాతో యుద్ధముచేసిరిగాని నా బల పరాక్రమముల నెరిగియున్న యెడల యుద్ధమునకు రాక బ్రతికియుందురు. నా చేతులచేత దుర్యోధనాది శత్రువులను చంపితిని గనుక అట్టి నా రెండుచేతులకును చందనము పూసి పుష్ప మాలలు కట్టి మ్రొక్కెదను.

నా రెండు చేతులును నాకు గొప్ప ఉపకారమును చేసినవి. గనుక నా చేతులు రెండును, దైవస్వరూపములు. అని భీముడు అను చుండును. ఈ మాటలను ధృతరాష్ట్ర గాంధారులు విని మిక్కిలి కోపదుఃఖములను కలిగియుందురు. భీముడు యిట్లు మాటలాడు చున్నను, ధర్మరాజుయొక్క మంచిగుణములను తలచుకొని ధృత రాష్ట్ర గాంధారులు భయపడి బదులుచెప్పక వూరకుందురు. కాల స్వభావమును చూచి ధృతరాష్ట్ర గాంధారులు భీమునిమాటలకు దుఃఖమనస్సుగలిగి వూరకుందురు. జనమేజయ మహారాజా! యీ ప్రకారము భారతయుద్ధ మైనపిమ్మట పదిహేను సంవత్సరములు జరి గెను. ఒకనాడా గ్రుడ్డివాడగు ధృతరాష్ట్రుడు బంధుజనులను చేర్చు కొని ధర్మరాజుని పిలిపించి ధర్మరాజు వినుచుండగా గద్గద స్వర ముతో యిట్లనెను.

## ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో తనమనోరథమును దెలుపుట

బంధుజనులారా! సకల కౌరవులును నావలననే మృతినొం దిరి. సకల కౌరవ నాశనమునకు నేనే ముఖ్యకారణుడను. ఇది స్పష్ట ముగదా! దుర్యోధనుడు సకల విధములచేతను పాపాత్ముడై క్రూర

చిత్తుడై ప్రవర్తించెను. దుర్యోధనుడు సకల దుర్గుణములు గలవాడు. అట్టి దుర్యోధనుని మీకు రాజును చేసితిని. దుర్యోధనుని దుర్మార్గ ప్రవర్తనము వలన సకల కౌరవులును, రాజులును, యుద్ధమందు చచ్చిరి. సంధికి వచ్చినప్పుడు కృష్ణుడు చెప్పినమాటలను వినకపోతిని. నాకుమారునందుగల ప్రీతిచేత వాని యిష్టప్రకారము ప్రవర్తించితిని నాకుమారునకు తగురీతిని చెప్పకుంటిని. భీష్మ ద్రోణ విదుర సంజయులు వేయివిధములుగా నాకు మంచిమాటలను చెప్పిరి. గాంధారి నన్ను దూషించి మేలుకలుగు మాటలు నాకుచెప్పెను. ఆ మాటలను వినకపోతిని. వారు చెప్పినమాటలను యిప్పుడు తలచుకొనుటచేత నామనస్సునందు యెముక గ్రుచ్చుకున్నట్లు బాధించుచున్నది. నా కొడుకులు వెనుకతీయక నిర్భయముగా యుద్ధముచేసి మృతులై పుణ్య లోకమునకుపోయిరి. ఇది శ్రేష్ఠమైన క్షత్రియధర్మము. గనుక వారి విషయమై దుఃఖించరాదు. అని ధృతరాష్ట్రుడు తనబంధుమిత్రాది జనులతో చెప్పి ధర్మరాజు దగ్గర నిలిచి అతనితో యిట్లనెను. నాయనా! ధర్మరాజా! నీవు నన్ను చక్కగా విచారించుచున్నందున యేవిధమైన కొరతయులేక సకల సౌఖ్యములు అనుభవించుచుంటిని. దుర్యోధనుడు వున్నప్పటివలెనే సకలైశ్వర్య విభవములను అనుభవించితిని. అనేకవిధములగు మంచిదానములను చేసితిని. నాకొడుకులగు దుర్యోధనాదులకు శ్రాద్ధక్రియ లనేకపర్యాయములు చక్కగా చేసితిని. దుర్మార్గులగు దుర్యోధనాదులు ధర్మాత్మురాలగు ద్రౌపదికి కీడుకలిగించిరి. మహాపుణ్యాత్ముడవగు నీరాజ్యలక్ష్మిని అపహరించిరి దుర్యోధనాది దుర్మార్గులను న్యాయయుద్ధమందు నీవు చంపితివి. వారును యుద్ధమందు చచ్చినందున పుణ్యలోకములకుపోయిరి. గనుక అట్టివారి నిమిత్తమై యికనేమియు చేయరాదు. ఇక నా అభిప్రాయము నీకుచెప్పెదను వినుము.

నాయనా! ధర్మరాజా! ఏ కార్యమునైనను యెవ్వడైనను చేయదలచిన యెడల తన రాజుయొక్క అనుమతిపొంది చేయవలయునుగాని రాజుయొక్క ఆజ్ఞనుపొందక చేయరాదు. నా దేహమునకు ముసలితనము వచ్చినది. దీనికి పుణ్యసంస్కారము చేసికొనవలయును. నీఅనుమతిని పొందదలచి నీతో చెప్పుచున్నాను. రాజ వంశమందు పుట్టినవాడు యుద్ధమందైనను. నిర్మలమగు తపస్సుచేతనైనను మృతిబొంద వలయునుగాని మరియొక విధముగా మృతిబొందరాదు. మన పెద్దవారందరును యీ ప్రకారమే మృతిబొందిరి, గనుక నన్ను అడవికి పంపించుము. సకల జనులకును రాజు గురుడగును. రాజుయొక్క ఆజ్ఞనుపొంది సకలకార్యములను చేసినయెడల అట్టివానికి రెండులోకముల యందును సౌఖ్యము కలుగును. ధర్మరాజా! నీవు ఆజ్ఞయిచ్చినయెడల నేనును నా భార్యయగు గాంధారియు అడవికి వెళ్ళి మునులదగ్గరనుండి నారవస్త్రముల ధరించి కందమూలములను భక్షింపుచు తపస్సు చేసికొనుచుండెదను. నిన్ను సర్వదా దీవించుచుండెదను. అని ధృతరాష్ట్రుడు చెప్పెను. అంతట ధర్మరాజు యిట్లనెను. తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! నీవు యీప్రకారము పుత్రదుఃఖముచే పీడింపబడుచు అడవికి వెళ్ళినయెడల యీరాజ్యము నాకు సౌఖ్యము కలుగజేయదు. నీవు నాకు తెలియనిప్రకారముగలోలోపల యీప్రకారముదుఃఖించుచున్నావు. నీకు గల దుఃఖమంతయు నాకిపుడు కనబడెను. నా యెదుటనే యీ ప్రకారము దుఃఖించితివి. ఇదివరకు లోలోపల యెంత దుఃఖించితివో తెలియదు.

నీవు యింతదుఃఖము పొందియున్నప్పుడు నాకు రాజ్యమందు యిష్టముకలుగదు, నాకు నీవే తండ్రివి. గురుడవు. దైవము. ఇట్టి నీవు అడవికి వెళ్ళినయెడల నేను హస్తినాపురమందుండలేను. గనుక యుయుత్సునకు రాజ్యము నిమ్ము నేనును నీ వెంబడిని అడవికివచ్చి

నిన్ను సేవించుచుండెదను. నీకు యుయుత్సుడు ఔరసపుత్రుడు గనుక యీరాజ్యము నతనికిమ్ము యుయుత్సుడు రాజ్యమున కధిపతికాగలడు నీవు యింతకాలమువరకు నీ దుఃఖమును నాకు తెలుపక యిపుడు నా మనస్సునకు మిక్కిలి విచారమును కలిగించితివి. నాకును. యీసకల రాజ్యమునకు నీవే రాజగురుడవు. నీకు నేను రాజునుకాను. నీకు నేను రాజనియు రాజే గురుడనియు నీవు చెప్పుచుంటివి. నీనే నాకు గురుడవు. గనుక యీప్రకారముచేయుమని నీకు నేను ఆజ్ఞాపించ జాలను. దుర్యోధనాదులు నూ విషయమై చేసిన చెడుకార్యములు నామనస్సునందు పెట్టినవాడనుకాను. మేమును ఆదుర్యోధనాదులును విధివశమువలన కలహించుకొంటిమి. ఆ కలహమువలన యింతకీడు కలిగెను. గాంధారియు, కుంతియు, నీరిద్దరిని ఒక్కరూపముగానే నామనస్సునందు తలచియున్నాను. నీవు ముఖ్యముగా అడవికి వెళ్ళిన యెడల నేనును నీవెంబడి వచ్చెదను. ఈవిషయమును గురించి నీవు అభ్యంతరము చెప్పవద్దు. నామనస్సున యీప్రకారమే నిశ్చయించి యున్నాను.

తండ్రీ ! ధృతరాష్ట్రమహారాజా! నేను సత్యముగా చెప్పెదను వినుము. ఈ భూమి నామనస్సును సంతోషపెట్టజాలదు. నీవు దుః ఖించినయెడల నామనస్సు పరితపించును. దైవవశమున కలిగిన దుఃఖ మును విడువుము నన్ను విచారించి రక్షింపుము. నీకు శుశ్రూషలు చేసి నా మనోపరితాపమును బోగొట్టుకొనెదను. నా యభీష్టమును భంగపరచవద్దు. నీకు నమస్కరించి వేడుకొనుచున్నాను. దుఃఖమును విడువుము. నీవు యెక్కడున్నను నేను నీ దగ్గరయుండి నీకు శుశ్రూ షలు చేసికొనుచుండెదను. నా ప్రార్థన సంగీకరింపవలయును. అని ధర్మరాజు చెప్పుచు ధృతరాష్ట్రుని పాదములమీద పడెను. ధృత రాష్ట్రుడు ధర్మరాజును లేవనెత్తి కౌగలించుకొని యిట్లనెను,

నాయనా! ధర్మరాజా! నీవు బహుకాలమునుండి నాకు శుశ్రూషలు చేసితివి. నేను యిప్పుడు ముసలివాడ నైతిని. నేను యికనైనను తపస్సు చేసికొనవచ్చునో కూడదో నీవే చెప్పవలెను. జనులయొక్క పాపములలో కొంతపాపము రాజునకు వచ్చుచున్నది. నే నింతవరకు రాజునై యుంటిని. గనుక నాపాపమును తపస్సువలన పోగొట్టుకొనె దను. అని ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో జెప్పి విదుర కృపాచార్య సంజయులను పిలిచి యిట్లనెను. విదురాదులారా! నాముఖముశోషించి నది. నాదేహము చెడిపోయినది. మీరు ధర్మరాజును ఊరడింపుడు. అని నాలుక తొట్రుపడుచుండగా జెప్పి అధిక దుఃఖముచేత శ్రమ జెంది గాంధారిదేహమందు వ్రాలి మూర్ఛిల్లెను. అపుడు ధర్మరాజు మిక్కిలి దుఃఖించి యిట్లనెను.

ఆహా! పదివేల యేనుగుల బలముగల ధృతరాష్ట్రుడు ఒక గాంధారిని ఆధారము చేసికొని మూర్ఛిల్లి పడియున్నాడు. దైవము ప్రతికూలించిన యెటువంటి ఎంతగొప్పవారైనను సాధ్యులు కాగలరు. ఈ ధృతరాష్ట్రుడు భీమరూపముగ నుంచెడి యినుప ముద్దను చూర్ణముచేసెను. అట్టి బలవంతుడగు ధృతరాష్ట్రుడు యిప్పుడు గాంధారిని ఆధారము జేసికొని పడియున్నాడు దైవశక్తిని యేమని చెప్పవచ్చును. అని యిట్లు ధర్మరాజు చెప్పుచు ధృతరాష్ట్రునకు గలిగిన దుఃఖముచూచి అధిక దుఃఖముగలవాడయ్యెను. అప్పుడు గాంధారీ దేవి తిన్నగా ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! నీ తండ్రియగు ధృతరాష్ట్రుడు తపస్సు చేయ వలెనని నెడి చింతచేత యీ దినమందు యింతవరకు భోజనము చేయ లేదు. అందుచేత కూర్చుండ జాలక నాదేహమందు వ్రాలి మూర్ఛి ల్లెను. అని గాంధారీదేవి ధర్మరాజుతో చెప్పెను. ధర్మరాజు, నా వలననే యీ ధృతరాష్ట్రునకు యింత దుఃఖము కలిగినదన్నిదియు నా

మనస్సునకు యేమని చెప్పవచ్చునసనియు చెప్పి చల్లని నీళ్ళు తీసికొని ధృతరాష్ట్రుని ముఖమందు జల్లెను. అపుడు విదుర సంజయులును సకల కౌరవ స్త్రీలును యేడ్చిరి. ధర్మరాజు తన తడిచేతుల చేత ధృతరాష్ట్రుని దేహమంతయు పిసికెను. అపుడు ధృతరాష్ట్రుడు మూర్ఛ తెలిసికొని ధర్మరాజును కౌగిలించుకొని ధర్మరాజు శిరస్సును వాసన జూచెను. ధర్మరాజు ధృతరాష్ట్రుని కౌగిలించుకొనెను. అంతట ధృతరాష్ట్రుడు సంతోషించి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! నేను తపస్సు చేయుటకొరకు అవశ్యముగా అడవికి వెళ్ళవలయును. అని చెప్పగా ధర్మరాజిట్లనెను. తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! మీరు భోజనము చేయుడు. ఆపనిని వెనుక చెప్పెదనని యిష్టపడనట్లు చెప్పెను. అంత ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! నన్నిక శ్రమపెట్టకుము. తపస్సు చేయుటకై అడవికి వెళ్ళెడి నిమిత్తము నీ అనుమతిని పొందక భోజనము చేయను. విశేషించి మాటలాడుటకు నాకు శక్తిలేదు. గనుక అడవికి వెళ్ళి తపస్సు చేయుటకొరకు నాకు ఆజ్ఞనిమ్ము. అని ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో చెప్పుచుండగా కృపాసముద్రుడగు వేదవ్యాసమునీంద్రుడచటకు వచ్చెను. అపుడు సకలజనులును వ్యాసునకు నమస్కరించగా ధర్మరాజును చూచి వేదవ్యాసు డిట్లనెను.

## వ్యాసుడు ధృతరాష్ట్రుని వనవాసమున కనుజ్ఞ యిచ్చుట

ధర్మరాజా! ధృతరాష్ట్రుడు చెప్పిన ప్రకారము చేయుము. ధృతరాష్ట్రుడు పుత్రులు లేనివాడై ముసలివాడాయెను. తపస్సును యితడు చేసికొనవలయును. ఈ గాంధారియు పుత్రదుఃఖమును సహించుకొని యింతవరకు ప్రవర్తించెను. ఈ గాంధారికిని అడవికి వెళ్ళి తపస్సు చేయవలెనను తలంపు గలిగియున్నది. ఈ మాట

లను నీకు చెప్పుట కొరకు యిక్కడికివచ్చినాను. ధృతరాష్ట్ర గాంధారుల నిద్దరిని తపస్సు చేయు నిమిత్తమై అడవికి పంపుము మీ పూర్వీక రాజులందరును పొందిన గొప్ప స్థానమును యీ ధృతరాష్ట్రుడును పొందిన యెడల మేలగును. గనుక ఈ ధృతరాష్ట్రుడు అడవికి వెళ్ళుటకై అనుజ్ఞనిమ్ము. సకల చింతలను విడువుము. ధర్మరాజా! నీవు వినయభక్తులు గలవాడవై బహుకాలమునుంచి యీ ధృతరాష్ట్రునకు శుశ్రూషలు చేయుచుంటివి. ఇక తపస్సు చేయుటకై అడవికి పంపించుము. అని వేదవ్యాస మహామునీంద్రుడు చెప్పగా ధర్మరాజు విని యిట్లనెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! నీవే మాకు గురుడవగుదువు. నీవే మాకు పరదేవత వగుదువు. నీవే మాకు ప్రియకార్యములను చేయువాడ వగుదువు. నీవు చెప్పిన మాటలకు నేను అడ్డుమాటను చెప్పజాలను. అని యిట్లు ధర్మరాజు చెప్పగా వేదవ్యాసు డిట్లనెను. ధర్మరాజా! రాజులగువారు యుద్ధమందైనను లేక నృపోక్తమైన సమాధియందైనను, ప్రాణములను విడువవలయును. ముసలి వారైరి రోగములచేతి పీడింపబడుచు పశువులయందు చావ రాను. అని వ్యాసుడు చెప్పగా ధర్మరాజు విని బదులుమాట చెప్పుటకు భయపడి యిట్లనెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! ధృతరాష్ట్రుడు తపస్సు నిమిత్తమై అడవికి వెళ్ళుటకు నేను అనుజ్ఞ నిచ్చితిని. మీరును అనుజ్ఞ నిచ్చిరి. ఇకను ధృతరాష్ట్రుడు తన యిష్ట ప్రకారము వెళ్ళవచ్చును. నేను విఘ్నమును చేయరాను. అని ధర్మరాజు చెప్పగా వ్యాసమునీంద్రుడు సంతోషించి ధర్మరాజును జూచి యిట్లనెను.

ధర్మరాజా! నీ తండ్రియగు పాండురాజు యీ ధృతరాష్ట్రుని సింహాసనమందుంచి అనేక యజ్ఞములను చేయించి సకలభోగములను జరిపెను. పాండురాజు యీ ధృతరాష్ట్రుని సంబంధులగు జనుల

యందు ప్రీతికలిగి పోషించుచు తాను శిష్యుసనితో యీ ధృత రాష్ట్రుని సేవించెను. ఈ ధృతరాష్ట్రుడు గుడ్డివాడగుటవలన యితనికి పాండురాజు సకలభోగములను జరిపి భక్తిచేత యితనికి శుశ్రూషలు చేసెను. పిమ్మట నీవును, దిగ్విజయము. రాజసూయము మొదలగు కార్యములను చేసి యీ ధృతరాష్ట్రునకు మిక్కిలి తేజః కీర్తులను కలిగించితివి. పిమ్మట నీవు అరణ్య అజ్ఞాతవాసములు జరిపినపుడు పదమూడుసంవత్సరములును ధృతరాష్ట్రుడే రాజ్యమేలెను. పిమ్మట భారతయుద్ధమందు యితని బంధువులు పుత్రులు చచ్చిసను యీపదియేను సంవత్సరములనుంచి, నీవు సర్వదా భక్తిచేత యీ ధృతరాష్ట్రునకు సకలశుశ్రూషలుచేసితివి. ఇతనిమనస్సునందు యేవిధమైన చింతయులేదు. ఇపుడు యీ ధృతరాష్ట్రుడు తపస్సునందు ముఖ్యముగా ఆసక్తికలిగి యున్నాడు. గనుక యీ ధృతిరాష్ట్రుని అడవికి పంపించుము. అని వేదవ్యాసుడు చెప్పగా ధర్మరాజు అట్లు చేసెదనని చెప్పెను. వేదవ్యాసు డంతర్ధానుడై తన తపోవనమునకు వెళ్ళెను. ధర్మరాజు ధృతిరాష్ట్రునితో యిట్లనెను.

తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! నీ మనస్సునందు యేకార్యములు చేయవలెనని సంకల్పమున్నదో, ఆ కార్యమును చేయుము. విదుర కృపాచార్యులు యేయేకార్యములు చేయుమని నిశ్చయించిరో ఆ కార్యములను చేయుము. యుయుత్సు సంజయుల మనస్సులయందు యేకార్యములు చేయుపవలెనని సంకల్పముకలిగియున్నదో, ఆకార్యముల నన్నిటిని అవశ్యముగా చేయుము. నీవు యేకార్యములు చేసినను. నా మనస్సునకు ప్రీతికలిగి యుండును. నీకు నమస్కరించి ప్రార్థించుచున్నాను. నీ విపుడు లేచి భోజనముచేసి వెనుక నీ యిష్టమగు పుణ్యకార్యములను చేయుము. అయ్యో! ముందుగా లేచి భోజనము చేయుము. అని ధర్మరాజు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృత

రాష్ట్రుడు తన నివాసగృహమునకు వెళ్ళెను. అతని వెంబడి గాంధారియు వెళ్ళెను. ముసలియేనుగుపలె ధృతరాష్ట్రుడు తన నివాసగృహమునకు వెళ్ళగా అతని వెనుకనే విదుర యుయుత్సు కృపాచార్య సంజయులును వెళ్ళిరి. ధృతరాష్ట్రుడు స్నానసంధ్యావందనాది కార్యములను చేసికొని బ్రాహ్మణులను పూజించి భోజనము చేసెను. కుంతి మొదలగు భారతస్త్రీలందరు నూరార్చగా గాంధారియు భోజనము చేసెను. విదుర యుయుత్సు సంజయులును పాండవులును సకల స్త్రీలును భోజనముచేసివచ్చి ధృతరాష్ట్రుని చుట్టును కూర్చుండిరి. ధృతరాష్ట్రుడు ధర్మరాజును రహస్యస్థలమునకు తీసికొనిపోయి యిట్లనెను. నాయనా! ధర్మరాజా! సప్తాంగరూపమైన రాజ్యమును మంచి ధర్మముతో పరిపాలించుట కష్టము. అయినను నాకు తెలిసినంతవరకు చెప్పెద వినుము.

## ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు రాజనీతి విశేషముచెప్పుట

ధర్మరాజా! నీవు ప్రతినిత్యము విద్యావృద్ధులగు పెద్దలను చక్కగా సేవించుచుండుము. ధనములను పెద్దలకిచ్చి సంతోషపరపుము. అట్లు పెద్దలు చెప్పిన నీతులను మనస్సునందుంచుకొని ప్రవర్తించుము. ఇంద్రియములచేత యోచించి సకల కార్యములను చేసినట్లు రాజ్యమును తంత్రులచేత యోచించి చక్కగా పరిపాలింపుము. యింద్రియజయమును పొందియుండవలయును. యింద్రియములను జయించినయెడల సకలశుభములును కలుగగలవు. మంత్రులగువారు మంచి పరిశుద్ధస్వభావము కలిగి గొప్పవంశస్థులై మంచి గుణములు కలిగియుండవలయును. ఆ మంత్రులతండ్రులును మంత్రిస్థానమందుండి పనిచేసి యుండవలయును. ఇట్లు అలవాటునుబట్టి మంత్రిస్థానమున నున్న వారినిచూచి యోగ్యులగువారిని మంత్రులుగా

నుంచుకొనుము. నేర్పరులగు జనులను పంపించి శత్రువులయొక్కయు స్నేహితులయొక్కయు, సమాచారములను తెలిసికొనుము. ధర్మ రాజా! రాజగువాడు తన పట్టణమును చక్కగా రక్షించుకొనవలయును. పుణ్యాత్ములగువారికి అన్నాదిపదార్థములనిచ్చి పోషించవలయును. పెద్దలు చెప్పుమాటలు వినవలయును. అధికమగు భోజన నిద్రలు కూడవని పెద్దలు చెప్పుదురు. గనుక అధికముగా భక్షింపక అనేకము లు నిద్రనుపిడిచి ప్రవర్తించవలయును. స్త్రీలను రక్షించుటకు పెద్దవారగు స్నేహితులను ఉంచుము. సకలకార్యములను చక్కగా మంత్రులతో యోచనచేసి చేయుము. రహస్యగృహమందైనను, విశాలమైన నిర్జనప్రదేశమందైనను, అరణ్యభూమియందైనను యోచింపవలెను. కేవలము స్నేహితుల మాటలప్రకారమాచరించిన మేలుచేకూరగలదు. కుంటివారును, గ్రుడ్డివారును, జడబుద్ధిగల వారును, సమీపమందున్నపుడే కార్యవిషయమైన హాస్యపు మాటలను మాట్లాడరాదు. ధర్మరాజా! కార్యాలోచనము, పరులకు తెలిసిన మొదల అందుసలన కలిగిన కీడునకు శాంతి కలుగజాలదు. గనుక మంత్రులతో రహస్యముగా కార్యాలోచనపు మాటలను చెప్పవలయునుసుమా! పరిశుద్ధులగు పండితజనమును సహాయము చేసికొని వ్యవహారములను జనులకు తీర్మానించుచుండవలెను. జనుల యొక్క తప్పిదములను చక్కగా విచారించి తెలిసికొని అందులకు తగిన శిక్షలను విధించుచుండుము. ప్రతినిత్యము ఉదయకాలమునందు దేవబ్రాహ్మణులను పూజించుచుండుము. పిమ్మట ప్రతినిత్యము ఆదాయవ్యయములను సంక్షేపముగా విచారించుచుండుము. మధ్యాహ్నకాలమందు భోజనము చేయుచుండుము. భోజనము చేసిన పిమ్మట గంధములు పూసికొనుచు, పుష్పమాలను ధరించుకొనుచు భూషణవస్త్రములను దాల్చి నీ యిష్టప్రకారము ఆనందసుఖము

లనుభవింపుము. సాయంకాలమందు సభ చేసి కూర్చుండుము. ప్రతి నిత్యము సాయంకాలమందు సైనికులను రప్పించి విచారింపు చుండుము. సంధ్యాకాలమైన పిమ్మట దూతలతోడను చారుల తోడను మాట్లాడుచుండుము. రాత్రికాలమందు స్త్రీలతో భోగింపు చుండుము. క్రొత్తక్రొత్త సమాచారము లేమి కలిగినను, కొంచె మైనను చింతింపకుము. నిర్భయుడవై జనుల వ్యవహారములను తీర్మానింపుచుండుము. ఈ మాటలను జ్ఞాపకమునం దుంచుకొని ప్రవర్తింపుము. న్యాయముతప్పక నానావిధములగు ఉపాయముల చేత ధనమును సంపాదింపుము. నీరాజ్యమును అపహరింపదలచిన వారిని చంపి నీరాజ్యమును కాపాడుకొనుము. పనులవిషయమై మేలుచేసిన వారికి బహుమానములిచ్చి గౌరవింపుచుండుము. సభ యందు యజ్ఞములను మంచిభృత్యులను కొనియాడుచుండుము. ధర్మరాజా! మిక్కిలి శూరుడై శ్రేష్ఠకులమందు పుట్టి నీయందు స్నేహము. భక్తికలవానిని, సేనాధిపతినిగా జేయుము. నీయందు గల లోపములను, పరులకు తెలియకుండునట్లు చేయుము. నీకు శత్రువులగువారి లోపములను విచారించి తెలిసికొనుము. నీశత్రువుల యందు విరోధముకలిగి బలవంతులైనవారిని సన్మానించి నీయందు వారికి ప్రీతికలుగునట్లు ప్రవర్తింపుము. నీరాజ్యము వెంబడివుండు రాజులు నీకు శత్రువులగుదురు. నీశత్రువుల రాజ్యము వెంబడివుండు రాజులు నీకు మిత్రులగుదురు. ఆవెనుక రాజ్యపురాజులు నీకు సము లగుదురు. నీరాజ్యము వెంబడి గల రాజులు నీయందు విరోధమును జూపుదురు. గనుక అట్టి శత్రువులను యేమరియుండరాదు. శత్రు మిత్ర సమభావముగల రాజులను తెలిసికొని సప్తాంగములను విచా రించుకొనుచు, బలవంతుడైన రాజుతో సంధి చేసికొనుచుండ వలయును.

ధర్మరాజా! పరరాజులకు దైవబలము మానుషబలము తగ్గి నపు డట్టివారిని చెరచి వానివలన కప్పములు తీసికొనవలయును. బలహీనులగు రాజులమీదకు సైన్యములు తీసికొనిపోయి వాని రాజ్యమును వానిని లోబరచుకొని వానిచేత కప్పమును తీసికొన వలయును. ముఖ్యముగా రాజగువాడగు తన సైన్యములను చక్కగా రక్షించుకొనవలయునుసుమా! శత్రుదేశములమీదకు సైన్యములను తీసికొనిపోయి శత్రుదేశపు మనుష్యులకు భయము కలిగించి శత్రువుల రాజ్యమును చెరచి సులభముగా శత్రురాజ్యములను తీసికొనవల యును. దైవబలము, మనుష్యబలముగల రాజులతో విరోధము పెట్టు కొనక స్నేహముకలిగి యుండవలెను.

## ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు శత్రురాజుల జయించు విధమును చెప్పుట

ధర్మరాజా! కాలమును కనిపెట్టి శత్రురాజులకు సకలవిధ పదార్థముల నిచ్చి స్నేహము కలిగియుండుము. మరియొక సమయ మందు ముందు శత్రురాజులకిచ్చిన పదార్థములను తెచ్చునట్లు చేయుము. నీశత్రురాజులు నీకంటె బలవంతులుగా నున్నపుడు వారికి ధనాదులనిచ్చి నిన్ను దాటిపోనిచ్చుచుండుము. శత్రువులు బలహీను లైనపుడు తెలిసికొని అగ్నివలె శత్రువులను కాల్చివేయుము. ధర్మ రాజా! ఉత్సాహశక్తి, మంత్రశక్తి, ప్రభుశక్తియని మూడుశక్తులు కలవు. ఈ మూడుశక్తులను శత్రువులకు యెంతవరకుగలవో నీకెంత వరకుగలవో తెలిసికొనుము. యీమూడుశక్తులు శత్రువులకంటె నీకధికముగానున్నయెడల శత్రువులమీదకు యుద్ధమునకు శీఘ్రముగా వెళ్ళవలయును. శత్రువులు బలహీనముగా నున్నపుడు వారితో పోట్లాడక యుండవలయును. తనరొక్కము, శత్రువుల

యొక్కయు, బలాబలములను ఊహించి యెరిగియుండవలయును ఇట్లు చేయుట ఉత్తమపద్ధతి. మూలబలమనియు, సైన్యబలమనియు, మిత్రబలమనియు, శత్రుబలమనియు, అరణ్యబలమనియు, పై జీత గాండ్రబలమనియు యిట్లు ఆరుబలములు గలవు. ఈ ఆరుబలములను తెలిసికొని యుండవలయును. ఆరుబలములను దేశకాలములను కని పెట్టి నేర్చుకొని ఆయా బలముల పరిమాణములను యెరిగియుండ వలెను. ధర్మరాజా! సంపదలును ఆపదలును ఒక్కవిధమైనవే యగును. గనుక బలములయందుగల ధైర్యము అధైర్యములను తెలిసికొని నీకు మేలుకలిగించు బలమును మిక్కిలి రక్షించుచుండుము.

ధర్మరాజా! రాజగువాడు ముఖ్యముగా శత్రువులను గెలిచి నిర్భయుడై ధర్మమార్గముచేత రాజ్యమందుగల జనులను రక్షించవల యును. అట్లు రక్షించిన యెడల కీర్తి ప్రకాశించగలదు. ప్రజలయందు మిక్కిలి కృపను వదలకుండుము. ధర్మరాజా! కృపతో జనులను రక్షించుచు న్యాయమార్గముచేత ధనములను సంపాదించుచు కీర్తి బొందిన రాజునకు భూమి కామధేనువువంటిది. ధర్మమార్గముచేత ప్రజాపాలనము చేసినయెడల యిహలోకమందు అధికమగు సుఖ ములు గలిగి కీర్తి లభించుటయేగాక, పరలోకమందు మిక్కిలి భోగ ములు లభింపగలవు. జనులను మిక్కిలి ప్రేమతో రక్షించుచు కరుణా గలిగి, వివాదములయందు మధ్యస్థునివలె తీర్మానించుచు బిడ్డలను విచారించినట్లు చక్కగా రక్షించినయెడల ఆ రాజధర్మమునకు అధిక దక్షిణ పూర్వకముగా జేసిన అనేక అశ్వమేధ యజ్ఞములును సమా నములు కావని పెద్దలు చెప్పుదురు. గనుక యీ ప్రకారము నీవు ప్రజలయందు కృపగలిగి రాజ్యము చేయుచు నీతమ్ములను కొనియా డుచు సకల భోగైశ్వర్యముల నిచ్చుచు సంతోషము గలిగి యుం డుము.

ధర్మరాజా! నీకు యిదివరకు భీష్ముడును, కృష్ణుడును, వ్యాసుడును, నారదుడును మొదలగు పెద్దలందరును, రాజనీతులను చక్కగా తెలిపియున్నారు. నేనును నీయందు అధికప్రీతి గలిగియున్నందున నాకు తెలిసిన రాజధర్మములను చెప్పితిని. ధర్మరాజా! నీవు సత్యవంతుడవై, ధర్మరహస్యములను యెరిగి యున్నావు. నీకు తెలియని ధర్మము లేదు. నీకు మంచివివేకము గలదు. అయినను నేను చెప్పు ముఖ్యమైన మాటలువినుము. సర్వదా నియమముకలిగి పెద్దలను సేవించుచుండుము. ఈ విషయము ముఖ్యముగా గమనింప దగినది అని యిట్లు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో చెప్పెను. అంతట ధర్మరాజు యిట్లనెను. తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు లేకపోయెను. కృష్ణుడు తన పట్టణమగు ద్వారకకు వెళ్ళెను. ఇక నీవు తప్ప నాకు మేలు చెప్పువారు లేరు. నీవిపుడు నాయందుగల కృపచేత పుత్రభావమూని యిపుడు చెప్పిన నీతిప్రకారము ప్రవర్తించెదను. నీమనస్సునందు ప్రీతిబొందుము అని ధర్మరాజు చెప్పగా ధృతరాష్ట్రుడిట్లనెను. ధర్మరాజా! నేను సంతోషించితిని నీ దేహామందు మిక్కిలి శ్రమ జెందితివి. ఆ శ్రమతీరునట్లు విశ్రమింపుము అని ధర్మరాజునకు తగనట్లు చెప్పి పిమ్మట ధృతరాష్ట్రుడు బంధుజనులదగ్గిరకువచ్చి వారి యెదుట నిలుచుండి ఆబంధు మిత్ర జనులనందరిని తమతమ నివాస గృహములకు పంపించి తనలోపలి గృహమునకు వెళ్ళి సుఖముగా కూర్చొనియున్న ధృతరాష్ట్రునితో గాంధారీదేవి యిట్లనెను.

ప్రాణనాథా! ధృతరాష్ట్ర మహారాజా! నీవు అడవికి యెప్పుడు వెడలెదవో చెప్పుమని యడుగగా ధృతరాష్ట్రుడు గాంధారీ దేవితో యిట్లనెను. దేవీ! గాంధారీ! నాతండ్రియగు వేదవ్యాసునిచేత అనుజ్ఞను పొందితిని. ధర్మాత్ముడగు ధర్మరాజును ప్రీతిచేత సమ్మతించెను. సకల బంధువులును ఒప్పుకొనిరి. ఇక ఆలస్యము చేయుటు

నలన ప్రయోజనము లేదు. రేపటిదినమె అడవికి వెళ్ళెదను. అడవికి వెళ్ళి మిక్కిలి తపస్సుచేసి. అన్యాయపు జూదమాడిన నీ కుమారుల కందరికి పుణ్యగతిని కలిగించెదను.

## ధృతరాష్ట్రుడు వనవాసమునకు పురజనులచే ననుజ్ఞతీసికొనుట

ధృతరాష్ట్రు డిట్లు గాంధారీదేవితో చెప్పి ఆమెవైపు ముఖ ముంచి దేవీ ! గాంధారీ ! నీ కొడుకులందరును పుణ్యగతిని పొందుట కొరకై నేను తపస్సుచేయుదును. ధర్మరాజుయొక్క అనుమతిని పొంది నీ కొడుకుల పుణ్యగతికై యిపుడు కొన్ని పుణ్యకార్యములను చేసి పిమ్మట అడవికి వెళ్ళెదము. అని నిశ్చయించి తాను తపో వనమునకు వెళ్ళుటకై పురజనుల అనుమతిని పొందవలయునని ధర్మ రాజునకు తెలియపరచెను. ధర్మరాజు పురజనులలో ముఖ్యమైన వారిని పిలిపించి గుంపుచేసికొని సకలబంధుమిత్రసహితముగా తానును ధృతరాష్ట్రుని గృహద్వారమునకు వచ్చి నిలిచియుండెను. ధృత రాష్ట్రుడు గాంధారీసహితముగా వచ్చి వాకిటయందు కాచుకొని యుండు పురజనులవద్దర నిలిచి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రజనులగు పురజనులతో యిట్లనెను.

జనులారా ! మీరును కౌరవులును బహుకాలము నుండి అన్యోన్యస్నేహము గలిగి ప్రవర్తించితిరి. నే చెప్పుమాటను వినుము. నేను ముసలివాడనైతిని. ముసలివానికి తపస్సుచేయుట ధర్మమగును గదా ! తగినకార్యములుమీకు తెలిసియేయున్నవి. గనుక మీరందరు నాకు ఆజ్ఞయిచ్చి నన్ను తపోవనమునకు పంపుడు. అని ధృతరాష్ట్రుడు చెప్పగా పురజనులందరును కండ్లయందు నీరు కార్చుచు గద్గద స్వరముతో దుఃఖించుచు యేడ్చిరి. వారి విచారమును ధృతరాష్ట్రుడు విని వారితో యిట్లనెను.

పురజనులారా! సకలజనులకు సంతోషము కలుగునట్లుగా శంతనుమహారాజు రాజ్యమును పాలించెను. పిమ్మట మీరందరును భీష్మునిచేత రక్షింపబడిరి. భీష్ముడు మీకు సంతోషవంతముగ రాజ్యమును పాలించెను. భీష్ముని అనుమతినిబొంది విచిత్రవీర్యుడు భూమిని పరిపాలించెను. మీకు సంతోషమును గలిగించుచు పాండు మహారాజు రాజ్యమును పరిపాలించెను. ధర్మరాజు ధర్మముగా రాజ్యమును పరిపాలించుచున్నాడు. ఇది మీకు తెలిసియే యున్నది. ధర్మరాజు పరమధర్మాత్ముడు. సత్యవంతుడు. నా కొడుకగు దుర్యోధనుడు యీ ధర్మరాజుతో కలిసియుండక ధర్మరాజును అపకారము చేసి రాజ్యమునేలి సకల కౌరవకులమును నశింపజేసెను. దుర్యోధనుని దుర్మార్గకార్యములకు నేనే మొదటికారణము. దుర్యోధనుడు చేసిన దుర్మార్గము లన్నియు మనస్సునందుంచక మీకు నేను అన్ననియు, కొడుకుననియు, మనుమడననియు, తలచి తపోవనము నకు వెళ్ళుటకై నాకు అనుజ్ఞయిుండు. మీరు నాయందు కరుణించి నాకు మేలుగోరి అనుజ్ఞనివ్వవలయును. మీరు అనుజ్ఞ నిచ్చినయెడల తపోవనమునకు వెళ్లి తపస్సుచేసికొని కృతార్థుడనగుదును. అని ధృతరాష్ట్రుడు పురజనులతో చెప్పి తానును తనకొడుకును దుర్యోధనుడు చేసిన అన్యాయకార్యములు ఆజనులమనస్సునందు లేకున్నను అవి యన్నియు తానే చెప్పి అరణ్యమునకు వెళ్ళుటకై అనుజ్ఞనిమ్మని ప్రార్థించి ధృతరాష్ట్రుడు పురజనులతో యిట్లనెను.

పురజనులారా! గాంధారిముసలిదై దీనమనస్సుగలిగి పుత్రులు లేనిదాయెను. గాంధారిని చూచియైనను. మీరు కరుణించి తపోవనమునకు వెళ్ళుటకై మా కనుజ్ఞనిండు. అని ధృతరాష్ట్రుడు పురజనులతో చెప్పి వారికి ధర్మరాజునుజూపి యిట్లనెను. పురజనులారా! దిక్పాలకోల సమును ప్రకాశించు దేవేంద్రునివలె ధర్మరాజు తన

తమ్ములననుమనుండి ప్రకాశించుచుండును. మీరు యెప్పుడైనను యేమరక ప్రీతిపూర్వకముగా యీ ధర్మరాజును సేవించుచు ప్రవర్తింపుడు. ఇంటియందు యీధర్మరాజును వుంచి నేను తపోవనమునకు వెళ్లెదను. ధర్మరాజును మీదగ్గర వుంచితిని. ధర్మరాజు సకలవిధముల చేత మీకు సౌఖ్యము కలిగించునట్లుగా ధర్మరాజును అప్పగించితిని. ధర్మరాజు మీకు దుఃఖముకలుగునట్లు ప్రవర్తించడు. నాకులమందు బుట్టినవారికి నేనే మిక్కిలి దుఃఖమును కలిగించితిని గాని ధర్మరాజు యెవ్వరికైనను దుఃఖమును కలిగించడు. పురజనులారా! మీరు యిదివరకు యెప్పుడైనను నాకు ప్రతికూలముగా ప్రవర్తించలేదు గనుక మీరు నన్నిపుడు గౌరవించి నామాటకు అభ్యంతరము చెప్పక నన్ను తపోవనమునకు పంపుడు. అని ధృతరాష్ట్రుడు చెప్పగా పురజనులందరును యేడ్పులు మ్రింగుకొని ఒకరి ముఖమును మరియొకరు చూచుచు యేమాటయు చెప్పక వూరకుండిరి. ధృతరాష్ట్రుడు పురజనులతో యిట్లనెను.

పురజనులారా! మంచి గుణవతియగు యీ గాంధారియు నేనును మిక్కిలి వినయముతో మిమ్మును ప్రార్థించుచున్నాము గనుక మాప్రార్థనమును అంగీకరించి తపోవనమునకు వెళ్ళుటకై మాకు అనుజ్ఞనిండు. సకల ధర్మవేత్తయగు వ్యాసమునీంద్రుడు ధర్మాత్ముడగు ధర్మరాజును మాకు అనుజ్ఞ నిచ్చియున్నారు. రెండుచేతులును శిరస్సునయందుంచుకొని మీకు నమస్కరించుచు వేడుకొనుచున్నాను. మీరు మాకు అనుజ్ఞ నివ్వవలయును. అని ధృతరాష్ట్రుడు పురజనులను ప్రార్థించగా పురజనులందరును, తమ పైగుడ్డలచేత ముఖములు కప్పుకొని పెద్ద ధ్వనిగలుగునట్లు యేడ్చిరి. అట్లుసకలజనులును యేడ్చి కొంతసేపటికి దుఃఖమును విడిచి అందరుచేరి ఆలోచించి మిక్కిలి యోగ్యుడగు శాకల్యుడను బ్రాహ్మణునకు తమఅభిప్రాయము

జెప్పెను. శాకల్యుడు తన అభిప్రాయమును ధృతరాష్ట్రునకు తెలుపుట చేయుటకు ఏర్పరిచెను. ఆబ్రాహ్మణోత్తముడు ధృతరాష్ట్రుని యొద్దకు ఎదుటవచ్చి నిలిచి ధృతరాష్ట్రుని జూచి యిట్లనెను.

## ధృతరాష్ట్రునితో శాకల్యుడను విప్రుడు పౌరజన సమ్మతిని చెప్పుట

ధృతరాష్ట్రమహారాజా! పురజను లందరును నీతో చెప్పుమని నాకు చెప్పి నన్ను పంపించగా వచ్చినాను. ఆపురజనులు చెప్పిన మాటలను వినుము. మీవంశమందు బుట్టిన రాజులలో యెవరును కీడు చేయలేదు. అట్లు చేసిరేమోయని వెదకినను కనబడలేదు. మీ పుత్రులను విచారించి పోషించునట్లు జనులందరిని పక్షపాతములేక విచారించుచు పోషించితిరి. దుర్యోధనుడును చెడుకార్య మొక్కటి యైనను చేయలేదు. సర్వలోక పూజ్యుడగు వేదవ్యాసమునీంద్రుడు నీకేప్రకారము అనుజ్ఞనిచ్చెనో అదేప్రకారము చేయుము.

ధృతరాష్ట్రమహారాజా! శంతన విచిత్రవీర్య పాండురాజులు యేరీతిగా రాజ్యమును పాలించిరో. అట్లే దుర్యోధనమహారాజును రాజ్యమేలి జనులందరికిని సంతోషమును కలిగించెను. గాన దుర్యోధనునియందును నీ యందునుగూడ కొంచెమైనను లోపములేదు. ఆవిధమును చెప్పెదను వినుము. భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ కర్ణ, కృతవర్మ శల్యులు ఒకవైపున నుండిరి. భీమార్జున నకులసహదేవ ద్రుపద విరాట సాత్యకులు ఒక వైపుననుండిరి. ఇట్లు వీరందరును యిరుపక్షములయందుండి దైవముచేత ప్రేరేపింపబడినవారై యుద్ధముచేసిరి. వీరివలన సకల రాజులును సేనలును నశించెను. నశించుట ఒక్క దుర్యోధనునిచేత జరిగినదికాదు. అదిగాక రాజులకు యుద్ధము శ్రేష్ఠధర్మమగును. యుద్ధమందు చచ్చినవారికి పుణ్యగతి

కలుగును. నీపుత్రుడగు దుర్యోధనమహారాజు తన స్నేహితులతో కూడా యుద్ధమందు చచ్చి పరలోకమందు నివసించియున్నాడు. ధర్మాత్ముడవగు నీకును పుణ్యగతి సులభముగానే లభింపగలదు. ఇక మీదట మాభాగ్యమువలన పాండవులను రాజులనుగా పొందితిమి. పాండవులు మమ్ము చక్కగా రక్షించగలరు. పాండవులు స్వర్గలోకము నైనను పాలింపగలరు. అట్టిసమర్థులగువారు మనుష్యలోకమును ధర్మ మార్గప్రకారము అనాయాసముగ పాలించుటకు సంశయము లేదు. మమ్ము సకలవిధముల చేతను నీవు రక్షించితివి. ఇపుడు నీవు తపోవనమునకు వెళ్ళుచు మమ్మును యీపాండవులకు అప్పగించితివి. అందుకు సంతోషించితిమి. ధర్మరాజు దీర్ఘాలోచనవంతుడును, దానశీలుడును. మంచి యోచనగలవాడును, బంధువులను రక్షించువాడును, అయి వున్నాడు. ధర్మరాజు శత్రువులయందైనను అధిక కృపకలిగి యుండును. మంచి పరిశుద్ధస్వభావముగలిగి గొప్పబుద్ధిమంతుడై సత్యవ్రతమును ధరించియున్నాడు. యీ ధర్మరాజుయొక్క తమ్ములందరును పరులను తమవలె తలచుకొందురు. ఇతని తమ్ములందరును మంచి శ్రేష్ఠమైన గుణవంతులై యున్నారు. గనుక యీ పాండవులందరును ధర్మమార్గముతప్పక సకలరాజ్యమును మమ్మును పరిపాలించగలరు. పాండవులు సకలగ్రామములను బ్రాహ్మణులయొక్క అగ్రహారములను పండితులు మొదలగువారికి యీనాముగాయిచ్చిన గ్రామములను రక్షించుచుండగలరు. పాండవులు యికమీద బ్రాహ్మణులకు తామే గ్రామములను యినాముగా యిచ్చి ప్రకాశించగలరు. ధృతరాష్ట్ర మహారాజా! పాండవులు శాంతులకు అధిక శాంతులై యుందురు. క్రూరులకు అధికక్రూరులై యుందురు. పాండవులయందు మందునకు వెదకినను మదలోభగుణములు లేవు. యీ పాండవులు శూరులును శాంతమనస్సుగలవారును సకలదేశ జనులకు పరమ సంతోషము గలిగించువారును పరమభక్తిగలవారునై యున్నారు.

ధృతరాష్ట్ర మహారాజా! కుంతీదేవికిని, ద్రౌపది మొదలగు నీకోడండ్రకును పురజన దేశ జనులయందు మిక్కిలి కరుణకలిగి యుంసును. వీరందరును మాయందు సర్వదా కృపగలిగి యుందురు. నీవు మమ్ము రక్షించు పద్ధతిని యెరిగి వీరందరు మమ్ము రక్షింపగలరు. గనుక నీవు మనస్సునందుగల చింతనువిడిచి రాజ్యభారమును ధర్మ రాజుమీద పెట్టి భూరకించుము. ధృతరాష్ట్ర మహారాజా! యీప్రకా రము నీతోజెప్పుమని పురజను లందరును, నాతో చెప్పిరి. వారు చెప్పిన మాటలను చెప్పితిని. అని శాకల్యుడను బ్రాహ్మణుడు పుర జనులు చెప్పిన మాటలను చెప్పగా నామాటలను ధృతరాష్ట్రుడువిని సంతోషించి తగిన ప్రకారము పురజను లందరిని పంపించి ధర్మరాజు మొదలగు తనవారిని, వారివారి నివాసములకు పంపించెను. అట్లు పం పించి ధృతరాష్ట్రుడు గాంధారీ సహితముగా తనలోపలి గృహము నకు వెళ్ళెను. అట్లువెళ్ళిన ధృతరాష్ట్రుడు తగురీతిని ఆపగటిని రాత్రిని గడపి మరునాడు విదురునిపిలిచి అతనితో యిట్లనెను.

విదురుడా! మృతులైన నాబంధువుల కందరికిని విశేషముగా శ్రాద్ధక్రియలు చేయవలయునని కోరిక గలిగియున్నది. అట్టి తలంపు చేత యిపుడు నీవు ధర్మరాజు దగ్గరకుపోయి యీకా ర్యమును అనుకూలింప జేయుము. శ్రాద్ధక్రియలకు కావలసినధనాది పదార్థములను యిచ్చునట్లు ధర్మరాజుతో చెప్పుము. అని ధృతరా ష్ట్రుడు చెప్పగా విదురుడట్లుచేసెదనని ధర్మరాజుదగ్గరకుపోయి తమ్ము లతో గూడియుండు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! మీతండ్రి యగు ధృతరాష్ట్రుడు భీష్మ బాహ్లీక సోమదత్త భూరిశ్రవసులకును, దుర్యోధనాది పుత్రులకును తక్కిన బంధువులకును అధికముగా శ్రాద్ధ క్రియలు చేయవలెనను తలంపుగలిగి యున్నాడు. అట్టి అభిప్రా యముచేత కార్తిక శుక్ల పూర్ణిమవరకు యిక్కడనే వుందును. ఈ

లోపల శ్రాద్ధక్రియలను చక్కగా జరిపి అటుపిమ్మట తపోవనమునకు వెళ్ళును. యీ విషయమై వీయిష్ట ప్రకారము జరిపించుము. అని విదురుడు చెప్పగా ధర్మరాజువిని ఆమాటలకు సంతోషించెను. అర్జునుడు సంతోషించి సమ్మతించెను. భీముడు కోపము గలవాడై విదురుని ముఖము చూచుచు పెదవులు ఆడుచుండగా యేమో చెప్పదలచెను. అర్జునుడు జాగ్రతతో భీమునకు కోపోపశమనముజేసి యిట్లనెను. అన్నా! భీమా! రాజవృద్ధుడగు ధృతరాష్ట్రుడు భీష్మాది దాయాది జనులకు శ్రాద్ధకర్మములను చేయదలచి అపేక్షకలిగి యున్నాడు. అట్టికార్యమునకు నీ ధనధాన్యములను యివ్వకుంటివేని నీకీర్తిధర్మములకు హాని కలుగును. ధర్మరాజు చేయదలచిన కార్యమునకు మనము విఘ్నము చేయరాదు. మనము పూర్వము ధృతరాష్ట్రుని ప్రార్థించి, ఆతని అనుగ్రహమువలన నానావిధములైన ధనధాన్యములను తీసికొంటిమి. ధృతరాష్ట్రుడు అడవికి వెళ్ళుచు శ్రాద్ధకార్యములకొరకు మనలను ప్రార్థించు చున్నాడు. ఈ విషయమై మనము యోచింపవలెను. ఇందుకు వేరుమాట చెప్పక ధృతరాష్ట్రుడు చేయదలచిన కార్యముచేసి తీరవలెను. అని అర్జునుడు చెప్పగా ధర్మరాజా మాటలనువిని అర్జునుని పొగడెను. ఆ మాటలను భీముడు విని అర్జునునితో యిట్లనెను.

## భీముడు అర్జునునితో ధృతరాష్ట్రుని ఉద్యోగమునకు ప్రతికూలించి చెప్పుట

తమ్ముడా! అర్జునా! ధృతరాష్ట్రుడు భీష్మాదులకు యిదివరకు అనేకమార్లు శ్రాద్ధక్రియలను చేసియున్నాడు. మనము చేసియున్నాము. ఇంకను భీష్మాదులకు శ్రాద్ధ క్రియలను చేయవలసి వున్నయెడల మనము చేసికొనవచ్చును. దుర్మార్గబుద్ధిగల యీ ధృతరా

ష్ట్రుడు చేయవలసిన పనియేమి? భీష్మాదులకు శ్రాద్ధక్రియలను చేయు టకు మనము తగమా! అర్జునా! మనలను ఆ ధృతరాష్ట్రుడు పెట్టిన కష్టములను మరచితివి. ఆ ధృతరాష్ట్రుని వలన మనము కష్టపడిన కాలమందు భీష్మ బాహ్లికాది కౌరవులందరును వుండిరిగదా! ఆ భీష్మాదులందరును మన కష్టములను బోగొట్టిరా! గనుక, ఆభీష్మాది బంధుజనులందరిని మన మెరుగుదుము. అటువంటి బంధువులనుమనము తలచరాదు. భీష్మాది బంధువులయొక్క మేలునకు ప్రతికూలించి చెప్పుటచేత కీడుకలుగదు. చెప్పెదను వినుము. కర్ణునకు అతివిభవ ముతో కుంతీదేవి శ్రాద్ధక్రియను చేయదలచిన యెడల మనము అడ్డము చెప్పితిమేని మనకు పాపము గలుగునుగాని దుర్మార్గుడైన ధృతరాష్ట్రుని అభిప్రాయమునకు అడ్డముచెప్పుటచేత పాపము కలు గదు. అని భీముడు అర్జునునితో జెప్పి మరల యిట్లనెను. అర్జునా! ద్రౌపదిని సభయందు దుర్యోధనాదులు అవమానించి నపుడును ఆ ద్రౌపదిని వెంటబెట్టుకొని ధర్మరాజు అడవికి వెళ్ళిన పద్ధతియు మీా మనస్సునందు గ్రుచ్చుకొని యుండలేదు. మరచిపోతిరి. మీాకు ధృత రాష్ట్రుడు తండ్రియైనయెడల అప్పుడు ధృతరాష్ట్రుడు యెక్కడికి పోయెను? భీష్మ బాహ్లికాది వృద్ధులయొక్క బాంధవ్యము యేమ య్యెను. వారి పద్ధతియంతయు యీా విదురుడు యెరుగడా? అని భీముడు అర్జునునితో చెప్పగా ధర్మరాజు తగిన మాటలచేత భీముని అదలించెను. అపుడు అర్జునుడు భీమునితో యిట్లనెను.

అన్నా! భీమా! ధృతరాష్ట్రుడు మనచేత పూజించుటకు తగిన వాడు. నీవిట్లు చెప్పకుము. ధర్మరాజు యిష్టప్రకారము మనము ప్రవర్తించవలయును. ఇదిమనకు పరమవ్రతము. అని అర్జునుడు భీము నితో చెప్పి భీముని మాటలాడ నివ్వక విదురునితో యిట్లనెను.

మహాత్మా! విదురుడా! మా తండ్రియగు ధృతరాష్ట్రుడు బంధుజనుల నిమిత్తమై శ్రాద్ధక్రియలను చేయవలచినట్లు చెప్పితివి. అందులకు నేను పరమానందమును పొందినాను. నాగృహమందుగల ధనమును తీసికొని ధృతరాష్ట్రుడు శ్రాద్ధక్రియలను నడుపగలడు. గనుక నీవు శీఘ్రముగా వెళ్ళి యీమాటను చెప్పుము. ధృతరాష్ట్రుడు తలచిన కార్యమునకు యే అభ్యంతరము కలుగ నేరదు. అని అర్జునుడు విదురునితో చెప్పగా ఆ మాటలను ధర్మరాజు విని అర్జునుని అధికముగా పొగడి మెచ్చుకొనెను. అపుడు ధర్మరాజు అధిక ప్రీతితో విదురుని జూచి యిట్లనెను. మహాత్మా! విదురుడా! నా గృహమందుండు ధనములను అర్జునుని గృహమందుగల ధనములను తీసికొని మాతండ్రియగు ధృతరాష్ట్రుడు బంధువులకు శ్రాద్ధక్రియలను తన యిష్టప్రకారము జరుపగలడు. ఈపని నామనస్సునకు సంతోషమును పుట్టించుచున్నదని ధృతరాష్ట్రునితో విన్నవించుము. అరణ్యవాసము చేత కలిగిన కష్టములను భీముడు మనస్సునందుంచుకొని ఆ కోపము చేత యిపుడు చెప్పినమాటలకు ధృతరాష్ట్రుని చింతింపవద్దని చెప్పుము. భీముడు ధృతరాష్ట్రుని విషయమై యేమను చెప్పినను ఆమాటల వలన ప్రయోజనము లేదు. ధృతరాష్ట్రుడే మాకు పరమదైవము. ధృతరాష్ట్రుని సమ్మతము చేత అతని యనుగ్రహమును పొందితిమి. ధృతరాష్ట్రునివలననే రాజ్యాభిషేకమును పొందితిమి. అని ధర్మరాజు విదురునితో చెప్పి నవ్వుముఖము గలవాడై యిట్లనెను.

విదురుడా! పెద్దలుచేసెడి ప్రకారము పితృశ్రాద్ధ కార్యములను చేయుటకు మా తండ్రియగు ధృతరాష్ట్రుని పంపుము. అందుకు కావలసిన అనేక నవరత్నరాసులను, అధికమగు బంగారు రాసులను, అనేక గోవులను, అనేకములగు గుఱ్ఱపు గుంపులను మొదలగు వస్తువులను పరమప్రీతితో అర్జునుడు చేర్చగలడు. మా తండ్రియగు

ధృతరాష్ట్రునితో బ్రాహ్మణులకును, దేవతలకును తన యిష్ట ప్రకారము గ్రామములను దానముచేయునట్లు చెప్పుము. నీవు ఆలస్యముచేయక శీఘ్రముగా వెళ్ళి యీ మాటలను మా తండ్రియగు ధృతరాష్ట్రునితో చెప్పుము. తగిన పనులకు నీకు ప్రవర్తింపుము. అని ధర్మరాజు చెప్పగా విదురుడు సంతోషించి ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! నీవు పంపించినపని నిమిత్తము ధర్మరాజు దగ్గరకుపోతిని. నీవు నాతో చెప్పిన కార్యమును ధర్మరాజునకు జెప్పితిని. నామాటను ధర్మరాజువిని సంతోషించి అర్జునుని ముఖము జూచెను. అందుకు అర్జునుడు నీవు శ్రాద్ధక్రియను చేయదలచుటకుఅధిక సంతోషమును పొందెను. ధర్మరాజార్జునులిద్దరును, నీ విషయమై తమ ప్రాణములనైనను యిచ్చెదరు. అట్టివారైనపుడు నీవు చేయదలచిన శ్రాద్ధకార్యమునకు ధనము లిచ్చుటకు ఆశ్చర్యములేదు. గనుక నీ యిష్టప్రకారము భీష్మాదులకు పరలోక సౌఖ్యములు అధికము లగునట్లు శ్రాద్ధక్రియలను చేయుము. బంగారు రాసులను, నవరత్నముల కుప్పలను, గ్రామములను, గోవులను గుఱ్ఱములను, బ్రాహ్మణోత్తములకు నీ యిష్టము చొప్పున యిమ్ము. నీ కొడుకులకు యేయే ప్రకారము పుణ్యలోక సౌఖ్యములు కలుగగలవో ఆయా దాన ధర్మములను చేయుము. ఇట్లు నీతో చెప్పుమని ధర్మరాజు చెప్పినాడు. అని విదురుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విని సంతోషించెను. అంత విదురుడు ధృతరాష్ట్రునితో యిట్లు చెప్పెను.

ధృతరాష్ట్రమహారాజా! నేను ధర్మరాజు దగ్గరకు వెళ్ళి నీవు చేయదలచిన పనిని తెలిపినపుడు భీముడు యిష్టపడక నీవు పూర్వము తమ్ముకష్టపెట్టిన విధములను చెప్పినాడు. భీముడు దురహంకారముగలవాడు. వాడు చెప్పినమాటలను మనస్సునందుంచకూడదు. ధర్మ

రాజార్జునులిద్దరును నీయందు అధికప్రీతి గలిగి యున్నారు. ధర్మ రాజార్జునులు చెప్పిన మాటలను అనేక విధములుగా విదురుడు ధృతరాష్ట్రునితో చెప్పి ధృతరాష్ట్రుని సంతోష పెట్టెను. జనమేజయ మహారాజా! ధృతరాష్ట్రుడు విదురుడు చెప్పినమాటలకు సంతోషించి పితృశ్రాద్ధములు చేయుటకు ప్రారంభించెను. నానావిధ దేశములనుంచి బ్రాహ్మణోత్తములను పిలిపించి కార్తీకశుక్ల పూర్ణిమ పర్యంతము ధృతరాష్ట్రుడు శ్రాద్ధకార్యములను చేయుచుండెను, బంగారము, రత్నములు, గోవులు మొదలగు పదార్థములను ధర్మరాజు పంపించుచుండెను. ధృతరాష్ట్రుడు బాహ్లీకునకును, భీష్మునకును, సోమదత్త భూరిశ్రవసులకును మొదట శ్రద్ధతో శ్రాద్ధక్రియలను జేసెను. పిమ్మట దుర్యోధనాది పుత్రులకు వేరు వేరుగా శ్రాద్ధక్రియలను మనోహర విభవముతో జరిపెను. అటు పిమ్మట సైంధవుడు మొదలగు బంధువులకును, తక్కిన బంధురాజులకును, ద్రోణాచార్యునకును, తనబుద్ధికి తోచిన స్నేహితులకును, శ్రాద్ధకార్యములను విశేషముగా చేసెను. శ్రాద్ధకార్యములయందు, లెక్కలేని బంగారమును, ఏనుగులను, గుఱ్ఱములను, గోవులను, భూషణవస్త్ర కన్యకలను, భూములను, గ్రామములను, నానావిధములైన పదార్థములను మంచి వ్రత నియముగలిగి పదిమూను దినములవరకు బ్రాహ్మణులకు ధృతరాష్ట్రుడిచ్చెను. ధృతరాష్ట్రుడు శ్రాద్ధక్రియలయందు బంగారము మొదలగు పదార్థములను దానము చేసెనని ధర్మరాజు విని పరమ సంతోషము పొందెను. జనమేజయ మహారాజా! శ్రాద్ధక్రియలయందు బ్రాహ్మణులకు ధృతరాష్ట్రుడు కొన్ని కొన్ని భూములను, గ్రామములను మాత్రము దానముచేసెనని ధర్మరాజువిని తన యిష్టప్రకారము గ్రామములను బ్రాహ్మణోత్తములకిమ్మని ధృతరాష్ట్రునితో చెప్పుమని పంపించెను. అంతట ధృతరాష్ట్రరాజు

సంతోషించి అనేకగ్రామములను అగ్రహారములుగా యేర్పరచి శకుని మొదలగు తన బంధుజనులకు పుణ్యగతి కలుగునట్లు తన యిష్టప్రకారము బ్రాహ్మణులకు దానముచేసెను.

## ధృతరాష్ట్రుడు గాంధారీసహితుడై వనమునకు బోవుట

బహుదక్షిణ పూర్వకముగా ధృతరాష్ట్రరాజు తన బంధుజనుల కందరికిని శ్రాద్ధక్రియలను చేసెను. భారతయుద్ధమందు మృతులైన తన బంధుజనుల కందరికిని పుణ్యలోకసుఖాతిశయము గలుగునట్లు ధృతరాష్ట్రరాజు శ్రాద్ధక్రియలను జేసెను. అట్లు చేసిన ధృతరాష్ట్రరాజు సర్వకార్యములను జరిపి కృతార్థుడై కార్తిక బహుళ పాడ్యమినాడు వుదయకాలమందు ఋత్విగ్గనుల చేర్చుకొని దేవపూజలుచేసి పాండవులను తక్కిన బంధుమిత్రులను రప్పించెను. అంతట ధృతరాష్ట్రరాజు అడవికివెళ్ళుటకు సంకల్పించి సకలభృత్యులకును కావలసి ధనములిచ్చి గాంధారీసహితముగా నారవస్త్ర కృష్ణాజినములను ధరించి అక్షతగంధపుష్పములచేత గృహామును పూజించెను. సకలపదార్థములను విడిపించి గాంధారిని వెంటబెట్టుకొని హాస్తినాపురము విడిచి అడవికి వెళ్ళుచుండెను. ఋత్విగ్గనులు అగ్నిహోత్రములను మరికొన్ని సాధనపదార్థములను తీసికొని ధృతరాష్ట్రరాజును సమీపమందు, ముందుగా నడచుచుండిరి. అట్లు వెళ్ళుచు హాస్తినాపురమును దాటిరి. జనమేజయమహారాజా! ఆసమయమందు కుంతీదేవి మొదలగు కౌరవస్త్రీలందరును కంటికొనల యందు నీళ్ళుకార్చుకొనుచు ధృతరాష్ట్రరాజువెంబడి వెళ్ళుచుండిరి స్త్రీలందరును, బంధుజనులును, పాండవులును తనతోటి కూడుకొని వచ్చుచుండగా ధృతరాష్ట్రుడు హాస్తినాపురముదాటి కొంతదూరము పయెను. అప్పుడు ధర్మరాజు ధృతరాష్ట్రునియందు ప్రేమచేత, అధిక

దుఃఖముగలవాడై యేడ్చి, అహా! తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! యెక్కడికి వెళ్లెదవని యనుచు. గజగజ వణుకుచు క్రిందచతికిల బడెను. అప్పుడు అర్జునుడు శీఘ్రముగా ధర్మరాజు దగ్గరకువచ్చి లేవ నెత్తుచు తాను లోలోపల దుఃఖించుచుండెను.

జనమేజయమహారాజా! పాండవులు మొదలగు వారందరికిని కలిగిన దుఃఖమును చెప్పుటకు సాధ్యముగాదు. ధృతరాష్ట్రుడు అడవికి వెళ్ళునప్పుడు భీమ నకుల సహదేవులును, కృపాచార్య, యుయుత్సు సంజయులును, ధౌమ్యుడు మొదలగు బ్రాహ్మణులును దుఃఖముచేత వ్యాకులత్వమును బొందిరి. అప్పుడు కుంతీదేవి దుఃఖించుచు గాంధారి యొక్క చేతిని తన భుజముమీద బెట్టుకొని నడుచుచుండెను. ధృత రాష్ట్రుడు గాంధారియొక్క మూపమును తన చేతినుంచి నడుచు చుండెను. ద్రౌపది, సుభద్ర, చిత్రాంగద ఉలూపులును, పుత్ర సహితయగు ఉత్తరయు, ఇక్కడ కౌరవ స్త్రీలందరును ఆడు గొఱ్ఱెల గుంపువలె దుఃఖధ్వని గలిగి యేడ్చుచుండిరి. జనమేజయ మహారాజా! దుఃఖించెడి పద్ధతి జూడగా పూర్వమందు పాండ వులు అరణ్యవాసమునకు వెళ్ళినప్పుడు జనులు దుఃఖించు చందముగా నుండెను. అట్లు ధృతరాష్ట్రుడు అడవికి వెళ్లుటకు నిశ్చయించి వెళ్లు చుండెను. ధృతరాష్ట్రుని జూచుటకు పిల్లలు మొదలుకొని ముసలి వాండ్ర పర్యంతము గల జనులందరును వచ్చియుండిరి. పర పురుషుని యెప్పుడైనను చూడని పురస్త్రీలందరును వచ్చి ధృత రాష్ట్రుని జూడగా స్త్రీలందరికిని అధిక దుఃఖము. కలిగెను. భూమి యందును మిద్దెలమీదనుండి చూచెడి జనులకు దుఃఖము కలిగి యేడ్వగా ఆ దుఃఖధ్వని భూమ్యాకాశములమధ్య యంతటను వ్యాపించియుండెను. అప్పుడు ధృతరాష్ట్రుడును, హస్తినాపుర ద్వార మును దాటిపోయి సకల పురజనులును నిలువుడని చెప్పెను. ధృత

రాష్ట్రునితో అడవికి వెళ్ళుటకు విదురుడు ధృఢనిశ్చయము గలిగి యుండెను. సంజయుడు ధృతరాష్ట్రునితో అడవికి వెళ్ళుటకు నిశ్చయించెను. కృపాచార్య యుయుత్సులును ధృతరాష్ట్రునితో గూడ వెళ్ళుటకు నిశ్చయించిరి. అందుకు ధృతరాష్ట్రుడు సమ్మతించక కృపాచార్య యుయుత్సులును ధర్మరాజునకు అప్పగించి నిలిపెను. ధృతరాష్ట్రుడు తన కోడండ్రకు తగిన మాటలు చెప్పి హస్తినాపట్టణమునకు వెళ్ళుడని నియమించెను. అపుడు ధృతరాష్ట్రుని కోడండ్రందరును ధృతరాష్ట్ర గాంధారులకు నమస్కరించి కన్నీరు, ముఖముల యందు కారుచుండగా వెనుకకు మరలి కుంతీదేవితో కలిసి ధృతరాష్ట్రుని వెనుక నడుచుచుండిరి. ఆ సమయమందు ధర్మరాజు కుంతీదేవితో యిట్లనెను తల్లీ! కుంతీదేవీ! మా తండ్రియగు ధృతరాష్ట్రుడు అడవికి వెళ్ళుచున్నాడు. నేను ధృతరాష్ట్రునితో వెళ్ళెదను. ధృతరాష్ట్రునకు శుశ్రూషలు చేయుచుందును. కౌరవ స్త్రీలనందరిని తీసికొని గృహమునకు వెళ్ళుము. అని ధర్మరాజు చెప్పగా కుంతీదేవి యిట్లనెను.

పుత్రుడా! ధర్మరాజా! నీవుకూడ అడవికి వచ్చుటకు ధృతరాష్ట్ర మహారాజు సమ్మతించడు. గనుక అడవికి వెళ్ళెదనని నీవు చెప్పవద్దు. గాంధారీదేవి నాకు అత్తవంటిది యగును. ధృతరాష్ట్ర మహారాజు నాకు మామవంటివాడగును. గనుక వీరిద్దరిని సేవింపుచు నేను అడవికి వెళ్ళెదను. ధృతరాష్ట్ర గాంధారులిద్దరికిని శుశ్రూషలు జేయుటకు నేను తగిన దానవగుదును. నీచేత కాదు. అదియును గాక మీరు అడవికి వెళ్ళియున్న యెడల నేను గృహమందుండుటకు నా మనస్సు యిష్టపడదు. అని కుంతిదేవి చెప్పగా ధర్మరాజును యతని తమ్ములును తగినమాటలను జెప్పి కుంతిదేవిని వేడుకొనిరి. అపుడు కుంతిదేవి ధర్మరాజుతో యిట్లనెను. పుత్రుడా! ధర్మరాజా! ధృత

రాష్ట్ర గాంధారుల విషయమై వ్యర్థములైన ఉపచారపు మాటలను యెప్పటికిని నేను చెప్పను. చెప్పినంతే జరిపెదను. గనుక నీవు విచారము విడువుము. నేను యే విధముచేతనైనను గృహమందు నిలువను. ధృతరాష్ట్ర గాంధారుల వెంబడి వుండి వీనికి శుశ్రూషలు చేయునట్లుగా నేను వ్రతమును ధరించియున్నాను. అని ధర్మరాజుతో జెప్పి తన భుజము మీద నుండెడి గాంధారియొక్క చేతిని తిన్నగా తీసి ధర్మరాజు ముఖమునుంచి యిట్లనెను.

పుత్రుడా! ధర్మరాజా! నాకు అభ్యంతరమును చేయకుము. సహదేవుని యేమరక యుండుము. కృష్ణుని మనస్సునందు తలచుచుండుము. నేనా పాపముచేత దేవసముడైన కర్ణుని కంటిని నేను రజస్వలను కాకమునుపు, కన్యాభావమందున్నపుడు సూర్యుని వలన కర్ణుని కనినాను. అది పాపమగును. పాపమునకు నేను సర్వదా దుఃఖించుచుందును. ఆ పాపమును పోగొట్టుకొనుటకు మంచి మంచి పదార్థములను బ్రాహ్మణులకు భక్తితో దానములు చేయుచుందును. ధర్మరాజా! దేవసముడైన కర్ణుడు చచ్చినందుకు నా మనస్సు నూరు వక్కలుగా పగులకయున్నది. బ్రహ్మదేవుడు నా మనస్సును రాతిచేత నిర్మించినట్లు తలచెదను. నీవును నీ తమ్ములును భక్తిపూర్వకముగా కర్ణుని తలంచుచుండుడు. ద్రౌపదిని సర్వదా సన్మానించుచుండుము. భీమార్జున నకులులయొక్క మనోభీష్టములను ఫలింపజేయుచుండుము. రాజ్యమును పరిపాలించు విషయమందు ధర్మమును యేమరకుండుము. నేను ధృతరాష్ట్ర గాంధారులతో అడవికి వెళ్ళెదను. నా నిశ్చయము తప్పదు. మీరు హస్తినాపట్టణమునకు వెళ్లుడు. అని కుంతీదేవి చెప్పగా ధర్మరాజు దుఃఖముగలవాడై వూరకుండెను. భీమార్జున నకుల సహదేవులు దుఃఖ మనస్సులు గలవారై కన్నీరు కార్చుచు తలలు వంచుకొనిరి. ఇట్లు పాండవులు మనస్సులు గిరగిర

వెంటవెళ్లుచుండెను. ఆ సమయమున ధృతరాష్ట్రుడు కొంతదూరము వెంట పోయెను. అప్పుడు ధర్మరాజు తన తల్లియగు కుంతీదేవిని జూచి యిట్లనెను.

## ధర్మరాజు కుంతిని వనమునకు బోవలదని ప్రార్థించుట

తల్లీ! కుంతీదేవీ! నీవు అడవికి వెళ్ళకుము. ఈమాటను చెప్పకుము. మమ్ము ద్రోహముచేయదలచి యిట్లు చెప్పెదవో తెలియదు. నిన్ను అడవికి పంపించను. నీవు పూర్వము నాచేత ఆపనులు చేయించినట్లు యిప్పటికిని రాజ్యభారవిషయములైన పనులను అప్పుడెప్పుడు చెప్పినాచేత చేయించుచుండుము. అట్లుచేయనియెడల రాజ్యవ్యవహారలోపము గలుగును. నీవును కృష్ణుడును యేవిధముగా కార్యములను నడిపితిరో యెరుగుదువుగదా! అమ్మా! కుంతీ! నీవు అడవికి వెళ్లెదనని వచ్చినది మొదలుకొని మేమును ద్రౌపదియు దుఃఖసముద్రమందు మునిగియున్నాము. ఇట్టి మమ్మును విడిచి అడవియందెట్లుండెదవో తెలియదు. అని ధర్మరాజు చెప్పగా కుంతీదేవి కన్నీరు కార్చుచు బదులుమాట చెప్పక వెళ్ళుచుండెను. అపుడు భీముడు కుంతీదేవితో యిట్లనెను.

అమ్మా! కుంతీదేవీ! ధర్మరాజునందు దోషములోపమున్నదని ధర్మరాజును విడిచి వెళ్లెదవో తెలియకున్నది. నీ ఆజ్ఞాప్రకారము యీధర్మరాజు శత్రువులతో యుద్ధముచేసి సకల శత్రువులను సంహరించెను. అందువలన సకల రాజ్యలక్ష్మియు ధర్మరాజును ఆశ్రయించెను. రాజ్యలక్ష్మిని నీవును అనుభవించక అడవికి వెళ్ళుట ధర్మము కాదు. అమ్మా కుంతీదేవీ! నీవు గృహమందుండి నీకిష్టమైన దానములను ప్రతినిత్యము చేయుచుండుము. నిన్ను ఆశ్రయించిన జనులను పోషించుచు, బంధువులను రక్షించుచు అనేక పుణ్యకార్యములను

చేయుచుందుము. నన్ను ఆశ్రయించిన జనులను పోషించుచు. బంధువులను రక్షించుచు, అనేకపుణ్యకార్యములను చేయుచుందుము. నీ వెంబడి అడవికివచ్చుటకు నకులసహదేవులు ప్రయత్నించి వచ్చుచున్నారు. నీవు పూర్వము వీరలను యుద్ధమునకు పురికొల్పితివి. ఇపుడు వీరిని దుఃఖసముద్రమందు ముంచి వెళ్ళదగునా! అని భీముడు కుంతీదేవితో చెప్పెను. ఆసమయమున ద్రౌపదీ సుభద్ర లిద్దరును, మిక్కిలి దుఃఖావేశముగలవారై దుఃఖమునుండి కన్నీరు కార్చుచు వెక్కి వెక్కి యేడ్చిరి. పాండవులును పెద్దగా నేడ్చిరి. పరిచారికజనులందరును యేడ్చుచు వారివెంటనే వెళ్ళుచుండిరి. ఈ ప్రకారము కుంతీదేవి వెంబడి పాండవులు వెళ్ళుచుండగా అపుడు కుంతీదేవి తన వెంబడి వచ్చు కోడండ్రను జూచి నేగ చెప్పకున్న యెడల వీరు మరల గని తలచి కన్నీరు తుడిచికొని వెనుకకు తిరిగి తన కొడుకు లందరిని కలియజూచి వారు వినుచుండగా వారి పరిచారకులతో యిట్లనెను.

పరిజనులారా! జూదమందు పాండవులు వోడిపోయిరి. ఆసభయందు పాండవులు అపకీర్తిని పొందిరి. పిమ్మట అనేకవిధములుగా అడవియందు కష్టపడిరి. అటుపిమ్మట కృష్ణుడు సంధిచేయుటకు కౌరవసభకు వెళ్ళి మాట్లాడినను కౌరవులు సంధికి యిష్టపడకుండిరి. ఇదియంతయు నేను గ్రహించి పాండవులు కౌరవులతో కలిసి యున్న యెడల కౌరవు లందరును నవ్వుదురు. అందువలన తలలు వంచుకొని యుండవలసి వచ్చును. ఇట్లుండవలసినంతపని యేమికలదని కృష్ణుని నేను అడిగితిని. ధర్మరాజు ధర్మాత్ముడు. పదివేలఏనుగుల బలముతో సమానమగు బలము భీమునకు కలదు. అర్జునుడు సకల దివ్యాస్త్రసంపన్నుడై సకల శత్రువులను జయించుటకు సమర్థుడైయున్నాడు. నకులసహదేవులు మిక్కిలి శౌర్యసాహసులు. ఇట్టివారు కౌరవులలో చేరియున్న యెడల వీరికి హీనతనము కలుగునని అని సాగనుచేత

సంధికి సమ్మతించని కౌరవులతో యుండవద్దని కృష్ణునితో చెప్పితిని. అని కుంతీదేవి పాండవు లందరును వినుచుండగా వారి పరిజనులతో చెప్పి ధర్మరాజునకు ద్రౌపదిని జూపి ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! యీద్రౌపది మంచిగుణములుగలిగి సుకుమారియై యున్నది. ఈ పతివ్రతయగు ద్రౌపదిని దుశ్శాసనుడు తలబట్టి యీడ్చుకొని సభకు తెచ్చి, అవమానపరచెను. ఆ సభయందుండు భీష్మ ద్రోణాదులగు పెద్దలందరును మాట్లాడకయుండిరి. ఆ కష్టమును మీరు సహింపవలసి వచ్చెను. నీ తేజస్సు అపుడు నశించిపోయెను. మీతండ్రియగు పాండురాజుయొక్క కులమునకు యింత అవమానము కలిగెను. అట్టి అవమాన కష్టములు మీకు కలిగెనని నేను సహింపలేక యుద్ధము చేయుడని కృష్ణునితో చెప్పితిని. ఆ ప్రకారము మీరు యుద్ధముచేసి శత్రువులను గెలిచి కీర్తి పొందితిరి. మీ రిట్లు కీర్తి పొందవలయునని కోరి నేనట్లు కృష్ణునితో జెప్పితిని. ఆ మాటను కారణము చేసికొని భీముడు నన్ను దెప్పిపొడిచెను. ఇక నేమి చెప్ప వచ్చును అని కుంతీదేవి ధర్మరాజుతో చెప్పగా విని ధర్మరాజ భీములు సిగ్గుపడిరి. ఈ మాటకు భీముని మనస్సు యెట్లగునోయని కుంతీదేవి తలచి ధర్మరాజునకు భీముని జూపి మరల కుంతీదేవి యిట్లనెను.

ధర్మరాజా! నా మనస్సునందు వేరొక యభిప్రాయముగలిగి యిట్లనలేదు. భీమునితో యీమాట నవ్వుచు చెప్పితిని. నీ సంపద మహిమచేత నామనస్సును సంతోషపెట్టితివి. సకలలోకములు సంతో షించునట్లు నీవుచేసిన బ్రాహ్మణ దానములను చూచితిని. నీవు చేసిన అశ్వమేధ యజ్ఞమును నేత్రోత్సవముగా చూచితిని. నాకు యేవిధమైన కొరతయు లేదు. ఏమిచెప్పినను అడవికి వెళ్ళకమానను. నీవు గృహమందుండి రాజ్యమును పాలింపుచుండుము. నేను సమగ్ర

మగు తపస్సునకు ఫలమగు పుణ్యగతిని కోరుచున్నాను. అట్టి తపస్సు చేయుటకు అడవికి వెళ్ళుచున్నాను. అడవికి వెళ్ళుటకు యింత మాత్రపు తోడు నాకు మరియొకసారి దొరుకదు. గనుక యీ ధృతరాష్ట్ర గాంధారులతో నేను అడవికి వెళ్ళెదను.

ధర్మరాజా! ధృతరాష్ట్ర గాంధారులకు ఉపచారములు చేయుచు తపస్సు చేయుచు నా ఆయుష్కాలమంతయు తపోనియమముతో గడపెదను. మీరు గృహమునకు వెళ్ళుడని చెప్పెను. అని కుంతీదేవి ధర్మరాజుతో జెప్పినపిమ్మట కుంతి తమతో అడవికి రావలచుటయు, పాండవులు కుంతిని వెళ్ళవద్దని ప్రార్థించుటయు, కుంతి ఆ ప్రార్థనను అంగీకరింపకుండుటయు ధృతరాష్ట్రుడు తెలుసుకొని విదురసంజయులను పిలిచి వారితో యిట్లనెను. విదుర సంజయులారా! మీరు కుంతీదేవి దగ్గరకు వెళ్ళి ధర్మరాజు చెప్పినవిధముగా చేయుట మంచిదని కుంతితో చెప్పుడని పంపించెను. విదుర సంజయులు కుంతీదేవి దగ్గరకువచ్చి ధర్మరాజు చెప్పినట్లు చేయుమని ధృతరాష్ట్రుడు తమ్ము చెప్పుమని పంపించెనని చెప్పెను. కుంతీదేవి ఆ మాటలను వినక దృఢ నిశ్చయముతో అడవికి వెళ్ళదలచి వెళ్ళుచుండెను. కుంతీదేవి తన వెనుకవచ్చు కొడుకులను, కోడండ్రను, తక్కిన బంధుజనులను సర్వ కౌరవస్త్రీలను పరిచారకులను అందరిని కలియజూచి వారితో యిట్లనెను. మీరు నా వెనుకవచ్చిన ప్రయోజనము లేదు. నిలిచి సుఖముగా నుండుడు. అని కుంతీదేవి చెప్పగా జనులందరు మిక్కిలి దుఃఖించుచు ఆమెచుట్టును ప్రదక్షిణముగా తిరిగి పాదములకు నమస్కరించి వెనుకకు మరలి నిలిచిరి. పాండవులైదుగురు మాత్రము కుంతీదేవిని పంపించుటకు మరికొంత దూరము వెళ్ళి కుంతి ధృతరాష్ట్ర గాంధారులతో కలిసి వారితో యిట్లనిరి. తండ్రి తల్లులగు ధృతరాష్ట్ర గాంధారులారా! మీరు అడవికి వెళ్ళగా కుంతీదేవియు లేని

మొదల మాకు ప్రాప్తిపోదని యుధిష్ఠిరునితో ఎంత ప్రార్థించినను
కుంతీదేవి నిలువక మీతో గూడ అడవికి వచ్చుచున్నది. ఈ కుంతికి
మీరిద్దరును జ్ఞానము గరపుడు. యీమెచేత మీకు శుశ్రూషలు
చేయించుకొనుడు అని పాండవులు ధృతరాష్ట్ర గాంధారులతో చెప్పి
వారికి కుంతిని అప్పగించి వారిమువ్వురికిని ప్రదక్షిణముగా తిరిగి నమ
స్కరించిరి. అప్పుడా మువ్వురును పాండవులను దీవించి పంపించిరి.
అంతట పాండవులు కన్నీరు ముఖములయందు కారగా వెనుకకు
తిరిగి తమవెనుకనున్న ప్రజలను వెంటబెట్టుకొని దుఃఖించుచు తిన్నగా
హస్తినాపట్టణమునకు వచ్చిరి. అప్పుడు పాండవులకు కలిగిన దుఃఖము
చెప్పుటకు అలవికాదు. ఆప్రకారము ధర్మరాజును అతని తమ్ములును
హస్తినాపురమును ప్రవేశించి తిరిగి తేతని ప్రవర్తించుచుండిరి. జనమే
జయ మహారాజా! పాండవుల వృత్తాంతము యిట్లుండగా అడవికి
వెళ్ళిన ధృతరాష్ట్రుని వృత్తాంతము చెప్పెదను వినుము. ధృతరా
ష్ట్రుడు దృఢనిశ్చయుడై అడవికి వెళ్ళి గాంధారీ కుంతీదేవులతో విదుర
సంజయులతో అగ్నిహోత్రములకు కావలసిన ఋత్విగ్జనులతో కూడు
కొని గంగాతీరమందు ఒకమంచి స్థలమున నివసించెను. ధృతరాష్ట్రు
డాదినమంత స్నానాది కార్యముల నడిపి మహాత్ములగు బ్రాహ్మ
ణులకు నమస్కరించి ప్రజ్వలింపుచున్న అగ్నిహోత్రములకు పూజలు
చేసెను. ఆదినమున ధృతరాష్ట్రుడు హోమము చేసి తమతో వచ్చిన
అందరికిని భోజనమును పెట్టించి తానును ఆహారమును భక్షించెను.

## ధృతరాష్ట్రుడు శతయూప రాజర్షి యాశ్రమమున వసియించుట

జనమేజయ మహారాజా! విదుర సంజయులు యేర్పరచిన
దర్భశయ్యయందు ధృతరాష్ట్రుడు పండుకొనెను. అతని శయ్యకు

సమీపమున యేర్పరచిన దర్భశయ్యయందు గాంధారి వుండెను. ఆమె దర్భశయనమునకు అవతలగా కుంతీదేవికి దర్భశయన ముండెను. ఆసమీపమందు విదుర సంజయులును నివసించి యుండిరి. వారి చుట్టుప్రక్కల వారికి కనబడు ప్రదేశములందు యాజకులైన బ్రాహ్మణులు నివసించి యుండిరి. అట్లు సూర్యాస్తమయ మగు వరకు గంగానదీ తీరమందుండి సాయంకాల కృత్యములు జరిపిరి. ఆరాత్రి అచ్చటనే గడపి మర్నాటి ఉదయకాలమున స్నానసంధ్యా వందనాది కార్యములనుచేసి వెళ్ళి కురుక్షేత్రమునకు ప్రవేశించి మరి యొక పుణ్యాశ్రమ సమీపమందు చెట్లనీడచేత చల్లగానుండు యిసుక తిన్నెయందు ధృతరాష్ట్రుడు కూర్చుండెను. ఆ సమీప మందొక యాశ్రమము కలదు. కేకయ వంశమందు పుట్టిన శతయూపుడను పేరుగల రాజర్షి ఆయాశ్రమమున కలడు. అతడు అధిక తపస్సంపన్నుడు ఆరాజర్షి తన యాశ్రమ సమీపమునకు ధృతరాష్ట్రుడు వచ్చెనని విని వానిదగ్గరకువచ్చి వానిని తన యాశ్రమమునకు తీసుకొనిపోయి మిక్కిలి వినయముతో అర్ఘ్యాది విధులచేత పూజించెను. ఆరాజర్షి యొక్క యాశ్రమమందు ధృతరాష్ట్రుడు నివసింపగోరెను. విదురాదులు ఆధృతరాష్ట్రు డచ్చట నిలుచుట మంచిదని తలచి వెంటనే శతయూపుని యాశ్రమ సమీపమందు పర్ణశాలలు నిర్మించెను. అక్కడ ధృతరాష్ట్ర గాంధారులు నిలిచి శిధిలములైన కృష్ణాజిన వస్త్రములను ధరించి మంచివ్రతము గలవారై కుంతీ విదుర సంజయులతో కూడుకొని తపస్సు చేయుచుండిరి. యాజకులైన బ్రాహ్మణులు తమతమ కార్యములను జరుపుచుండిరి. నియమనిష్ఠలు అతిశయించగా ధృతరాష్ట్రుడు అక్కడుండు మునులదగ్గరవుండి అధిక తీవ్రమైన తపస్సు చేసెను. ఆతపస్సుచేత ధృతరాష్ట్రుని దేహమందు మాంసము లేక చర్మము యెముకలును శుష్కించెను. అని వైశం

పాయన మునీంద్రుడు జనమేజయునితో చెప్పగా జనమేజయుడు యిట్లనెను. వైశంపాయన మునీంద్రా! పిమ్మట ధృతరాష్ట్రుడెట్లుం డెనో తెలుపుమని యడిగెను.

ఇది మహాభారతము ఆశ్రమవాస పర్వమున
ప్రథమాశ్వాసము.

---

## ద్వితీయాశ్వాసము

దేవా! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుని జూచి యిట్లనెను. జనమేజయమహారాజా! ధృతరాష్ట్రుడు పరమ తపోవంతుడైయుండెను. కొంతకాలము జరిగినపిమ్మట ఒకానొక దినమందు నారదపర్వత దేవలమహాంజాయను లనెడి మునులు ధృత రాష్ట్రుని జూచుటకు వేడుకగలవారై ధృతరాష్ట్రుడుండు ఆశ్రమము నకు వచ్చిరి. అపుడు శతయూపుడనెడు రాజర్షి మునులదగ్గరకు వచ్చి అధికవినయముతో మునులను పూజించెను. ఆపూజలకు నారదాది మునులు పరమసంతోషముగలవారై ధృతరాష్ట్రునిదగ్గరకుబోయిరి. ధృతరాష్ట్రుడు సంతోషముగలవాడై వినయముతో మునులకు నమస్కరించెను. నారదాదిమునులు ధృతరాష్ట్రుని దీవించిరి. అంతట ధృతరాష్ట్రుడు వేయించిన దర్భాసనములమీద మునులందరును కూర్చుండి తగినమాటలను మాట్లాడుచుండిరి. ఆసమయమున ధృత రాష్ట్రునితో నారదుడిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! శతజిత్తుడనెడి పేరుగల యొకరాజు పూర్వముండెను. అతని దౌహిత్రుడగు సహస్ర జిత్తుమహారాజు తన పెద్దకొడుకగు శతజిత్తునందు రాజ్యభారముంచి

ఆశ్రమమునకు వచ్చి తపస్సుచేసి దేవేంద్రునకు స్నేహితుడై స్వర్గము నకు వెళ్ళెను. (కూతురుయొక్క కొడుకు దౌహిత్రుడనబడును.) వృషదుడును. శైలాలయుడును పురుకుత్సుడును ఆశ్రమమందు తపస్సుచేసి స్వర్గలోకమునుపొందిరి. రాజర్షులనందరిని అప్పుడప్పుడు యీభూలోకమందు నేను సంచరించుచు యీఆశ్రమమందు జూచితిని. పిమ్మట స్వర్గలోకమందు జూచితిని. ధృతరాష్ట్రమహారాజా! యీ ఆశ్రమము మిక్కిలి పుణ్యస్థలమగును. సాధారణులగు జనులకు యీ ఆశ్రమము లభింపనేరదు. వ్యాసమహామునియొక్క అనుగ్రహము వలన యీ ఆశ్రమమందు నీవు నివసింపవలసివచ్చెను. అని నారదుడు ధృతరాష్ట్రునితో జెప్పి యిట్లనెను. ధృతరాష్ట్రమహారాజా! యీ ఆశ్రమమందు నీవును తపస్సుచేసితివి. గనుక ముందుచెప్పిన రాజుల వలెనే నీవును శ్రేష్ఠపదమును పొందగలవు. నీతోటి గాంధారియు స్వర్గమునకువచ్చును. మీయిద్దరికిని అధికభక్తితో శుశ్రూషలుచేసి యీకుంతీదేవియు, పాండురాజును పొంది స్వర్గమందుండగలదు. ధృతరాష్ట్రా! నీతమ్ముడైన పాండురాజు యిప్పుడు దేవేంద్రునిదగ్గరనుండి సర్వదా నిన్ను తలచుచుండును. పాండురాజు నీ మేలును కోరి యున్నాడు. ధర్మరాజు ధర్మదేవతా స్వరూపుడు. విదురుడును ధర్మ దేవతాంశమందు బుట్టినవాడగుటవలన విదురుడు ధర్మరాజు శరీర మందు ప్రవేశింపగలడు. సంజయుడు అధికమగు స్వర్గలోకగతిని పొందగలడు. అని నారదమహాముని చెప్పగా ధృతరాష్ట్రుడు గాంధారీ కుంతీ సహితముగా సంతోషించెను. అక్కడునుండువారందరును సంతోషమనస్సుగలవారైరి. ఆసమయమున శతయూపుడనెడి రాజర్షి నారదమహామునితో యిట్లనెను. మహాత్మా! నారదమునీంద్రా నీవు త్రికాలములను తెలిసిన దివ్యజ్ఞానివగుదువు. ఒకవిషయము నన్నడిగెదను. నాయందు కృపనుంచి ఆవిషయమును నాకు చెప్పు

వలయునని వేడగా నారదుడు యిట్లనెను. శతయూపరాజర్షీ! నీవు అడుగదలచినది అడుగుము. చెప్పెదనని చెప్పగా శతయూపు డిట్లనెను. మహాత్మా! నారదమునీంద్రా! ధృతరాష్ట్రుడు పుణ్యగతిని పొందునని మీరు సిద్ధాంతము చేసి చెప్పితిరి. మీరట్లు సిద్ధాంతముగా జెప్పుటకు కారణమును తెలుపుమని యడుగగా నారదమునీంద్రుడు శతయూపునితో నిట్లనెను.

## నారదుడు శతయూపునితో ధృతరాష్ట్రాదులు సుగతిబొందెడు తెరంగుజెప్పుట

శతయూపరాజర్షీ! నేను ప్రతినిత్యము దేవేంద్రునిదగ్గరకు బోయి మాటలాడుచుందును. దేవసభయందు ధృతరాష్ట్రుని విషయములైన మాటలు జరిగెను. ఈతని తపోనిష్ఠను దేవసభయందు చెప్పుకొనిరి. ఆ సమయమున దేవేంద్రుడు నాతో యిట్లనెను. ఆ మాటలను చెప్పెదను వినుము. నారదమునీంద్రా! ధృతరాష్ట్రరాజు వేదవ్యాసమహామునివలన పుట్టినవాడగును. ధృతరాష్ట్రరాజు అడవి యందు మూడుసంవత్సరములు తపస్సుచేసి గాంధారీసహితముగా దేహమును విడిచి వెళ్ళి కుబేరునకు స్నేహితుడై ప్రకాశించుచుండగలడు. ధృతరాష్ట్రరాజు దేహమును విడిచి దివ్యవిమానమందుండి ప్రకాశించుచు విచారింపగలడు. శతయూపుడా! యీ ప్రకారము దేవేంద్రుడు నాతో దేవసభయందు చెప్పియున్నాడు. ఈ మాటను దేవేంద్రుడు నాతో చెప్పగా. పాండురాజు విని ఆనందమును పొందెను. అని నారదుడు శతయూపునితో చెప్పగా ఆ మాటలను ధృతరాష్ట్రరాజు విని పరమానందమును పొందెను. అక్కడుండు సకలజనుల మనస్సులును సంతోషించెను. జనమేజయమహారాజా! యీప్రకారము నారదాది దివ్యమునులు ధృతరాష్ట్రరాజుతో మాట

చేసి ధృతరాష్ట్రరాజుని సంతోషపెట్టి తమ తమ నివాసములకు వెళ్ళిరి. అడవియందు తపోనిష్ఠ కలిగియుండెడి ధృతరాష్ట్రరాజు సమాచారమిట్లుండెను. ఇకను హస్తినాపురమందుండెడి పాండవుల వృత్తాంతమును జెప్పెదను వినుము. జనమేజయమహారాజా! ధృతరాష్ట్రరాజు అడవియందు తపస్సుచేసెడి కాలమందు హస్తినాపట్టణమందుండెడి పాండవులు మాటిమాటికి తమతల్లియగు కుంతీదేవిని తలచుకొని దుఃఖించుచుండిరి. ధృతరాష్ట్రగాంధారులను తలచుకొని చింతించుచుండిరి. ఆ ప్రకారమే హస్తినాపట్టణమందుండెడి జనులు చింతించుచుండిరి. ఆ పురజనులు చింతించెడి విధమును చెప్పెదను వినుము ధృతరాష్ట్రమహారాజు ముసలివాడాయెను. ఈ ముసలితనమందు సుఖపడవలయునుగాని దుఃఖింపగూడదు. అట్టి ధృతరాష్ట్రుడు జనులులేని అడవిభూమియందు యే ప్రకారముగా నివసించునో తెలియలేదు గాంధారీ కుంతీదేవులిద్దరును అధికమృదువైన దేహములుగలిగి సుకుమారులై యుందురు. అయ్యయ్యో! గాంధారీ కుంతీదేవులు అడవియందెట్లుండెదరో తెలియలేదు. ఆ కుంతీదేవి రాజ్యమేలెడి పాండవులను విడచి అడవికి ఎట్లుపోయెనో తెలియదు. తమతల్లియగు కుంతీదేవి అడవికి వెళ్ళుటచేత పాండవులకు యెంత దుఃఖము గలిగియున్నదో తెలియదు. అరణ్యమునందు సంచరించుటచేత విదురసంజయులకు అధికశ్రమలు కలిగియుండును. విదురసంజయులిద్దరును ధృతరాష్ట్రునియందు గల భక్తిచేత ధృతరాష్ట్రరాజుతో అడవికి వెళ్ళిరి. అని హస్తినాపురమందుండు జనులందరును ఒకొకరీతో చెప్పుకొనుచు దుఃఖింపుచుండిరి.

జనమేజయమహారాజా! తమ తల్లియగు కుంతీదేవి అడవికి వెళ్ళెను పాండవులు సర్వదా కుంతిని తలచుకొనుచు దుఃఖించుచుండిరి. పాండవులైదుగురును ఒక్కచోటనే చేరి కూర్చుండి ధృత

రాష్ట్ర గాంధారీదేవుల కేడ్లు చెప్పుకొనుచు వారికొడుకులగు దుర్యో ధనాదులందరును చచ్చిరనియు, బంధువుల నందరినికతినముగా చంపితి మనియు, ధైర్యము తెచ్చుకొని యుద్ధమును చేయకుండక పోతిమనియు, అభిమన్యుని ఉపపాండవులను కర్ణుని చంపుకొని ఒంటివార మైతి మనియు, పాండవులు చింతించుచు జెప్పుకొనుచుండిరి. ఆ మాటలను పరిచారకులు విని వారును చింతించుచుండిరి. ఇట్లా పాండవులు ప్రతిదినము చింతించుచు దుఃఖించుచుందురు. హస్తినాపురమందుండు పాండవులు విదురసంజయులను తలచుకొని దుఃఖచింతలను పొందు చుందురు. ఈ దుఃఖముల చేత పాండవుల మనస్సులకు సంతోషము లేక మంచి మంచి భోగములను విడిచియుండిరి. వినోద కార్యములయం దాలోచన లేకయుండెను. పాండవులకు దుఃఖము చేత రాజ్యసంపద యందైనను యిష్టము లేకవుండెను. ద్రౌపదీసుభద్రలును దుఃఖమును పొందుచుందురు. పాండవులందరును దుఃఖించుచుండగా నీ తండ్రి యగు పరీక్షిత్తుకూడ దుఃఖించుచుండును. జనమేజయమహారాజా! ఇట్లు పాండవులు దుఃఖముగలవారై అడవియందుండు ధృతరాష్ట్ర రాజును జూచుటకు వెళ్ళవలయునని తలచిరి. ఆ సమయమందు సహ దేవుడు ధర్మరాజునకు నమస్కరించి వినయముతో యిట్లనెను.

అన్నా! ధర్మరాజా! ఇదివరకు నేను తమతో జెప్పుటకు భయ పడితిని. కుంతీదేవిని మనము చూడవలయును. ఆ కుంతీదేవి యేప్రకా రముగా అరణ్యమందు కష్టపడుచున్నదో తెలియదు. ధర్మరాజా! మనతల్లియగు కుంతీదేవి ప్రాణములతో ఉన్నపుడే మన మొకసారి అడవికి వెళ్లి ఆకుంతిని చూడవలెను. కుంతీదేవి తన బావయగు ధృత రాష్ట్రుని అత్తయగు గాంధారిని యేప్రకారముగా అనుసరించి ప్రవర్తించుచున్నదో తెలియలేదు. ధృతరాష్ట్ర గాంధారులు అధిక ముసలి వారై దేహబలహీనులగుదురు. అట్టివారు నారవస్త్రములను

కట్టుకొని వ్రతనియమము గలిగి కందమూలాది పదార్థములనుభక్షింపు చున్నారు. గనుక అట్టి ధృతరాష్ట్ర గాంధారులను మనము అవశ్య ముగా వెళ్ళి చూడవలయును. గనుక ధృతరాష్ట్ర గాంధారులను ప్రాణములతో ఉన్నప్పుడే చూచుట మంచిది. అని సహదేవుడు ధర్మరాజుతో చెప్పగా ఆ సమీపమందుండెడి ద్రౌపది ఆ మాటలు విని దుఃఖింపుచు ధర్మరాజుతో యిట్లనెను. ప్రాణనాథా! ధర్మరాజా! ఈ సహదేవుడు చెప్పినప్రకారము చేయుము. మీరందరును బంధు వియోగ దుఃఖమును పొందియున్నారు. గనుక సహదేవుడు చెప్పి నట్లు అడవికివెళ్ళి కుంతీ గాంధారీ ధృతరాష్ట్రులను చూడవలయును. మా అత్తయగు కుంతీదేవిని చూడవలయునని కోడండ్రందరును ప్రయాణమై సిద్ధముగా నున్నారు. అని సహదేవ ద్రౌపదు లిద్దరును చెప్పగా అపుడు ధర్మరాజు అడవికి వెళ్ళుటకు నిశ్చయించి తగిన మనుష్యులను పిలిపించి వారితో యిట్లనెను.

## పాండవులు బంధుసహితముగా ధృతరాష్ట్రుని జూడబోవుట

జనులారా! ధృతరాష్ట్రుని జూచుటకు మనము అడవికి వెళ్ళె దము. ముఖ్యముగా కావలసిన చతురంగ బలములను సిద్ధము చే యుడు, అందలములను, బండ్లను, అనేకములను సిద్ధము చేయిం పుడు. అనేకములైన పగ్గములు మొదలగు త్రాడులును, రథము లును సిద్ధము చేయించుడు. నానావిధములైన భక్ష్యభోజ్యాది పదా ర్థములను తీసికొని వచ్చునట్లుగా నేర్పరులగు పరిచారకులకు చెప్పుడు. పురజనులలో యెవ్వరైనను ధృతరాష్ట్ర మహారాజును చూడ వలయునని వచ్చినయెడల అట్టిజనులయొక్క యోగక్షేమములను విచారించుటకు తగిన పరిచారకులను నియమింపుడు. రేపటిదినము ప్రయాణమని సాటింపు చేయుడు. అని ధర్మరాజు తగిన పరిచారకు

లతో చెప్పగా ఆ పరిచారకులు ధర్మరాజు చెప్పినట్లు చేసిరి. అంతట మరునాడు ధర్మరాజు యుయుత్సు కృపాచార్య ధౌమ్యులను రప్పించి మీరు ముగ్గురును పురమును రక్షించుటకు నిలువుడని ప్రీతితో జెప్పెను. అంతట ధర్మరాజు యేనుగుల గుంపుల వెంబడి రమ్మని భీమునితో జెప్పెను, రథముల సమూహముల వెంబడి రమ్మని అర్జునునితో జెప్పెను. గుఱ్ఱపు దండుల వెంబడి రమ్మని నకులునితో జెప్పెను. కాల్బలము వెంబడి రమ్మని సహదేవునితో జెప్పెను. అని ధర్మరాజు ఆయా కార్యములయందు సమర్థులగు తనతమ్ములనుఆయా కార్యముల రక్షణమునకు నియమించెను. అంతట భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజు చెప్పిన ప్రకారము ఆయాసైన్యములను నడిపించుకొనుచు అధికములగు వాద్యధ్వనులచేతను, గొడుగులయొక్కయు, టెక్కెములయొక్కయు, రత్నకాంతులచేతను, భూమ్యాకాశములు నిండగా వచ్చుచుండిరి. అపుడు భీమార్జున నకుల సహదేవులు అధిక వైభవముతో చతురంగ బలములను తీసికొని వచ్చిరి. అపుడు ధర్మరాజు హస్తినాపుర అధికారులను పిలిపించి వారితో యిట్లనెను.

పురాధికారులారా! ద్రౌపదిని యితర సకల కౌరవభార్యల నందరిని అందలముమీదను, బండ్లమీద నుంచికొని రండు. అని ధర్మరాజు చెప్పగా పురాధికారులు ధర్మరాజు చెప్పినట్లు చేసిరి. అపుడు ధర్మరాజు నవరత్నములచేత ప్రకాశింపుచుండెడిరథముమీద యెక్కెను. ఆరథమునకు నల్లని తోకలుగల తెల్లని గుఱ్ఱములు పదియారు కట్టియుండెను. ఆరథమునకు ముత్యముల దండలుగల గొడుగులు గట్టియుండుటచే అధికప్రకాశము గలిగియుండెను. వేణువీణలయొక్క శబ్దములను, నానావిధములైన సంగీతధ్వనులును, వందిజనులయొక్క వాక్యధ్వనులను ఒక్కసారి మ్రోయగా దిక్కు

లన్నియు ప్రతిధ్వనించెను. అప్పుడు ధర్మరాజు ధృతరాష్ట్రుని జూచు టకు అడవికి బయలువెడలెను. నానావిధ వాహనములమీదనెక్కి వచ్చు పురజనులు ధర్మరాజువెనుక నడచుచుండిరి. ఇట్లు ప్రకాశించు చున్న రాజ్యసామ్రాజ్య వైభవముతో ప్రకాశించుచువెళ్ళి గంగా నదినిదాటి కురుక్షేత్రము ప్రవేశించి శతయూపరాజర్షి యొక్క ఆశ్ర మమునకు సమీపముగా పోవుచుండెను. అచ్చటనే ధృతరాష్ట్రుని యాశ్రమముండెను. ఆ ఆశ్రమము అనేకవృక్షములచేతను. మృగ ములచేతను కూడుకొని యుండెను. ధృతరాష్ట్రుని యాశ్రమమును యెరిగినవారలు ధర్మరాజుకు అదియేనని చూపించిరి. ధర్మరాజు రథమునుండి దిగెను. వెంటనే భీమార్జున నకులసహదేవులు రథముల నుండి దిగిరి. వారివెంట పురజను లందరును తమతమ వాహనములు దిగి పాండవులవెంట వెళ్ళుచుండిరి. ధర్మరాజు అట్లు పోవుచు అక్క డుండు జనులతో యిట్లనెను.. జనులారా! నా అయ్యయగు ధృత రాష్ట్రమహారాజు యెక్కడున్నాడని గద్గదస్వరముతో యడిగెను. జనులు ధర్మరాజుతో యిట్లనిరి. ధర్మరాజా! ధృతరాష్ట్రరాజర్షి యమునానదియందు స్నానము చేయుటకును, పుష్పజలములను తీసు కొని వచ్చుటకు వెళ్ళినాడు. ఈదారిని వెళ్ళిన అతిశీఘ్రముగా స్థలమునకు చేర్చును. అని జనులు చెప్పగా పాండవులు వారు చెప్పిన మార్గమును బట్టి వెళ్ళుచుండగా ధృతరాష్ట్రాదులు పాండవులకు ఎదురుగా వచ్చు చుండిరి.

## పాండవులు కురుక్షేత్రమునందున్న గాంధారీ ధృతరాష్ట్ర దంపతుల దర్శించుట

పాండవులు ఎదురుగావచ్చు ధృతరాష్ట్రాదులను జూచిరి. సహదేవుడు అందరికంటె వేగముగా ముందుబోయి తల్లియగు కుంతీ దేవి కాళ్ళమీదపడి ఏడ్చెను. కుంతీదేవి కళ్ళనీళ్ళుబెట్టుచు సహదే

వుని లేవనెత్తి కౌగిటియందు చేర్చుకొనెను. కుంతీదేవి సహదేవుని కౌగలించుకొని సహదేవుడు వచ్చినాడని గాంధారితో చెప్పెను. పాండవు లందరును కలిసికొని ధృతరాష్ట్ర గాంధారులకు నమస్కరించిరి. అక్కడుండు జనులు వీరు ధృతరాష్ట్ర గాంధారులని చెప్పగా పాండవులు తెలుసుకొనిరేగాని-తమంతట తాము తెలియ జాలకైరి.

పిమ్మట పాండవులు తమ తల్లియగు కుంతీదేవి పాదములపై బడి నమస్కరించిరి. కుంతీదేవి పుత్రులయందుగల కరుణచేత కన్నీరు కార్చుచు తన కొడుకుల నైదుగురను కౌగలించుకొని కన్నీరు తుడుచుకొని ప్రీతితో కొడుకులను దీవించెను. సంజయుడు మిక్కిలి వినయ భక్తులతో ధర్మరాజును మొదటచూచి పిమ్మట భీమార్జున నకుల సహదేవులను చూచెను. సంజయుని పాండవులు, సకల భారత స్త్రీలు క్రమముగా ధృతరాష్ట్ర గాంధారి కుంతీదేవులను జూచిరి. అంతట: వారు తెచ్చుచున్న నీటి పాత్రలను పాండవులు తీసుకొని మోయుచు వచ్చిరి. హస్తినాపురమునుంచి వచ్చిన జనులు మిక్కిలి వినయముతో ధృతరాష్ట్ర గాంధారీ కుంతులను జూచిరి. జనమే జయ మహారాజా! ఆ సమయమందు అందరును సంతోషము గలిగి యుండిరి. అపుడు సకల జనులును ధృతరాష్ట్రుని చుట్టుకొని యుండగా ధృతరాష్ట్రుడు తాను హస్తినా పట్టణమందున్నట్లు తలచెను. అపుడు ధృతరాష్ట్రుల ఆశ్రమము గంగతోగూడిన ఆకాశమువలె ప్రకాశించెను. తన బంధుమిత్రాది జనులతో గూడియున్నందున ధృతరాష్ట్రుడు చంద్రునివలె ప్రకాశించుచుండెను. అపుడు సమీపమందుండెడి మునులు పాండవులను చూడవలెనను కోరికచేత ధృతరాష్ట్రుని ఆశ్రమమునకు వచ్చిరి. పాండవులు వచ్చిన మునులకు నమస్కరించి వినయ భక్తులచే మునులను సంతోషపరచిరి. అంతట పాండవులు ప్రకాశించుచుండెడి ముఖకాంతులు గలవారై ధృత

రాష్ట్రుని చుట్టుకొని కూర్చుండిరి. మునులు సంజయునితో యిట్లనిరి. సంజయుడా! యీ వచ్చిన ధృతరాష్ట్రుని బంధుజనుల నందరిని మాకు వేరు వేరుగా తెలుపుమని యడుగగా అపుడు సంజయుడు యిట్లనెను.

మునులారా! బంగారము ఛాయవంటి దేహకాంతిగలిగి గొప్ప దేహవంతుడై తగిన గొప్ప ముక్కు గలిగి విశాలములైన నేత్రములచేత ప్రకాశించుచు సింహమో యనునట్లు కనబడుచుండెడి యాతడు ధర్మరాజు యగును. ఎర్రతనముగలిగిన మూపులు గలిగి నట్టియు. పొడుగుగలిగి ప్రకాశించుచుండెడి చేతులు గలిగినట్టియు విశాలములైన వక్షస్థలముగల మనుష్యుడు భీముడగును. ప్రకాశించు చుండెడి సొగసైన నల్లని దేహము కలిగినట్టియు, తామర కమల ములవంటి నేత్రములు గలిగి మదపు ఏనుగువలె నుండెడి యతడు అర్జునుడు. సుందర రూపములచేత తమతో సమానులు మరియొకరు లేరని స్పష్టముచేయుచు కుంతికి యిరుప్రక్కల యందుండు వారు నకులసహదేవు లగుదురు. ఆ నకుల సహదేవులు విష్ణుదేవ దేవేం ద్రులవలె ప్రకాశించుచున్నారు. మునులారా! నల్లకలువవంటి దేహ కాంతిగలిగి తామరకమలములను తిరస్కరించుచుండెడి. నేత్రములచేత ప్రకాశించుచు నడివయస్సుగల స్త్రీ ద్రౌపది. ఆ ద్రౌపది అతి మనోహరమైన రూప సౌందర్య సంపదకలిగి యున్నది.

మునులారా! ద్రౌపదికి ప్రక్కనుండెడి స్త్రీ సుభద్ర. ఆ సుభద్ర మిక్కిలి యెర్రని దేహకాంతిగల దగుచు పద్మములవంటి ముఖముగలిగి సూర్యునివంటి తేజోరూపముచేత ప్రకాశించుచున్నది. ఆ సుభద్ర కృష్ణునకు చెల్లెలును అర్జునునకు భార్యయు అగును. వీరికి వెనుక నుండెడి యిద్దరి స్త్రీలును ఉలూచి, చిత్రాంగద లనబడు దురు. బంగారువంటి దేహకాంతి చేత ప్రకాశించునది ఉలూచి

యగును. ఆ ప్రక్కనున్నది నాగకన్యక. తుమ్మెదవంటి నల్లని నాగస్త్రీ స
దేహకాంతిగలది. చిత్రాంగద, స్త్రుతాచి. చిత్రాంగద లిద్దరును అర్జు
నుని భార్యలు. నల్లకలువవంటి కాంతికలిగి నేత్రములచే జింకను
తిరస్కరించుచుండెడి స్త్రీ భీముని భార్య. క్రొత్తగా వికసించిన
సంపెగ పుష్పమువంటి దేహకాంతి గల స్త్రీ సహదేవునిభార్య.
నల్లకలువవంటి దేహకాంతిగల స్త్రీ నకులుని భార్య, వీరికి వెనుక
తట్టు బొట్టు లేక పాడునోసలుగలిగి యుండెడి స్త్రీలందరును ధృతి
రాష్ట్రుని కోడండ్రందురు. ధృతరాష్ట్రుని కోడండ్రందరును తెల్లని
వస్త్రములను ధరించినవారలై మఃఖదేహము కలిగియున్నారు.
సుభద్రవెనుకతట్టు పాడునోసలు గలిగి తెల్లని వస్త్రమును కట్టుకొని
యుండెడి స్త్రీ ఉత్తరయనబడును. ఆ ఉత్తర యుద్ధవీరుడగు అభి
మన్యుని భార్య, అని సంజయుడు ధృతరాష్ట్రుని బంధువులనందరిని
మునులకు చూపి తెలిపెను. అపుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో
యిట్లనెను.

ధర్మరాజా! నీవు కుశలము గలిగియుంటివిగదా! పురజను
లును. నీ స్నేహితు బంధువులును సుఖముగా సంతోషముచేత ప్రవ
ర్తించుచుండిరి. నీ భృత్యులందరును ఇష్టఫలములను పొందుచు
సుఖముగలిగియుండిరి. పూర్వపు రాజులవలె జనులను సంతోష పర
చుచు రాజ్యమును పరిపాలించుచుంటివి. మునులను లాలించుచు
జనులవలన పన్నుల తీసికొనుచు బొక్కసమును వృద్ధిచేసితివి. అగ్ర
హారములయందుండెడి జనులమీద సుడిగాలియైనను పోనివ్వక పరి
పాలించుచుంటివి. ధర్మరాజా! నీకు మిత్రులగు రాజులను మంచి
తనముచేతను, శత్రురాజులను కొట్టుటచేతను. నీ స్వాధీనమందుండు
నట్లు చేసుకొని యుంటివిగదా! నీకు శత్రుమిత్రులుగాని రాజులును,
ఉపేక్షించి యుండియు కనిపెట్టి యుందువుగదా! దేవతలకును,

పితృదేవతలకును అతిథులకును పూజలుచేసి తృప్తికలిగించుచుంటివి గదా! ఈ భూమియందుండు బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర జనులందరును తమతమ వృత్తులయందు ప్రవర్తించుచుండిరి గదా! ధర్మరాజా! బాలురకును, బలహీనులకును, స్త్రీలకును, ముసలి వాండ్రకును భయము కలిగించనట్లుగా నీ యాజ్ఞపట్టణ మందును, దేశమునందును వ్యాపించియున్నదిగదా! అని ధృతరాష్ట్రుడు ధర్మ రాజును కుశల ప్రశ్న వేయగా ధర్మరాజు యిట్లనెను.

తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! నీవు నాకు చెప్పిన ప్రకా రము నీవడిగిన విషయము లన్నియు తగినట్లు జరుగుచున్నవి. అని ధర్మరాజు చెప్పెను. ధృతరాష్ట్రమహారాజా! ఆయాసము చెందని నీదేహము తపఃకార్యములకు సహించెను. కుంతీదేవి శ్రమచెందక మీకు చక్కగా శుశ్రూషలు చేయుచున్నది. మా పెత్తల్లియగు గాంధారీదేవి కష్టమునకు సహించుకొని తపోవృత్తిని జరుపుచున్నది. ఆగాంధారీదేవి తన కొడుకులను మేము చంపితిమని పాపాత్ములగు మమ్మును తలచుకొని మీతో నేమి చెప్పుచుండెనో తెలియదు. సంజయుడు కూడా తపఃకార్యములకు సహాయుడైయుండెను. విదురుడు యెక్కడికి పోయెనో తెలియదు. విదురుని చూడవలయును. అని ధర్మరాజు ధృతరాష్ట్రునితో చెప్పగా అపుడు ధృతరాష్ట్రుడు ధర్మ రాజుతో యిట్లనెను. ధర్మరాజా! నేను తపస్సునకు ఓర్చి తపస్సు చేసెదను. కుంతీదేవి అలయక మాకు శుశ్రూషలు చేయుచుండును. గాంధారియు తపోనిష్ఠకు సహించియుండును. ఈగాంధారియు మిమ్మును తలచినపుడు మిమ్మును మెచ్చుకొని దీవించును. సంజయుడు పండితు డగును. తపోవృత్తికి విసుగక ప్రవర్తించును. విదురుడు మిమ్మును విడిచి మునిజనులకు ఆశ్చర్యము కలిగించుచు యెక్కడనో సంచ రించుచుండును. విదురుడు జలములను, గాలిని, ఆహారముగా చేసి

కొని సంచరించుచుండును. కొన్ని సమయములందు ఆ జలవాయు
వులనైనను భక్షింపక సంచరించుచుండును. జనశూన్యమైన అడవి
యందు దైన్యము లేక విదురుడు సంచరించుచుండును. ఒక్కొకసారి
విదురుడు కనబడుచు కనబడకపోవుచుండును. అని ధృతరాష్ట్రుడు
ధర్మరాజు నడిగిన కుశలప్రశ్నముల కన్నిటికిని ప్రత్యుత్తరములు
చెప్పెను. అప్పుడే విదురుడు ధర్మరాజునకు సమీపమందే కనబడెను.
ఆ కనబడిన విదురుడు అడవియందుగల దుమ్ముచేత మురికిదేహము
గలిగి జడలుగా పర్వడిన తలవెంట్రుకలు గలవాడై దిగంబరరూపియై
యుండెను. అట్టి విదురుడు ధర్మరాజుదగ్గరకు వచ్చి ఆ యాశ్రమమం
దుండెడివారి నందరిని జూచి వెళ్ళెను. అట్లు వెళ్ళెడి విదురుని ధర్మ
రాజుచూచి తనతోకూడ వచ్చుచుండెడి పరిచారకులను నిలువుడని
చెప్పి ధర్మరాజొక్కడే శీఘ్రముగా విదురుని వెంబడించుకొని
పరుగెత్తుచుండెను. ఆవిదురుడును పొదలనడుమ పరుగెత్తుచు కన
బడుచు వెళ్ళుచుండెను. అట్లు బహుదూరము వెళ్ళగా అతని వెంబడి
ధర్మరాజును పరుగెత్తుచు పెద్ద కంఠధ్వనితో యిట్లనెను. విదురుడా!
పరుగెత్తక నిలువుము. నేను ధర్మరాజును. నిన్ను జూచుటకు వచ్చి
నాను. అని ధర్మరాజు చెప్పుచు విదురునిదగ్గరకు పరుగెత్తెను. అప్పుడు
మహాత్ముడైన విదురుడు తిరిగిజూచి పరిశుద్ధస్థలమందు నొక వృక్ష
మును ఆనుకొని నిలిచియుండెను.

## విదురుడు యోగమార్గముచే ధర్మరాజునందు గలయుట

జనమేజయ మహారాజా! అంతట ధర్మరాజు వృక్షమును
ఆనుకొని యుండెడి విదురమహా యోగీశ్వరుని దగ్గరకుబోయి అత
నికి సరిగా యెదుట నిలిచెను. అప్పుడు విదురుడు సగము కన్నుమూసి
కొని పలుకక, మాట్లాడక యూరకుండెను. అప్పుడు ధర్మరాజు విదుర
మహాయోగీశ్వరునితో యిట్లనెను.

మహాత్మా! విదురా! నేను ధర్మరాజును, కండ్లు తెరచి నన్ను చూడుమని ప్రార్థింపగా విదురుడు కంటిరెప్పలెత్తి ధర్మరాజును చక్కగా చూచి అధికమగు యోగబలమునుపొంది యింద్రియముల యందు ప్రాణములను, ప్రాణములయందు యింద్రియములను కలిపి తన శరీరమును విడిచి ధర్మరాజు దేహమందు ప్రవేశించెను. ఆ సమయమున తేజోమయమైన రూపము ధర్మరాజునందు కలిసెను. జనమేజయమహారాజా! ఇట్లు విదురుడు తన యోగబలము వలన దేహమును విడిచి ధర్మరాజునం దైక్యముకాగా ధర్మరాజు దేహము మిక్కిలి తేజోబలశక్తి కలిగినదాయెను. ధర్మరాజు బుద్ధికినిమిక్కిలి శక్తికలిగెను. విదురుడు తనయం దైక్యమగుటచేత కలిగిన విశేషములకు ధర్మరాజు చోద్యముబొందెను. ధర్మరాజు అంతట వృక్షమును ఆనుకొని నిర్వికారముగానుండు విదురుని దేహాశవమును చూచి అగ్నిచేత దహించవలెనని తలచెను. అప్పుడాకాశమందొక ధ్వని వినిపించెను. అది చెప్పెదను వినుము.

ధర్మరాజా! యతిస్వభావమును పొందిన విదురుని కళేబరమును దహింపరాదు గనుక దహింపవద్దు అని ఆకాశమందు ధర్మరాజు నుద్దేశించి మ్రోగెను. ధర్మరాజు విదురుని కళేబరమునకు అగ్నిసంస్కారము చేయకనే వెళ్ళి తనతమ్ములతోడను ధృతరాష్ట్రునితోడను విదురుని వెంబడి పరిగెత్తి వెళ్ళినది మొదలుకొని జరిగిన వృత్తాంత మంతయు చెప్పెను. అట్లు క్రమముగా జరిగిన వృత్తాంతమంతయు అందరు వినునట్లు ధర్మరాజు చెప్పగా అందరును ఆశ్చర్యపడిరి. పిమ్మట ధృతరాష్ట్రుడు తనబంధుజనులను చూచుటకు వచ్చిన మునులను పంపగా మునులు వారివారి నివాసములకు వెళ్ళిరి. పిమ్మట ధర్మరాజుతో ధృతరాష్ట్రుడు యిట్లనెను.

ధర్మరాజా! ఫలములను, కందమూలములను యిచ్చెదను. భక్షింపుము, తమకు యేయే పదార్థము లాహారమునకు ఉండునో

ఆయా పదార్థములచేత అతిథులను తృప్తిపరచుట ధర్మము. అని ధృతరాష్ట్రరాజు చెప్పగా ధర్మరాజు అట్లు చేసెదనని ధృతరాష్ట్రరాజుచేత కందమూలములను పండ్లను తీసికొని భక్షించెను. సంతోషముచేత ధర్మరాజు కందమూలఫలములను భక్షింపగా అందరును ఆప్రకారమే కందమూలఫలముల నానందముతో భుజించిరి. ఆరాత్రి యందందరును భూమిమీద పండుకొని నిద్రించిరి. మరునాడు సూర్యోదయమున పాండవులు స్నానసంధ్యావందనాది అగ్నిహోత్రాది కార్యములను చేసిరి. ధర్మరాజు తన తమ్ములతో కూడుకొని ఉదార గుణముగలవాడై తాసపరిచారకులను తీసికొని ధృతరాష్ట్రరాజుని ఆశ్రమము చుట్టునుండు భూమినిజూచెను. అంతకుపూర్వమే ధృతరాష్ట్రరాజు పుణ్యనదీస్నానముచేసి అగ్నిపూజ జపధ్యానాది తపో ధర్మకార్యములను తీర్చుకొని మృగములవలన భయములేక పక్షుల మాధుర్యధ్వనులను, వినుచు ప్రాతఃకాలమందు చేయతగిన యజ్ఞ కార్యములు చేయుచుండెను. ధృతరాష్ట్రరాజు దగ్గరికి పాండవులును వచ్చి నమస్కారాదులచేసి ధృతరాష్ట్రరాజు మనస్సును సంతోష పరచిరి. అంతట ధృతరాష్ట్రరాజు చెప్పిపంపించగా ధర్మరాజు పరి శుద్ధమైన ఆసనమందు కూర్చుండెను. అట్లే భీమాదులును ధృత రాష్ట్రరాజుని ఆజ్ఞాప్రకారము పరిశుద్ధములగు ఆసనములందు కూర్చుండిరి. అట్లు ధర్మరాజు తన తమ్ములతో గూడుకొని ధృత రాష్ట్రరాజుని సేవించుచు, భక్తిగలిగియుండెను.

పాండవులు ధృతరాష్ట్రరాజుని సేవించువిధమును చూచుటకు శతయూపుడు మొదలగు మునీశ్వరులు వచ్చిరి. ధృతరాష్ట్రరాజు అధిక వినయముతో వచ్చిన మునులనందరిని దర్భాసనములమీద కూర్చుండబెట్టెను. మునులును పాండవులును ధర్మమయములైన సంభాషణములు చేయుచుండిరి. అంతట మధ్యాహ్నమయ్యెను.

ధృతరాష్ట్రరాజు వినయముతో మునులతో యిట్లనెను. మునులారా! మధ్యాహ్నసమయమాయెను. మధ్యాహ్నకాలమున మీరు చేయ దగిన కార్యములుండును గనుక విజయము చేయుడని ప్రార్థించెను. ఆమునులు తమతమ నివాసములకు వెళ్ళిరి. ధృతరాష్ట్రరాజు మాధ్యాహ్నికకార్యములను చేయుడని పాండవులను బంపించెను. అని వైశంపాయనమునీంద్రుడు జనమేజయమహారాజుతో చెప్పెను. జనమేజయుడు వైశంపాయనునితో యిట్లనెను. వైశంపాయనా! ఆ ప్రకార మడవియం దట్లుండి పాండవులు ఎంతకాలమువరకు ధృత రాష్ట్రరాజుని సేవించిరో చెప్పుమని యడుగగా వైశంపాయను డిట్లనెను. జనమేజయమహారాజా! పాండవులు అడవికివచ్చి ధృత రాష్ట్రరాజును చూచినదినము మొదలుకొని ఒక నెలవరకు ధృతరాష్ట్ర రాజును సేవింపుచు అడవియందే యుండిరి. మొదటిదినమందు ధృత రాష్ట్రుని ఆజ్ఞాప్రకారము అందరును మిక్కిలి వినయముతో కంద మూల ఫలాదులను భక్షించి భూమియందు పండుకొని నిద్రించిరి. మరునాడు మొదలుకొని ధృతరాష్ట్రుడు ఆజ్ఞాపించగా మంచిమంచి అన్నములు మొదలగు పదార్థములను భక్షింపుచు మంచముల మీదను, పాన్పులమీదను పండుకొని నిద్రించిరి. ఇట్లు జరుగుచుం డగా ఒకనాడు పాండవులు యెప్పటివలెనే గాంధారీ కుంతీ సహి తుడైయున్న ధృతరాష్ట్రుని సేవింపుచుండిరి. ఆగోష్ఠికి శతయూపుడు మొదలగు మునీశ్వరులు వచ్చియుండిరి. ధృతరాష్ట్రుడు వచ్చినవార లకు ఆసనములు దెప్పించి కూర్చుండుడని నియమించి గౌరవించెను.

## వేదవ్యాసుడు పాండవ సహితుడైన ధృతరాష్ట్రుని ఆశ్రమమునకు వచ్చుట

జనమేజయ మహారాజా! మునులును పాండవులును ధర్మవిష యకమగుమాటలు మాట్లాడుచుండిరి. అంత వేదవ్యాసమహామునిఅక్క

డకు వచ్చెను. అక్కడుండు వారందరును యెదురుగా వెళ్ళి వ్యాసుని తీసికొనివచ్చి మంచిదర్భాసనముమీద కృష్ణాజినముంచి. అందుపైన వ్యాసుని కూర్చుండబెట్టిరి. వ్యాసమునీంద్రుని అనుమతి ప్రకారము, అందరును తమతమ ఆసనముల నలంకరించిరి. ధృతరాష్ట్రుడు మహాత్ముడైన వ్యాసమునీంద్రుని పూజించెను. వేదవ్యాస మునీంద్రుడు మిక్కిలి ప్రీతిచేత మాధుర్యము గల మృదువాక్యములతో ధృతరాష్ట్రున కిట్లనియెను. పుత్రుడా! ధృతరాష్ట్రా! అడవియందుండుటకు నీమనస్సున సంతోషముగలదా! సహింపగలిగితివా? నియమముగా తపఃక్రియల ఓర్చుకొని జరుపుచుంటివా? పుత్రబంధు మరణ సంబంధమైన దుఃఖము నీమనస్సున లేదుగదా! ధర్మాత్మురాలగు గాంధారికి దుఃఖము లేదుగదా! నీబుద్ధి తత్వజ్ఞాన నిష్ఠనుగలిగి యున్నదికదా! కుంతి మీయిద్దరికిని చక్కగా శుశ్రూషలు చేయుచున్నదికదా! ధృతరాష్ట్రా! మీరు అడవికివచ్చి యుండగా తాను గృహమందుండరాదని తలచి కుంతీమహాదేవి రాజ్యమును విడిచి మీతో అడవికి వచ్చినది. ఇట్టి మంచిబుద్ధిని నీవు గ్రహించితివిగదా! నీమనస్సు ధర్మరాజ భీమార్జున నకుల సహదేవులయందు ప్రేమకలిగియున్నది గదా! నీబుద్ధినిర్మలమైన నడవడిక కలిగి యుండెనా? నీ చిత్తము శాంతము కలిగియున్నదికదా! అని వేదవ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రుని అడిగెను.

ధృతరాష్ట్రుడా! విదురుడు దేహమును విడిచిన విధానమంతయు నాయొక్క దివ్యదృష్టి వలన తెలిసికొంటిని. మాండవ్యమహాముని పూర్వము ధర్మదేవతను శూద్రయోనియందు బుట్టునట్లుగా శపించెను. బ్రహ్మదేవుడు విచిత్రవీర్యుని క్షేత్రమందు ధర్మదేవత బుట్టునట్లుగా ఆజ్ఞాపించెను. అందువలన ఆ ధర్మదేవతయే నీ తండ్రియగు విచిత్రవీర్యుని అధీనమైన శూద్రయోనియందు విదురుడై

నావలన జన్మించెను. ధర్మరాజు ధర్మదేవతయొక్క అవతారము. ఇదియంతయు మహాత్ముడగు విదురయోగీశ్వరుడు తెలిసికొని గొప్ప యోగబలముచేత ధర్మరాజునందు ఐక్యమాయెను. అట్టిధర్మ దేవతా స్వరూపుడైన ధర్మరాజు నీకు ఉపచారములు చేయుచు సేవించు చున్నాడు. ఇదియంతయు నీవు యోచించుకొని సంతోషమును జెందుచుంటివికదా! అని వేదవ్యాస మునీంద్రుడు అడుగగా ధృతరాష్ట్రు డిట్లనెను. తండ్రీ! వ్యాసమునీంద్రా! వనవాసము నాకొంచె మైనను దుఃఖము కలిగింపదు. నా దేహచిత్తములు రెండును తపఃకార్యములం దలవాటుపడినవి. ధర్మాత్ముడైనధర్మరాజు నాకును గాంధారికిని పుత్రదుఃఖము కలుగకుండునట్లు భక్తిపూర్వకముగా సేవింపుచుండును. ధర్మరాజునందును, తమ్ములయందును నాకుమనస్సు పుత్రభావముతో నున్నది. ధర్మరాజు ధర్మదేవతా స్వరూపుడగుట స్పష్టము. ఈ ధర్మరాజు ధర్మదేవతా స్వరూపు డగుటవలన నామనస్సు నందుగల అభిప్రాయము ప్రకారము నేను మాటలాడు పద్ధతిని యితడు యెరిగియే యుండును.

కుంతీదేవియు మాకు శుశ్రూషలు చేయుచు ఆశ్చర్య సంతోషములను కలిగింపుచున్నది. నాకు తత్వజ్ఞాన మనోనిర్మలత్వములు మీ యనుగ్రహమువలన కలుగగలవు. అని యిట్లు ధృతరాష్ట్రుడు మిక్కిలి వినయముతో వేదవ్యాస మునీంద్రునితో చెప్పెను. ఆ సమయమున ద్రౌపదీ సుభద్రలు తక్కిన స్త్రీ జనులు వేదవ్యాసుని చూడదలచి వచ్చి భక్తిపూర్వకముగా వ్యాసునకు నమస్కరించి అక్కడక్కడ నిలిచియుండిరి. దివ్యజ్ఞానియగు వేదవ్యాస మునిసింహుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్రా! కుమారా! నీ యొక్క మనోదుఃఖమును పోగొట్టి మీకు సమాధిరూపమైన బుద్ధిని కలిగింప దలచి యిప్పుడిక్కడకు వచ్చినాను. గనుక సకల

సంశయములను విడిచి నీయొక్క అభీష్టమును కోరుము. నీమనస్సు నకు యిష్టమైన వరమునిచ్చి నీకు సంతోషము కలిగించెదను. అని వ్యాసుడు ధృతరాష్ట్రునితో చెప్పగా పాండవులు పరమానందమును పొందిరి. ధృతరాష్ట్రుడు మిక్కిలి సంతోషమును పొందెను. వ్యాస మునీంద్రుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను.

ధృతరాష్ట్రా ! నా తపస్సు మనుష్యులకు సాధ్యముగా నిది యగును నా తపోమహిమకు మహామునులు ఆశ్చర్యపడునట్లుగా మీ అభీష్టమును అతిసులభముగా యిచ్చెదను గనుక నీ యభీష్టమును చెప్పుము. అని వ్యాసమునీంద్రుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను. తండ్రీ ! వ్యాసమునీంద్రా ! మీరు నాయందు కరుణించి యిక్కడికి వచ్చుటచేత మిక్కిలి కోరవలసినది లేదు. ఇంతకంటె అధిక శుభము మరియొకటి కనబడ లేదు.

మునీంద్రా ! మీకు నిర్మలబుద్ధిచేత నాయందు కృపగలిగి నందున నా జన్మము సఫలమాయెను. నాకు పరలోక విషయమైన భయములేదు. నేను మిక్కిలి కృతార్థుడనైతిని. కాని ఒక్కటి కోరుమని మీరు సెలవిచ్చితిరి. నా మనస్సునందు సర్వదా కలిగి యుండెడి అభిప్రాయమును యెరిగింప వలయును. అది విన్నవించుకొను యెదను. వినుడు దుర్మార్గుడైన దుర్యోధనుడు పుణ్యాత్ములైన పాండవులకు అవమానము కలిగించెను. దుర్యోధనుడు యెవరి మాట లను వినక చతురంగ బలములతో గూడిన సకల రాజులను యుద్ధ మందు చంపించెను. దుర్యోధనుడు భూమియందుగల ఆశచేత ద్రోణ భీష్మ కర్ణాది పుణ్యపురుషులనందరిని చంపుకొనెను. దుర్యోధనాది నీచులకొరకు మహారాజులందరును తమ తమ భార్యాపుత్రులను విడిచి అధికధైర్యముచేత యుద్ధముచేసి మృతిబొందిరి. గనుక అట్లు యుద్ధమందు చచ్చిన రాజులందరును యేగతిని పొందిరో అదియు,

మూఢులై యుద్ధమందు చచ్చిన దుర్యోధనాది కౌరవులు యేగతి బోయిరో అదియును చెప్పవలయును. ఈవిషయమును నేను యెరుగనందున యీ మనోదుఃఖము నాకు అధికముగా నున్నను. ఈ దుఃఖము పోగొట్టుము. అని ధృతరాష్ట్రుడు వ్యాసునితో చెప్పగా ఆ దుఃఖపుమాటను విని గాంధారీ కుంతీ ద్రౌపదీ సుభద్రలును, తక్కిన స్త్రీ జనులును అధికదుఃఖము గలిగియుండిరి. ఆ స్త్రీల కందరికిని క్రొత్తగా దుఃఖములు కలిగినట్లుండెను. అపుడు గాంధారీ దేవి పట్టిచేత కప్పబడిన నేత్రములచేతనే చూచి కృపాస్థానమై యున్న ఆ మామయగు వేదవ్యాసు నుద్దేశించి నమస్కరించుచు యిట్లనెను.

మామగారూ! వ్యాసమునీంద్రా! యీ ధృతరాష్ట్రమహా రాజు తన కొడుకులగు దుర్యోధనాదులు యుద్ధమందు చచ్చినది మొదలుకొని పదియారు సంవత్సరములనుంచి దుఃఖించుచు దుర్యోధనాదులను చూడదలచి వున్నాడు. నీవు నిర్మలమగు తపో మహిమ వలన సకల లోకములను చూపగలవు. ఈ ధృతరాష్ట్రరాజు యొక్క కొడుకులను యితనిదగ్గరకు రప్పించుట అతిశయముగాదు. కుంతీ ద్రౌపదీ సుభద్రలును ధృతరాష్ట్రుని నూర్గురు కోడండ్రును. భూరి శ్రవసుని భార్యయు, ఆమె యత్తయగు సోమదత్తుని భార్యయు, సోమదత్తుని తల్లియు, వీరందరును భారతయుద్ధమందు చచ్చిన తమబంధుసమూహమును చూడవలెనని ఆశకలిగి యుందురు. సర్వ జనుల యభిప్రాయములను తమ దివ్యబోధకు తెలిసియే యున్నవి. గనుక మా మనస్సులయందు గల దుఃఖములు నశించునట్లు యుద్ధ మందు చచ్చిన కౌరవ వీరులను జూపి నీ కరుణ ప్రకాశింపజేసి లోకమునకు ఆశ్చర్యమును కలిగింపజేయుము. అని గాంధారీదేవి వ్యాసునితో చెప్పి ప్రార్థించెను. ఆ సమయమున కుంతీదేవి దుఃఖము

గలిగిన మఃఖము గలదగుచు తన పెద్దకొడుకగు కర్ణుని తలచెను. ఆ కుంతీదేవి తలచుకొనిన తలంపును వ్యాసమునీంద్రుడు తెలుసుకొని కుంతీదేవియందుగల కరుణచేత ఆమెతో యిట్లనెను. కోడలా! కుంతీ! నీ మవస్సునందు గల కోరికను చెప్పినయెడల నీకోరిక ఫలమును కలిగించి నీ దుఃఖమును పోగొట్టెదను. అని వ్యాసముని చెప్పగా కుంతీదేవి సంతోషించి వ్యాసమునీంద్రునకు సాగిలబడి నమస్కరించి చేతులు జోడించుకొని నిలుచుండి సిగ్గుగల మనస్సుతో వినయముచేత వంగి యిట్లనెను.

## కుంతి వేదవ్యాసునితో కర్ణుడు దనకు జన్మించిన తెఱం గెఱింగించుట

మహాత్మా! వ్యాసమునీంద్రా! సకల దేవతలకును నీవే పరమదైవము. ఇటువంటి మహాత్ముడవగు నిన్ను మామగా పొందితిని. మంచికరుణచేత నన్నుజూచి నావిన్నపమువినుము నేనుకన్యకాదశయందు మాతండ్రి గృహమందున్నప్పుడు నా తండ్రిదగ్గరకు మిక్కిలికోపవంతుడైన దుర్వాసుడనెడిమహాముని వచ్చెను. నేను ఆ దుర్వాసమునిని అధిక వినయముచేత పూజించి ఆరాధించితిని. అపుడు దుర్వాసుడు సంతోషించి నాతో యిట్లనెను. కుంతీ! నీకు వరమిచ్చెదను. కోరుమని చెప్పెను. అపుడు నేను దుర్వాసునితో యిట్లంటిని. మహాత్మా! దుర్వాసమునీంద్రా! మీకృపకంటె అధికమైన కోరికలేదు అని అంటినేగాని యేమియు అడుగలేదు. నేనట్లు చెప్పిన మాటలకు దుర్వాసుడు సమ్మతించక, అభిప్రాయమును తన ముఖమందు కనబరచుచు నాతో యిట్లనెను. కుంతీ! సర్వవిధముల చేతను నీకు వరమియ్యక వెళ్ళను. గనుక నీ కోరికను అడిగినయెడల యిచ్చి వెళ్ళెదను. అని దూర్వాస మహాముని నాతోజెప్పగా నాకును

వరపుడుగవలెనని తలంపు కలిగే యున్నది. అపుడు మహాముని పుత్రసంతానము కలుగునట్లు ఒక మంత్రమును నాకు ఉపదేశించి నాతో యిట్లనెను

కుంతీ! ఈమంత్రముచేత నీవు కోరిన దేవతలు వచ్చి నీవశమందు వర్తించినవారై నీకు పుత్రులను కలిగించెదరు. ముఖ్యముగా ధర్మునకు తల్లివి కాగలవు. అని దుర్వాసుడు నాకు నగమిచ్చి అంతర్ధాన మాయెను. అపుడు నేను ఆశ్చర్యమును పొంది ఆ మంత్ర స్వరూపమును సర్వదా మనస్సునందు తలచుచుండును. అంతట ఒక నాడు మిద్దెమీద నేనుండి ఉదయించుచున్న సూర్యుని జూచితిని. అట్లు జూచి నేను కన్యాభావమందుంటిననితలచక బాల్యదశయందు గల అజ్ఞానముచేత వేడుకకొరకు దుర్వాసు డిచ్చిన మంత్రమువలన సూర్యుని ఆవాహించితిని. అట్లు మంత్రబలమువలన ఆవాహించగా సూర్యదేవుడు తాను ఆకాశమందు వర్తించుచు మరియొక పురుష రూపమునుధరించి ఆతత్క్షణమే నాదగ్గరకువచ్చెను. అపుడు నామనస్సు ఆశ్చర్యమందు మునిగినట్లుండెను. అట్లు వచ్చిన సూర్యుడు కోరిన వరమిచ్చెద నడుగమని నాతో జెప్పెను. అపుడు నేను భయముచేత గడగడ వణకుచు నమస్కరించి యిక్కడికి ఎందుకువచ్చితిరి? పొండని చెప్పితిని. అపుడు సూర్యదేవుడు నాతో యిట్లనెను.

కుంతీ! వ్యర్థముగా మంత్రబలముచేత నన్ను పిలిచి రప్పించితివి ఇట్లు వ్యర్థముగా రప్పించుట తప్పగును. గనుక నిన్నును, నీకు మంత్రము యెవడిచ్చెనో వానిని యిపుడు శపింతును. అని సూర్యదేవుడు నాతో జెప్పెను. అపుడు నేను భయపడి నాగురువైన దుర్వాసుని సూర్యదేవుడు శపించునని తలచి అట్టి శాపమునకు ఓర్వజాలక సూర్యదేవునితో యిట్లంటిని. మహాత్మా! సూర్యదేవా! నీతో సమానుడగు పుత్రునియిమ్ము. అని యడిగితిని. అంతట మహాతేజస్సు

గల సూర్యుడు తన తేజస్సుచేత నా సకలేంద్రియ మనస్సులకు మోహము కలిగించెను. అట్లు మోహమును కలిగించిన పిమ్మట కొంతసేపటికి నాకు తెలివికలిగెను. అపుడు సూర్యదేవుడు నాతో యిట్లనెను. కుంతీ! నీవుకొడుకుపుట్టును. నీకు కన్యాభావము చెడకుండు నట్లు వరమిచ్చితిని. అని యిట్లు చెప్పుచు సూర్యుడు ఆకాశమునకు వెళ్ళెను. అంతట నేను నాతండ్రి మొదలగు బంధువుల చిత్తములకు తెలియకుండునట్లు వంచనచేత రహస్యమైన గృహమందు కొడుకును కంటిని. అట్లు కనిన కొడుకును పెట్టెలోనుంచి యేటియందు విడి పించితిని. కర్ణుడు నాకు పుట్టిన వృత్తాంత మంతయు కలకనినట్లు జరిగెను. ఆ కర్ణుని యిపుడు దహింపుచున్నది. ఈ దుఃఖమును మీ దివ్యబోధవలన తెలిసికొని నన్నడిగితిరి. నాకు కలిగిన దుఃఖనిమిత్త మును మీకు చెప్పితిని. మహాత్మా! వ్యాసమునీంద్రా? నేను కన్యా భావమందున్నపుడు కర్ణుని కంటిని. అందువలన నాకు పాపముకలదో, లేదో తెలియదు. ఆకర్ణుడు పుట్టిన విధమును తలచుకొని దుఃఖింపు చుందును. గనుక కర్ణుడు నాకు కన్యాభావమందు పుట్టినందువలన పాపము కలిగెనని భయపడుచున్నాను. నాభయమును పోగొట్టుము. నాయందు దయనుంచి యీధృతరాష్ట్రమహారాజుయొక్క అనుమతి మీద లాభమును పోగొట్టుమని కుంతీదేవి వ్యాసమహామునిని ప్రార్థిం చెను. అపుడు వ్యాసమునీంద్రు డిట్లనెను. కోడలా! కుంతీ! నీవుచెప్పిన కర్ణుడు పుట్టిన వృత్తాంతమంతయు నిశ్చయము. నీయందు అక్రమము కొంచెమైనను లేదు. గనుక పాపమునకు భయపడవలసిన పనిలేదు. లోకమందు స్త్రీలు ఆశ్చర్యకార్యములను చేయగలరు. కర్ణుడు ఆప్రకారము పుట్టిపెరిగి వ్యవహరింపవలసినట్లుగా దైవనిర్మితమై యున్నది. అందుచేత కర్ణుని నీవు యేటిలో విడిచితివి. నీకు కన్యా భావము చెడనందున నీ కులమందు శ్రేష్ఠురాలవైతివి. నీ నడవడిక

మంచిదగుటకు గొంచెమైనను అనుమానము లేదు. అని వ్యాసమునీంద్రుడు అధిక కృపారసముచేత కుంతీదేవితో చెప్పి గాంధారితో నిట్లనెను.

గాంధారీ! నీవు యుద్ధమందు చచ్చిన నీకొడుకులను, నీసహోదరులు మొదలగు బంధువులను చూడగలవు. నీ చెల్లెలగు కుంతియు కర్ణునిచూడగలదు. ద్రౌపదీసుభద్రలును తక్కిన కౌరవస్త్రీలందరును తమతమ అన్నదమ్ములను, కొడుకులను, భర్తలను, మనుమలను, చూచి సంతోషింపగలరు. యుద్ధమందు మృతులైన మీవారినందరిని రప్పించి మీకు చూపి మీకుగల దుఃఖములను పోగొట్టుటకొరకు యిక్కడికిపుడు నేను వచ్చినాను ధృతరాష్ట్రమహారాజును నీవును యీకుంతీదేవియు యుద్ధమందుజచ్చిన మీమీబంధుజనులను జూచిన యెడల దుఃఖము నశించునట్లుగా గోరితిరి గనుక మీ మీ బంధుజనులను రప్పించి మీకుజూపి మీదుఃఖములను పోగొట్టెదను. గాంధారీ! నీకొడుకుల, మనుమలనిమిత్తమై దుఃఖింపతగదు. వారందరును శూరత్వముచేత యుద్ధము చేసి ఆ యుద్ధమందు చచ్చినవారలై స్వర్గలోకసౌఖ్యములను అనుభవింపుచున్నారు. గాంధారీ! నేజెప్పెడిమాటలను చక్కగావినుము. భారతయుద్ధము తప్పక అవశ్యముగా జరుగదగినదై యున్నది. దేవతలందరును యీ మనుష్యయోనులయందు యీ భూలోకమందు బుట్టిరి. అట్లు పుట్టినవిధమును కొంత చెప్పెదనువినుము. స్వర్గమందు గంధర్వులకు ప్రభువైన ధృతరాష్ట్రుడనెడి యొక గంధర్వరాజుగలడు. ఆగంధర్వరాజగు ధృతరాష్ట్రుని అంశమువలన నీభర్తయగు ధృతరాష్ట్రమహారాజు పుట్టెను. మరుద్దేవతాగణముయొక్క అంశమువలన పాండురాజుపుట్టెను. ధర్మదేవతాంశమువలన ధర్మరాజుపుట్టెను. వాయుదేవుడు భీముడుగాపుట్టెను. నరుడనెడి మునీశ్వరుడు అర్జునుడుగా పుట్టెను. విష్ణుదేవుడు కృష్ణుడైపుట్టెను. అశ్వని

దేవతలు నకులసహదేవులుగా పుట్టిరి. ద్వాపరయుగాంశమువలన గాంధారరాజు పుట్టెను. కల్యంశమువలన దుర్యోధనుడు పుట్టెను. రాక్షసులు దుర్యోధనుని తమ్ములై పుట్టిరి. సూర్యునికిరణములు కర్ణుడై పుట్టెను. చంద్రుని అంశమునలన అభిమన్యుడు పుట్టెను. అగ్నిదేవుడు ధృష్టద్యుమ్నుడుగా బుట్టి ద్రౌపదికి సహోదరుడయ్యెను. వాయుదేవుని అంశమువలన శిఖండిబుట్టెను దేవతలకు గురుడగు బృహస్పతి ద్రోణాచార్యుడై పుట్టెను. అష్టవసువుల అంశమువలన భీష్ముడు పుట్టెను. రుద్రాంశమువలన అశ్వత్థామ పుట్టెను. గాంధారీ! కొందరిని మాత్రము యిపుడు నీకు తెలియజెప్పితిని. మరికొందరు దేవరాక్షసుల యంశమునందు బుట్టిరి. అని వ్యాసమునీంద్రుడు గాంధారితో యిట్లనెను.

గాంధారీ! మీమనస్సునందుగల సకలదుఃఖములను పోగొట్టివేసెదను. మీరందరును నాతో గంగానదికిరండు. అట్లు వచ్చిన యెడల యుద్ధమందు జచ్చిన మీమీబంధుజనుల గుంపులను గంగానదియందు జూపెదను. అని వ్యాసమునీంద్రుడు చెప్పుచు లేచెను. అపుడు పెద్దగొంతెత్తి యేడ్చుచు, అరచుచు ధృతరాష్ట్రుడు మొదలగు వారందరును జాగులుతీరి వ్యాసునివెనుక వెళ్ళిరి. అట్లు వెళ్ళునపుడు అక్కడుండు మునిజనులందరును ఆశ్చర్యపడుచు వ్యాసమునీంద్రుని సేవింపుచు గంగానదీసమీపమునకు వెళ్ళిరి. ఆ వెళ్ళిన జనులందరికిని మనస్సులయందు దుఃఖములులేక సంతోషము కలిగియుండెను. జనమేజయమహారాజా! హస్తినాపుర జనులును దేశజనులు మొదలగువారందరును వ్యాసుని వెంబడించుకొని గంగానదీతీరమునకు వెళ్ళిరి. అంతట వ్యాసమునీంద్రుడు పంపగా జనులందరును గంగానదీతీరమందు ఒక మంచి సమభూమియందు దిగిరి. అపుడు వేదవ్యాసుడు. ధృతరాష్ట్రుడు, గాంధారి మొదలగు వారితో యిట్ల

నెను. ధృతరాష్ట్రాదులారా ! యుద్ధమందు చచ్చిన మీ వారందరిని రేపటి వుదయకాలమందు మీకు జూపెదను. అని చెప్పగా ధృతరాష్ట్రుడు మొదలగువారందరును ఆదినశేషమందు గల కాలమును ఆరాత్రియంతయు గడపిరి. ఆదినము గడపుట నూరుసంవత్సరములు గడపినట్లుండెను. అందరును యెప్పుడు తెల్లవారునో, యెప్పుడు యుద్ధమందు జచ్చిన బంధువులను చూతుమో యని కనిపెట్టుకొని యుండిరి. అంతట మరునాడు సూర్యుడు వుదయించెడి సమయ మయ్యెను. ధృతరాష్ట్రుడును పాండవులును, మునులును స్నాన సంధ్యావందనాది కార్యముల దీర్చుకొని వ్యాసమునీంద్రుడున్న చోటికి వెళ్ళి వ్యాసునిచుట్టును కూర్చుండిరి. గాంధారీ మొదలగు స్త్రీలంద రును యొకతట్టునుంచి వ్యాసమునిని సేవింపుచుండిరి. సర్వజనులును తలలెత్తి నిలిచియుండిరి.

## వ్యాసుడు భారతరణమృతులను రావించి చూపుట

వేదవ్యాస మునీంద్రుడు గంగానది యందు స్నానముచేసి మిక్కిలి ప్రీతితో మాధుర్యధ్వనితో యిట్లనెను. ధృతరాష్ట్ర ధర్మ రాజాదులారా! ఇక్కడికిరండు. అని వ్యాసుడు గంగానదియొడ్డుననుండి పిలిచెను. ధృతరాష్ట్రుడు మొదలగువారందరును పురజనులు దేశ జనులు సకలస్త్రీలు వ్యాసునిదగ్గరకు వెళ్ళిరి. జనమేజయ మహా రాజా ! నీకు నేనేమని చెప్పుదును ? గంగానదియందు మిక్కిలి ధ్వని కలిగెను. దుర్యోధనుడు, అతనితమ్ములును, వారికుమార సమూహ ములును, అభిమన్యుడు మొదలగు పాండవుల కొడుకులును. కర్ణ డును, బాహ్లికుడు, సోమదత్తుడు, భూరిశ్రవసుడు మొదలగు సకల కౌరవజనులును, ద్రుపద విరాటరాజులును, వారి బంధుజనులును. శకునియు, అతనితమ్ములును. శకునికొడుకులు మొదలగువారందరును భీష్మద్రోణులను ముందుపెట్టుకొని గంగానదీజలములందు కనబడిరి,

దుర్యోధనాదు లందరును దివ్యదేహములు కలిగి ప్రకాశించుచుండిరి. దివ్యములగు పుష్పదండలు, దివ్యవస్త్రములు. దివ్యభూషణములు, దివ్యగంధపు పూతలు కలిగియుండిరి. వారికి పూర్వమున్న స్నేహితులును, సైన్యపుధటుల గుంపులు కనబడినవి.

జనమేజయమహారాజా! ఆ దినమంతయు ధృతరాష్ట్రునకు నేత్రదృష్టిని వ్యాసమునీంద్రు డిచ్చెను. ధృతరాష్ట్రునకు వ్యాసుడు దృష్టియిచ్చిన సమాచారమును గాంధారి విని తన నేత్రములకు అడ్డము కట్టిన పట్టినితీసి గాంధారియు చూచుచుండెను. అట్లు గంగానదీజలములయందు కనబడిన దుర్యోధనాద సకల జనులును, నవ్వుకొనుచు ఒకరినొకరు మెగతాళి చేసికొనుచు, పగలేక అందరును కూడుకొని స్నేహముకలిగి విలాసముగా నుండిరి. గంధర్వులును, అప్సరస్త్రీలును సంగీతములు పాడుచు ఆనందమును కలిగించుచుండిరి. వంది జనులువచ్చి అహంకార గుణములేని మనస్సుగలవారై పొగడుచుండిరి. దుర్యోధనాదులందరు సకల బంధుజనులకు పరమానందము కలిగించుచు కలిసి తగినపద్ధతి ప్రకారము ఆచారమార్గములను నడపిరి. భారత యుద్ధమందు చచ్చిన కౌరవ పాండవ సంబంధజనులందరును తగురీతిని పితామహ భావముచేతను ఆచార్యభావములచేతను, శిష్యభావములచేతను, మాతృ, మాతామహ, తండ్రి, అన్నదమ్ముల, అల్లుండ్ర, కొడుకులు, కూతుండ్రు, అక్కచెల్లెండ్రు, మనుమలు, దౌహిత్ర, మామ, అత్త, కోడండ్ర, మేనమామల, బావమరదుల, భర్తృ, భార్యా, మిత్ర, భావముల చేతను, సుఖములను అనుభవించుచుండిరి. తండ్రితండ్రి పితామహుడు, తల్లితండ్రి మాతామహుడు, కూతురుకొడుకు దౌహిత్రుడు, ఆయా వరుసలచేత సరస సల్లాప, వినయ నమస్కార ఆశీర్వచన ఆలింగన సంభోగాది సౌఖ్యములను అనుభవించుచుండిరి.

జనమేజయ మహారాజా! దుర్యోధనాది జనులందరు. ధృతరాష్ట్రాదిజనులతో, తమతమ భార్యాలతో, పుత్రాదులతో కలిసి మెలసి తమయిష్ట ప్రకారము భోగము లనుభవింపుచు ఆదినమంతయు ధృతరాష్ట్రాది జనులతో కలసి యుండిరి. ఆప్రకారము కలసి యుండుట సకలజనులును ఆశ్చర్యమును మునిగిరి. వ్యాసమునీంద్రుని మహిమను యేమని చెప్పనచ్చును! ఆదినమంతయు దుర్యోధనాదులు ధృతరాష్ట్రాది జనులతో కలసి మెలసియుండి మాట్లాడుచు తమతమ భార్యలతో రమించుచుండిరి. మరునాటి ఉదయకాలమందు వ్యాసమునీంద్రుడు పంపించగా వచ్చిన రెండుపక్షముల వారగు దుర్యోధనాదులు అన్యోన్యముగా వెళ్ళెదమని చెప్పుకొనుచు తమ లోకములకు వెళ్ళుటకై గంగానదీ జలములయందు ప్రవేశించిరి. దేవతలచేతను నమస్కరింప దగిన వ్యాసమునీంద్రుడును గంగానదీజలములయందు దిగి విధవలగు దుర్యోధనాదుల భార్యలతో యిట్లనెను. కౌరవ స్త్రీజనులారా! మీమీభర్తలతో మీరు వెళ్ళవలయును. గనుక భారతయుద్ధ నిమిత్తమునలన విధవలైన వారందరును గంగానదీ జలములయందు స్నానముచేసి మీమీభర్తలతో వెళ్ళుటకు రండని పిలిచెను. గంగానదీ జలముల యందుండి పిలిచిన వ్యాసమునీంద్రుని మాటలను గంగయొడ్డున నుండెడి విధవస్త్రీలందరును వినిన వారలై ధృతరాష్ట్ర గాంధారీ కుంతీధర్మరాజులయొక్క అనుజ్ఞలను పొంది అతిశీఘ్రముగా వెళ్ళి గంగానదీ జలములయందు మునిగిరి. అట్లు మునుగగా విధవలగు కౌరవస్త్రీలు మొదలగు వారందరును మనుష్యదేహములు విడిచి దేవదేహములను పొంది దివ్యములగు అలంకారములచేత అలంకరింపబడిన దేహములు గలవారై తమ తమ భర్తలను పొందిరి. జనమేజయ మహారాజా ఆవిశేష కార్యమునుజూచి సకలజనులును అధికాశ్చర్య సంతోషమనస్సులుగలవారైరి. అని వైశంపాయనమునీంద్రుడు జనమేజయునితో యిట్లనెను.

జనమేజయమహారాజా! యీ సంతోషకథను, వినినను, చదివినను వారికి అనేకవిధములచేత యిష్టసుఖములు కలుగును. అట్టి జనులకు పుణ్యప్రాప్తి కలుగును. మనస్సునందుగల అభీష్టములు సిద్ధించి బంధుసంబంధి శుభము కలుగును. ఈకథను బ్రాహ్మణులకు వినిపించిన వారికి నాశమే లేని ఆనందపదవి సంభవింపగలదు. ఈకథను విని కొనియాడెడువారికి నీచదశ కలుగకుండునట్లు దేవతలు కనిపెట్టుకొని తిరుగుచు మేలుకలిగింతురు. అని వైశంపాయనుడు చెప్పగా జనమేజయు డిట్లనెను. వైశంపాయనమునీంద్రా! వ్యాసుని యనుగ్రహమువలన ధృతరాష్ట్రుడు నేత్రదృష్టిగలవాడై మృతులైన బంధుజనులను జూచినపిమ్మట యేప్రకారముగా ప్రవర్తించెనో చెప్పుము. పాండవులు యేప్రకారము ప్రవర్తించిరో అదియును జెప్పుము. అని జనమేజయుడు ప్రార్థించగా వైశంపాయను డిట్లనెను.

## ధృతరాష్ట్రుడు నిజాశ్రమమును ప్రవేశించుట

జనమేజయమహారాజా! ఆప్రకారము ఆశ్చర్యముగా భారతయుద్ధమందు జచ్చినవారిని నందరిని ధృతరాష్ట్రుడు చూచి అక్కడికి వచ్చిన మునులను వినయముతో తమతమ నివాసములకు పంపించి తన ఆశ్రమమునకు వెళ్ళెను. ధృతరాష్ట్రుడు వ్యాసమునీంద్రుని ముందుబెట్టుకొని పాండవులను వెంటబెట్టుకొని గాంధారీ కుంతీసహితముగా తన ఆశ్రమమునకు వెళ్ళినపిమ్మట వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రునితో యిట్లనెను. ధృతరాష్ట్రా! నీవు పెద్దలగు మునులవలన వేదశాస్త్రార్థములను వింటివి. నూర్గురు కొడుకులను కంటివి. నీకొడుకులందరును స్వర్గసౌఖ్యముల ననుభవించుచు నీకంటె అధిక భోగవంతులై యున్నారు. నీవును చూచితివిగదా! గనుక ధృతరాష్ట్రా!. నీకొడుకులనిమిత్తమై యింక నీవు దుఃఖింపవద్దు. నీమనస్సును అధిక-

తపోనిష్ఠయందు నిలుపుము ధర్మరాజు నీదగ్గరకువచ్చి ఒక నెలనుంచి నిన్ను సేవింపుచుండెను ధర్మరాజును యింక హస్తినాపురమునకు పంపించుము. అని వేదవ్యాసమునీంద్రుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను.

తండ్రీ! వ్యాసమునీంద్రా ! మీరు చెప్పినట్లు చేసెదను. మీకు నమస్కరించుచున్నాను. మీయొక్క కృపావిశేషమువలన నేను కృతార్థుడ నైతిని. ఇంక మీరు వెంచేయుడని చెప్పెను. పాండవులు వేదవ్యాసుని తగినప్రకారము పూజించిపంపిరి, వేదవ్యాసమునీంద్రుడు వారి నందరిని దీవించి అంతర్ధాను డయ్యెను. ధృతరాష్ట్రుడు ధర్మరాజుయొక్క మనస్సునకు సంతోషము గలుగునట్లుగా దగ్గరకుబిలిచి యిట్లనెను. ధర్మరాజా! నీవు ప్రతినిత్యము సభ చేసి రాజ్యవ్యవహారములను విచారింపకుండరాదు. కురు భీష్మాది మహాత్ములచేత యిది వరకు రాజ్యపరిపాలనాది కార్యములు చక్కగా జరిగినవి. ఇంక నీకేమియు చెప్పవలసినది లేదు. నీకు శత్రువులై అపకారములను చేయువారిని కనిపెట్టి శిక్షింపుము. నీతమ్ములను భార్యలను తీసుకొని శీఘ్రముగా హస్తినాపురమునకు వెళ్ళుము. పుత్రుడా! ధర్మరాజా! నీవలననే. నే నిదివరకు సకల దుఃఖములను విడిచితిని. నీవు పుత్రునివలెనాయందు స్నేహము గలిగి నన్నాదరించినందున కీర్తివంతుడనై సకల సౌఖ్యములను అనుభవించితిని. తపస్సుచేయుట యందు నాకు ఆసక్తిగలిగి యున్నది. గనుక నేను తపస్సునకు వోర్చగలను. నీవు దుఃఖమును విడిచి తపస్సునిమిత్తమై నన్నిక్కడ విడిచి పురజన సైనికులకు ప్రీతికలుగునట్లు వెళ్ళుము. రాజ్యభారమును వహింపుము. అని ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు యిట్లనెను.

తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! నీవు చెప్పిన ప్రకారము చేసెదను. భూమిని రక్షించుటకు భీమార్జున నకుల సహదేవులను

పంపుము. నేను మీ పాదములను సేవించుచు మా తల్లులగు గాంధారీ కుంతులను నిన్నును కనిపెట్టుకొని శుశ్రూషలు చేయుచు తపస్సు చేసికొనుచుండెదను. అని ధర్మరాజు ధృతరాష్ట్రునితో చెప్పగా గాంధారీదేవి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! నీ విట్లు చెప్పరాదు. నీవే కురుకులమును రక్షించువాడవగుదువు. నీ తండ్రులకు పిండ ప్రదానము చేయుటకు నీవే కర్తవగుదువు. నీతండ్రి యగు ధృతరాష్ట్ర మహారాజు చెప్పినట్లు హస్తినాపురమునకు వెళ్ళి రాజ్యభారమును వహింపుము. నీవు వెళ్ళనియెడల దేశజనులందరును దుఃఖింతురు. నీవు వెళ్ళి రాజ్యము చేయుట మా మనస్సులకు ప్రియమై యుండును. అని గాంధారీదేవి ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు కుంతీదేవితో యిట్లనెను. తల్లీ! కుంతీదేవీ! మీరు యెంతదూరము తరిమి చెప్పినను యీ అడవిలో మిమ్మును విడిచి పోవుటకు నా మనస్సు సమ్మతించలేదు. పూర్వమువలె నాకు రాజ్యమందిపుడు అపేక్ష లేదు. పాంచాలరాజులును, మాత్స్యరాజులును యుద్ధమందు జచ్చిరి. వారి స్త్రీలుమాత్రముండిరేగాని రాజులు లేరు. పాంచాల మాత్స్యరాజులు లేనందున రాజ్యమంతయు శూన్యమువలె నాకు తోచుచున్నది. తల్లీ! భారతయుద్ధము జరిగినది మొదలు నా మనస్సు తపస్సు చేయుట యందు యిష్టము కలిగియున్నది. గనుక నేను మీకందరికిని శుశ్రూషలు జేయుచు తపస్సునందు ప్రవర్తించుచు మీకు సందడి కలిగించక యిక్కడుండెదను. అని ధర్మరాజు కుంతీదేవితో జెప్పగా సహదేవుడు ధర్మరాజుతో యిట్లనెను.

అన్నా! ధర్మరాజా! నేను తపస్సు చేసికొనుచు వీరందరికి శుశ్రూషలు చేయుచు యీ ఆశ్రమమందుండెదను, అని సహదేవుడు చెప్పగా కుంతీదేవి సహదేవుని కౌగిటయందు చేర్చుకొని ధర్మరాజాదులగు తన కొడుకులతో యిట్లనెను. కొడుకులారా! మీరు

మా మీఁదగల భక్తిచేతను సుఖముచేతను యీ ప్రకారము చెప్పు
చున్నారు. మీరు చెప్పిన మాటలవలన మా తపస్సునకు విఘ్నము
కలుగునేగాని మా మనస్సునకు ఏకాగ్రత రూపమైన నిశ్చలభావము
కలుగజాలదు. మాకు నియమ విధుల ప్రకారము తపో కార్యములు
జరుగవలయును ఇదియంతయు మీరు యెరిగియుండియు యిట్లు
మాట్లాడితిరి. మీరు సర్వవిధములచేతను హస్తినాపురమునకు వెళ్లుట
మంచిది ధృతరాష్ట్రమహారాజుయొక్క మాటను నిగ్రహింపరాదు.
కొడుకులారా! మీకు సర్వకార్యములయందును శుభము కలుగును.
గనుక పోయిరండు. అని కుంతీదేవి చెప్పెను. ధర్మరాజు మరియొక
మాట చెప్పుటకు భయపడి ధృతరాష్ట్రునితో యిట్లనెను.

తండ్రీ! ధృతరాష్ట్ర మహారాజా! తపస్సుచేత మహాత్ము
లగు మిమ్ము సేవించితిమి. అందుచేత పాపములన్నియు నశించెను.
మీ ఆజ్ఞలు శిరస్సునందుంచుకొని హస్తినాపురమునకు వెళ్ళి వచ్చె
దను. అని ధర్మరాజు ధృతరాష్ట్రునితో చెప్పగా ధృతరాష్ట్రుడు
ధర్మరాజును దీవించి కౌగలించుకొనెను. ధృతరాష్ట్రుడు శాంతపు
మాటలచేత భీముని సంతోషపరచి కౌగలించుకొని అర్జునుని పొగడి
ఆలింగనము చేసికొని నకుల సహదేవులను సంతోషపరచి కౌగ
లించుకొనెను. అంతట పాండవులైదుగురును ధృతరాష్ట్రుని పాదము
లకు నమస్కరించిరి. అయిదుగురిని ధృతరాష్ట్రుడు దీవించెను.
పాండవులు గాంధారీదేవి పాదములకు నమస్కరించగా గాంధారి
అందరిని కౌగలించుకొని దీవించెను. పాండవులైదుగురును కుంతీదేవి
పాదములకు నమస్కరించగా కుంతీదేవి వొక్కసారే అందరిని లేవ
నెత్తి కౌగలించుకొని పరమానందముతో అందరిని ప్రత్యేకముగా
దీవించెను. ద్రౌపదీ సుభద్రలు మొదలగు స్త్రీలందరును తమ
మామయగు ధృతరాష్ట్రునకు, తమ అత్తలగు గాంధారి కుంతీదేవు

లకు నమస్కరించి వెళ్ళుటకు వారి అనుజ్ఞలను తీసికొనిరి. పురజన సైనికులందరును ధృతరాష్ట్రుని అనుజ్ఞ తీసికొనిరి. అందరును ధృతరాష్ట్రి గాంధారీ కుంతీ దేవులయొక్క అనుమతిపొంది తమ పరిచారకుల తోడను. సైన్యములతోడను పురజనులతోడను హస్తినాపురమునకు వెళ్ళిరి జనమేజయ మహారాజా! పాండవులందరు హస్తినాపురమునకువెళ్ళి రాజ్యవ్యవహారములను విచారించుకొనుచు తగినట్లు ప్రవర్తించుచుండిరి. అట్లు కొంతకాలము జరిగిన పిమ్మట ఒకానొక దినమందు నారదమహాముని హస్తినాపురమునకువచ్చి ధర్మరాజును జూచెను. ధర్మరాజు తనతమ్ములతో ఎదురుగావచ్చి నారదునకు భక్తిపూర్వకముగా నమస్కరించెను. అట్లు నమస్కరించి ఆసన అర్ఘ్యపాద్యాదులచేత నారదుని సన్మానించి నారదుని సమీపమందు పాండవులు కూర్చుండిరి. అపుడు ధర్మరాజు నారద మహామునినిచూచి వినయముతో యిట్లనెను. మహాత్మా! నారదమునీంద్రా! మీరు యెక్కడనుంచి వచ్చుచున్నారు. యేయే దేశములయందు సంచరించితిరి. మీకు యేమైనను పనిచేసెదను. చెప్పుడు అని ధర్మరాజు అడుగగా నారదుడు యిట్లనెను.

## ధృతరాష్ట్రాదుల నిర్యాణము

ధర్మరాజా! నేను తపోవనమునుంచి వచ్చుచున్నాను. నేను పుణ్యతీర్థములను సేవించుచు అనేక దేశములయందు సంచరించితిని. నిన్నుజూచి బహుకాలమాయెను. గనుక నిన్నుజూచుటకు యిష్టము గలిగి యిక్కడికి వచ్చితిని. ధృతరాష్ట్రుని సమాచారమును గంగానదీ సమీపమందుండెడి జనులవలన వింటిని. అని నారదుడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను. మహాత్మా! నారదమునీంద్రా! ధృతరాష్ట్రి గాంధారీ కుంతులును, సంజయుడును చిత్తసమాధి గలవారై జీవించి

యున్నారుగదా! అని ధర్మరాజు అడుగగా ఆ దేవమునియగు నారదుడు యిట్లనెను. ధర్మరాజా! సుంచిస్థిరబుద్ధిచేత ధృతరాష్ట్ర గాంధారీ కుంతీదేవులయొక్క వృత్తాంతమును చెప్పెదను వినుము. మీరు అడవికివెళ్ళి ధృతరాష్ట్రుని సేవించి అతని అనుమతినిపొంది యిక్కడికి వచ్చితిరి. కొంతకాలమునకు ధృతరాష్ట్రుడు గాంధారీకుంతీ సంజయులను వెంటబెట్టుకొని యాజక బ్రాహ్మణులచేత అగ్నిహోత్రములు పట్టించుకొని బ్రాహ్మణులను ముందర నడిపించుకొనుచు తన ఆశ్రమమును విడిచి గంగానదీద్వార సమీపమందుండెడి అరణ్యభూమికి వెళ్లెను. అట్లు వెళ్ళిన ధృతరాష్ట్రుడు వాయువును భక్షించుచు అతికఠినమైన తపస్సు చేయుటకు ప్రారంభించెను. గాంధారీదేవియు నీళ్ళను ఆహారముగా జేసికొని సహించి తపస్సుచేయుచుండెను. కుంతీదేవియు మాసోపవాస నియమములచేత తపస్సుచేయుచుండెను. సంజయుడును ఏడుదినములకు ఒక్కసారి భోజనము జేయుచు వ్రతనియమము గలిగి యుండెను.

ధర్మరాజా! తపస్సుచేయు కాలమందు ఒక్కొక్కసారి ధృతరాష్ట్రుడు భక్తితో దగ్గరయున్నప్పుడు యాజకులు తామే అగ్నిహోత్రములయందు హోమములు చేయుచుందురు. మరికొన్ని సమయములందు ధృతరాష్ట్రుడు తనపర్ణశాలను విడిచి జనశూన్యమైన అడవియందు సంచరించుచుండెను. అడవియందు కష్టప్రదేశములలో సంజయుని సహాయమువలన ధృతరాష్ట్రుడును కుంతిసహాయము వలన గాంధారియు ప్రవర్తించుచుందురు. ధృతరాష్ట్రునకు సంజయుడు నేత్రములవలె నుండును. గాంధారికి కుంతి నేత్రములువలె నుండును. ఇట్లు ప్రవర్తించుచుండగా ఒకనాడు ఆ నలుగురును గంగాద్వారమందు స్నానములుచేసి తమ ఆశ్రమమునకు వచ్చుచుండిరి. అప్పుడు గొప్పగాలి కొట్టుచుండెను. ఆ మహావాయువుచేత అగ్నిహోత్రములు

యెగిరి ఆఅగ్ని చేత అడవి దహింపబడెను. అట్లు అడవి కాలుచుండగా ఛటా ఛటా, ఛటా ఛటాయను ధ్వనికలిగెను. వృక్షములు, పొదలు అగ్ని చేత దహింపబడు చుండెను. పచ్చిమ్రాకులును, పచ్చి పొదలును కమలిపోవు చుండెను. అడవియందుండెడి మృగములన్నియు దుఃఖము చేత అధికముగా అరచుచుండెను. అగ్నిహోత్రము వలన అడవియంతయు కాలుచుండగా అక్కడుండు మృగములన్నియు భయపడెను. అట్లు అడవి దహింపబడుచు నాలుగుదిక్కుల యందును కాలుచు మృగములను పోనివ్వక ఆపికొనుచు పుట్టలయందుగల బొక్కలనుండా అగ్నిజ్వాలలు ప్రవేశించి పుట్టలయందుగల సర్పకులములను భస్మము చేయుచుండెను. ఆకార్చిచ్చునకు సకల మృగములు భయపడి పైకి ఎగురుచు ఏదిక్కునకును పోవుటకు వీలులేక అరచుచుండెను. ఇట్లు అన్ని దిక్కులయందును అగ్నిజ్వాలలు ప్రజ్వలించి అధికము లయ్యెను. ఆశ్చర్యముగా పుట్టిన అగ్నిహోత్రమును జూచి దేవతలును భయపడిరి. ధర్మరాజా! యిట్లు కార్చిచ్చు చుట్టుముట్టుకొని అడవినంతయు దహించుచుండెను. అపుడు ధృతరాష్ట్ర గాంధారీ కుంతులు అధికపరకు బహుకాలమునుండి ఆహారములు భక్షింపనందున పరుగెత్తి తప్పించుకొనిపోవుటకు శక్తిలేక యుండిరి. ఆసమయమందు రాజర్షి శ్రేష్ఠుడగు ధృతరాష్ట్రుడు సంజయునితో యిట్లనెను. సంజయుడా! యేదిక్కుయందైనను అగ్నిజ్వాలలు లేని స్థలము చూచుకొని నీవు పరుగెత్తి ప్రాణములనురక్షించుకొనుము. నేనును, గాంధారీ కుంతులను తప్పించుకొని పోజాలము. అని ధృతరాష్ట్రుడు చెప్పగా సంజయుడు దుఃఖించి ధృతరాష్ట్రునితో యిట్లనెను.

మహాత్మా! ధృతరాష్ట్రమహారాజా! మీరు ఏతట్టైనను తప్పించుకొని వెళ్ళినయెడల నేనునూ తప్పించుకొని ప్రాణములను కాపాడుకొనెదను. మిమ్ములను దవాగ్నికి ఆహారముగాయిచ్చి నేను

మాత్రము వెళ్ళజాలను. అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు యిట్లనెను. సంజయుడా! మేము యిల్లువిడిచి తపస్సు చేయుటకు అడవికివచ్చితిమి ఈ అగ్నిహోత్రము వలన మేము చచ్చిన పాపము లేదు. నీవు వెళ్ళదగియుండియు వెళ్ళనియెడల పాపమునకు కారణ మగును. గనుక నీవు యీ అగ్నిని తప్పించుకొని ప్రాణములను కాపాడుకొనుము. అని ధృతరాష్ట్రరాజు సంజయునితో చెప్పి అతను వెళ్ళుటకు సమ్మతింపజేసెను. ధృతరాష్ట్రరాజు సమాధిరూపమైన చిత్తముగలవాడై తూర్పుముఖముగా కూర్చుండెను. గాంధారీ కుంతీ దేవులు ఆప్రకారమే కూర్చుండిరి. సంజయుడు యోగముతో కూడి యుండుమని ధృతరాష్ట్రరాజుతో చెప్పెను. ధృతరాష్ట్రరాజును సంజయుడు చెప్పినట్లు యోగముతో కూడియుండెను. పిమ్మట ఒకా నొకతట్టు అగ్నిలేనివైపు చూచుకొని సంజయుడు పరుగెత్తి వెళ్ళెను. సంజయుడు ఆదవాగ్నిని తప్పించుకొని హిమవత్పర్వతము మీదకు ఎక్కెను. పిమ్మట ధృతరాష్ట్రగాంధారీ కుంతుల దేహమందు అగ్ని ప్రవేశించి వారి దేహములకు దహించెను ఈప్రకారము ధృతరాష్ట్ర గాంధారీకుంతులు ముగ్గురును పుణ్యలోకములకు పోయిరి. నేను గంగానదీ సమీపమునుండి వచ్చుచు అక్కడుండు దివ్యమునులవలన మీరు ధృతరాష్ట్రునిదగ్గరకు వచ్చి మరలినది మొదలుకొని జరిగిన వృత్తాంతమంతయు వింటిని. అగ్నివలన దహింపబడిన ధృతరాష్ట్ర గాంధారీకుంతులయొక్క మూడు కళేబరములను చూచితిని. ధృత రాష్ట్రగాంధారీ కుంతీదేవులు ముగ్గురును పుణ్యగతికిబోయిరి. నీ విక దుఃఖింపక యుండుము. అని ధృతరాష్ట్ర గాంధారీ కుంతులయొక్క మరణవృత్తాంతమంతయు నారదుడు చెప్పగా ధర్మరాజు విని రెండు చేతులను పైకెత్తి పెద్దగా గొంతెత్తి ఏడ్చెను. భీమార్జున నకుల సహదేవులును పెద్దగాఏడ్చిరి. ఆ మరణవృత్తాంతమును విని అంతః పుర స్త్రీలగు ద్రౌపదీసుభద్రమొదలగు వారందరును ఏడ్చుచుండిరి.

ఆ మాటను హస్తినాపురమందుండెడి జనులందరును విని హా! హా! యని అరచుచు సకలజనులును దుఃఖించిరి. అపుడు నారదుడును, బంధుజనులును శాంతవచనములచేత ధర్మరాజునకు దుఃఖమును పోగొట్టిరి. సకలజనులును దుఃఖములేనివారైరి. అప్పుడు ధర్మరాజు నారదునిజూచి యిట్లనెను.

## ధర్మరాజు ధృతరాష్ట్రాదులు మృతులగుటకు శోకించుట

మహాత్మా! నారదమునీంద్రా! యేయే జనులకు యేయే స్థలములందు, యేయే గతులు కలుగగలవో అది తెలియజాలదు. మేమందరముండగా ధృతరాష్ట్రుడు దిక్కులేనిచావు చచ్చెను. ధృతరాష్ట్రమహారాజునకు నూర్గురుకొడుకులు గలిగియు పదివేల ఏనుగులతో సమానమైన బలశక్తి కలిగియుండియు, అడవి చిచ్చులవలన చచ్చెను. అయ్యయ్యో! దైవగతిని ఏమనిచెప్పవచ్చును? ధృతరాష్ట్ర మహారాజు స్త్రీలవలన విసరబడిన చల్లనిగాలిచేత సుఖించుచుండెను. ధృతరాష్ట్ర మహారాజుయొక్క దేహము యిపుడు అడవియందు పడియుండి గ్రద్దలు మొదలగు పక్షులయొక్క రెక్కలచేత విసరకొట్టబడుచుండును. అయ్యయ్యో! దైవగతిని ఏమనిచెప్ప వచ్చును. ఆహా! ధృతరాష్ట్రమహారాజు మృదువులగు సంగీత ధ్వనులచేతను వందిజనులస్తోత్రములచేతను మేల్కొనుచుండును. అట్టి మహారాజు యిపుడు దిక్కులేనివాడై గ్రద్ద కాకులకూతలుగల స్థలమందు చచ్చి పడియుండెను. నారదమునీంద్రా! తన భర్తయగు ధృతరాష్ట్ర మహారాజు మంచి వ్రతనియమమును పొంది అడవికి వెళ్ళుచుండగా గాంధారియు, అతనితో వెళ్ళి పుణ్యగతిని పొందెను. అట్టి గాంధారీ దేవినిగురించి నేను దుఃఖించను. మేము రాజ్యసుఖములను అనుభవించుచుండగా రాజ్యవైభవమును విడిచి అడవికివెళ్ళి అగ్నివలన మృతిబొందిన మాతల్లియగు కుంతీదేవికొరకు అధికదుఃఖము కలుగుచున్నది. ధర్మరాజ భీమార్జునులనెడి ముగ్గురుకొడుకులు తన గర్భ

ముందు బుట్టియుండగా కుంతి ఏకారణమువలన అగ్నిచేత మృతి బొందెనో తెలియదు. కేమందరుండగా మా తల్లియగు కుంతీదేవి దిక్కులేనిదై అడవియందు అగ్నిచేత చచ్చెను. ఇందుకు నామనస్సు దుఃఖింపకుండదు. నారద మునీంద్రా! అర్జునుడు ఖాండవవనమును అగ్నిహోత్రునిచేత దహింపజేసి అగ్నిహోత్రునకు పరమసంతోషము కలిగించెను. అర్జునుని తల్లిని అగ్నిహోత్రుడు దహించి కృతఘ్నుడయ్యెను. (మేలుచేసినవానికి కీడు చేసినవాడు కృతఘ్నుడు) మరియు ఒక దుఃఖము మనస్సునందు కలిగినది. అది విన్నవించుకొనెదను. వినుము. ధృతరాష్ట్రమహారాజు కార్చిచ్చునందు చచ్చెను. అందుకు నేనేమి చేయవలయునో తెలియుటలేదు. అని ధర్మరాజు నారదమహామునిని యడుగగా నారదుడు యిట్లనెను.

ధర్మరాజా! ధృతరాష్ట్రుడు అధిక శాంతగుణముగలవాడై పూర్వదినమందు తగిన పూజావిధానములచేత అగ్నిహోత్రమును ఉపాసించితగిన యజ్ఞక్రియలనుజరిపి అగ్నిహోత్రములను ఉద్వాసము చేసెను. యాజకులైన బ్రాహ్మణులు అగ్నిహోత్రములను అడవిలోనే విడిచి వెళ్ళిరనియు పిమ్మట గాలిచేత ఆయగ్ని అడవి యంతయు వ్యాపించి దహించెననియు నేను దివ్యమునులవలన వినియున్నాను. గనుక ధృతరాష్ట్రుడు తాను ప్రతినిత్యము పూజించెడి అగ్నిహోత్రముల వలననే దహింపబడెను. అందుచేత ధృతరాష్ట్రుని చావుగురించి యేవిధమైన దుఃఖమునైనను పొందవలసిన పనిలేదు. మీతల్లియగు కుంతీదేవియు ధృతరాష్ట్ర గాంధారులకు శుశ్రూషలు చేసి దేవతలు స్తుతించుచుండగా శాశ్వతమైన పుణ్యలోకమునకు బోయెను. వారికి నీవు తిలోదకములను యివ్వవలయును. గనుక ధర్మరాజా! నీవును, నీతమ్ములును అంతఃపుర స్త్రీజనులును శీఘ్రముగా వెళ్ళి గంగానదియందు తిలోదక ప్రదానము చేయుడు,

## ధర్మరాజు ధృతరాష్ట్రాదులకు తిలోదకప్రదానము జేయుట

అని నారదమహాముని చెప్పగా అట్లు చేసెదనని ధర్మరాజు చెప్పి ఒంటివస్త్రమును నియమముతో ధరించినవాడై సకల దుఃఖములను విడుచుటకొఱకు గంగానదికి వెళ్లెను. ధర్మరాజుతో అతని తమ్ము లును, సకల బంధుజనులును సకల స్త్రీజనులును, పురజనులును వెళ్ళిరి. ధర్మరాజు గంగానదికి వెళ్ళి గంగయందు స్నానము చేసి ధర్మ రాజు మొదలగు తగిన జనులందఱును ధృతరాష్ట్ర గాంధారీ కుంతు లకు తిలోదకప్రదానములు చేసిరి. అట్లు చేసి మరలివచ్చి తమకుగల సూతకమును పోగొట్టుటకు హస్తినాపురమునకు వెలుపల వస్త్రముల చేత ఏర్పరచబడిన గుడిసెలయందు నివసించిరి. ఆసమయమున ధర్మ రాజు మంచి పరిశుద్ధులగువారిని రప్పించి ఆజనులతో యిట్లనెను. బ్రాహ్మణోత్తములారా! గంగానదీద్వార సమీపమందు మాతండ్రి ట్లుంగు ధృతరాష్ట్ర గాంధారీ కుంతులు కార్చిచ్చునలన దహింప బడిరి. అమున్గురియొక్క ఎముకలగుంపులను గంగాద్వార జలముల యందు సంస్కారములచేత కలిపి రావలయును. ఆపనికి మీరు వెళ్ళ వలయును. అని ధర్మరాజు బ్రాహ్మణజనులతో జెప్పి ఆస్థలమును తెలిసినవారిని బ్రాహ్మణజనులతో పంపించెను. శ్రాద్ధము చేయుటకు తగిన దినమందు ధర్మరాజు పెద్దలయొక్క అనుమతిని పొంది ధృత రాష్ట్ర గాంధారీ కుంతులకు అనేక రత్నరాసులను, బంగారు రాసు లను, గోదానములను, అశ్వదానములను, ఏనుగులను, కన్యకలను, భూమి, గృహము మొదలగు పదార్థము లనేకములును దానము చేసెను. సర్వజనులును ఆశ్చర్యపడిరి. ధర్మరాజు ధృతరాష్ట్ర గాం ధారీ కుంతులకు నియమముతో పరలోక క్రియలను జేసెను. జనమే జయమహారాజా! ధృతరాష్ట్రాదులకు ధర్మరాజు పితృమేధకార్యము లను చేయునపుడు అన్నపురాసులు పర్వతములుగా నుండెను. నేతి కాలువలు నదులుగా నుండెను. ధర్మరాజు ధృతరాష్ట్రాదులకు పితృ

మేధ కార్యములు జరుపగా అధిక ప్రకాశముగా నుండెను. పితృమేధ క్రియలకు మునిజనులు వచ్చి సంతోషించిరి. సకల బంధుజనులును ఆనందమును పొందిరి. అట్లు పన్నెండు దినములవరకు నారదమహా ముని ధర్మరాజువద్దనుండి ధర్మరాజు చేసిన పితృమేధక్రియలను జూచి పరమానందమునుపొంది ధర్మరాజునకు దీవనలిచ్చెను. అంతట ధర్మరాజు నారదుని తక్కిన మునులను చక్కగా పూజించి పంపించెను. అపుడు మునులు తమతమ నివాసములకు వెళ్ళిరి. అంతట ధర్మరాజు తన బంధుమిత్ర సహోదర సహితుడై హస్తినాపురము నందు ప్రవేశించెను. జనమేజయ మహారాజా! యీప్రకారము భారత యుద్ధము జరిగినపిమ్మట ధృతరాష్ట్రుడు పదిహేను సంవత్సరములు గృహమందుండి దానాది కార్యములను చేయుచుండెను. పిమ్మట అడవికి వెళ్ళి తపోవృత్తిచేత మూడుసంవత్సరములు జీవించియుండెను. ఈ ప్రకారము భారతయుద్ధము పిదప ధృతరాష్ట్రుడు జీవించియుండుటని తెలిసికొనుము. జనమేజయ మహారాజా! యీ ప్రకారము ధర్మరాజు సమస్తవిధములచేతను ధృతరాష్ట్రుని సేవించి కృతార్థుడై సకలజనులును సంతోషించునట్లుగా, సర్వ సామ్రాజ్యమును పరిపాలించెను. అని ధృతరాష్ట్రుని ఆశ్రమవాస విషయమైన వృత్తాంతమును వైశంపాయనముని చెప్పగా విని జనమేజయుడు యిట్లనెను. మహాత్మా! వైశంపాయన మునీంద్రా! అట్లు కృతార్థుడైన ధర్మరాజు రాజ్యమును పరిపాలించుచుండగా కలిగిన విషయములను చెప్పుమని యడిగెను.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణ సుధాకర లక్ష్మణామాత్య
పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన
తెనుగువచన కావ్యంబగు శ్రీ మహా
భారతమందు ఆశ్రమవాసపర్వము
ముగిసెను.

# మౌసలపర్వము



## విషయసూచిక





•

శ్రీ

# మహాభారతము

## వచనము

## మౌసలపర్వము

దేవా! హరిహరనాథా! వైశంపాయన మునీంద్రుడు జనమేజయునిజూచి యిట్లనెను. జనమేజయ మహారాజా! శ్రీకృష్ణదేవుడు భారతయుద్ధమందు ధర్మరాజునకు జయము కలిగించి అతనికి పట్టాభిషేకము చేసినది మొదలుకొని ముప్పదియైదు సంవత్సరములు జరిగెను. ఈ ముప్పదియైదు సంవత్సరముల పర్యంతము ధర్మరాజు హస్తినాపట్టణమందుండి రాజ్యము పరిపాలింపుచుండెను. శ్రీకృష్ణుడు ద్వారకాపట్టణమందుండి సుఖింపుచుండెను. భారత యుద్ధము జరిగిన ముప్పదియైదు సంవత్సరములకు పిమ్మట ముప్పదియారవ సంవత్సరమున జనులకు భయము కలిగింపుచు ఉత్పాతములు పుట్టెను. మహావాయువు రాళ్ళవర్షము కురియుచు విసరికొట్టుచుండెను. సూర్యబింబము ఉదయించు సమయమందు ఆబింబము చుట్టును కబంధసమూహములు కనబడుచుండెను. (శిరస్సులేని గొప్ప శరీరపు మొండెము కబంధమందురు) మేఘములు లేకనే పిడుగులుపడుచుండెను. సమస్తదిక్కుల యందును పెద్దపెద్ద తోకచుక్కలగుపడి రాలిపడుచుండెను. ఆకాశమునుండి అక్కడక్కడ నిప్పులును బొగ్గులును రాలుచుండెను. జనమేజయ మహారాజా! సూర్యచంద్ర బింబములకు చుట్టును, గుండ్రముగా ఆకాశమున పరివేషములు కలుగుచుండెను. మిక్కిలి వేడిగల సూర్యకిరణములచేత ఆకాశమంతయు నిండియుండెను. పెద్దగా మంచుగూడ కురియుచుండెను. ఇట్లు ప్రతి

దినమందును అనేక ఉత్పాతములు కలుగుచుండెను కొంత కాలము దిరిగినపిమ్మట సకలయాదవులును, అన్యోన్యముగా కలహించుకొని చచ్చిరి. కృష్ణబలరాము లిద్దరునుతప్ప తక్కిన యాదవులందరును తమకుతామే కలహించుకొని చచ్చిరి. కృష్ణబలరాము లిద్దరును అడవికివెళ్ళి దేహములను విడిచిరి. ఈ వృత్తాంతమంతయు ధర్మరాజు వినెను. ధర్మరాజు భీమార్జున నకుల సహదేవులను రప్పించి మిక్కిలి విచారముతో అందరికిని యాదవనాశనమును చెప్పెను. పాండవులైదుగురును అధికదుఃఖము గలవారైరి. యాదవనాశనమును విని జను లందరును మిగుల దుఃఖించిరి. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయునితో చెప్పగా జనమేజయు డిట్లనెను.

వైశంపాయన మునీంద్రా! యాదవులకు అన్యోన్యముగా కలిగిన కలహమునకు కారణమును, వారి నాశన వృత్తాంతమును చెప్పుమని ప్రార్థింపగా వైశంపాయను డిట్లనెను. జనమేజయ మహారాజా! పూర్వ మొకానొకప్పుడు కృష్ణుని చూచుటకొరకు కణ్వనారదవిశ్వామిత్ర మహామునులు ముగ్గురును, ద్వారకా పట్టణమునకు వచ్చిరి. వారు రాజమార్గమందు వెళ్ళుచుండగా కొందరు యాదవ కుమారులు దైవమువలన ప్రేరేపింపబడినవారై అవివేకముచేత కృష్ణుని కొడుకగు సాంబునకు స్త్రీ వేషమునువేసి అలంకరించిరి. ఆ వేషమును తెచ్చి కపట వినయముతో నమస్కరించి ఆమునులతో యిట్లనిరి. కృపాసముద్రులగు మునులారా! ఈస్త్రీ బభ్రునిభార్య. ఈ స్త్రీబిడ్డలను కనునా? అనిఅడిగిరి. ఆ మహామునులు ముగ్గురును ఆమాటలకు మిక్కిలి కోపముగలిగి యదుకుమారులతో యిట్లనిరి. యదుకుమారులారా! మీరు ఆడువేషము వేసిన యీమనుష్యుడు కృష్ణుని కుమారుడగు సాంబుడు. వీడు సకల యాదవకులమును నాశనము చేయుటకు తగురోకలిని కనును. ఇది అసత్యముకాదు. గనుక మీరు మామా

టను నమ్ముము. కృష్ణబలరాము లిద్దరును తప్ప తక్కినయాదవు లంద రును ఆపుట్టు రోకలియొక్క అద్భుతప్రభావమువలన చావగలరు. బలరాముడు మిక్కిలి నిష్ఠచేత తన దేహమును విడిచి సముద్రమందు కలియగలడు. కృష్ణుడు భూమియందు పండుకొని యున్నప్పుడు జర యను రాక్షసిద్వారా కృష్ణుని దేహమును విడువగలడు. ఇక మీరు వెళ్ళుడు అని కణ్వ నారద విశ్వామిత్ర మహామునులు ముగ్గురును యదుకుమారులతో కఠినముగా చెప్పిరి.

ఆ మునులు ముగ్గురును కృష్ణుని చూచుట మానుకొని తమ తమ నివాసములకు జనిరి. ఆ వృత్తాంతమును కృష్ణు డప్పుడే వినెను. కృష్ణుడు సర్వజ్ఞుడగుటవలన దైవనిర్మాణమువలన యాదవులకు నాశనము కలుగుననియు, యాదవులకు కలిగిన మునిశాపమును తప్పించుటకై వేరొక ప్రయత్నము చేయనక్కర లేదనియు ఆలోచించుచు ఉపేక్షిం చెను. కృష్ణుడు తన చుట్టును కూర్చుండియుండిన బంధుజనులతో యిట్లనెను. యాదవులారా! యాదవులందరును తమంతట తామే కలహించుకొని అన్యోన్యముగా యుద్ధముచేసి కఠినముగా నశించెదరు. ఇట్లు యాదవులకు నాశము కలుగునని బ్రహ్మదేవుడు యేర్పాటు చేసెను. గనుక మన యదుకుమారులయొక్క అవివేకమువలన మునులు శపించిరని తలంచవద్దు. నామాటను నమ్మి మీరు దుఃఖింప కుండుడు.

## మునిశాపముచేత సాంబుని కడుపున ముసలము పుట్టుట

జనమేజయమహారాజా! కృష్ణుడు తన బంధుజనులతో చెప్పి తన అంతఃపురమునకు వెళ్ళెను. మరునాడు సాంబుడను కృష్ణుని యొక్క కుమారుని కడుపులోనుండి యమదూతవంటి ఒక రోకలి వెలుపలికి వచ్చెను. యాదవు లందరును, మిక్కిలి ఆశ్చర్య భయ ములు గలవారై వసుదేవుని దగ్గరకు వెళ్ళి సాంబుని కడుపులోనుండి

రోకలి పుట్టినదని వసుదేవునితో చెప్పిరి. వసుదేవు డా మాటలు విని భయపడి ఆశ్చర్యముగలవాడై యాదవులతో యిట్లనెను యాదవులారా! మీరు శీఘ్రముగా యీ రోకలిని చూర్ణము చేసి మిక్కిలి వేగముగా వెళ్ళి రోకలిపొడిని సముద్రములో కలిపివేయుడు. అని వసుదేవుడు చెప్పగా యాదవు లందరును పుట్టిన రోకలిని పొడిగాచేసి సముద్రములో చల్లిరి. యాదవు లందరు పిమ్మట భయమును విడిచి ప్రవర్తింపుచుండిరి. గాంధారీదేవి కఠినచిత్తముచేత క్రూరవిధముగా భారత యుద్ధభూమియందుండి యాదవులను శపించెను. గాంధారీదేవి శపించిన విధానమును యాదవులు విని భయపడుచుండిరి. భారత యుద్ధము జరిగినపిమ్మట ముప్పదియారవ సంవత్సరమందు అనేకవిధములగు ఉత్పాతములు పుట్టెను.

## ద్వారకాపురమునందు మహోత్పాతములు అనేకములు పుట్టుట

జనమేజయమహారాజా! కాలపరిపక్వమైనతోడనే యముడు చలించుచుండు యెర్రని నేత్రములు గలవాడై మిక్కిలి భయంకరమైన దండాయుధమును ధరించి ఒక్కొక్క స్థలమందు కనబడక తిరుగుచుండెను. అక్కడక్కడ జనులకు యముడు కనబడగా జను లిదిగో యముడు, అదిగో, యముడని చూచుచు చెప్పుకొనుచుండిరి. యముడట్లు ద్వారకాపట్టణ వీధులందు తిరుగుచు నల్లని దేహముతో మిక్కిలి భయమును పుట్టించు రూపముతో నుండెను. జనమేజయమహారాజా! కణ్వాది మహామునులయొక్క శాపప్రేరేపణముచేత యముడు ద్వారకాపట్టణమందు తిరుగుచు సకల వృష్ణి భోజ అంధక వంశములయందుగల యాదవుల నందరిని చంపుటకు ప్రయత్నించుచుండెను. రాత్రికాలములందు గుడ్లగూబలు అరచినట్లు చిలుకలు అరచుచుండెను. ద్వారకాపురమందు గోవులు గాడిదపిల్లలను యీనుచుండెను,

ముంగిసలకు యెలుకలు పుట్టుచుండెను. కుక్కలన్నియు పిల్లికూనలను పెట్టుచుండెను. కృష్ణబలరాము లిద్దరును తప్ప తక్కిన యాదవు లందరును బ్రాహ్మణ జనులను బాధించుచుండిరి. గురువులకును పెద్ద లకును యాదవులు అవమానము కలిగించుచుండిరి. యాదవు లంద రును సిగ్గునువిడిచి తమతమ యిష్టప్రకారము అన్యాయకార్యములు చేయుచుండిరి. యాదవుల స్త్రీలందరును తమతమ భర్తలయొక్క అనుమతి లేక నేతమతమ కోరికల ప్రకారము చెడుమార్గములయందు ప్రవర్తించుచుండిరి.

జనమేజయమహారాజా! ద్వారకాపట్టణమందు హోమములు చేయునపుడు అగ్నిహోత్రములు నానావిధములగు ఛాయలు గల మంటలచేత మండుచు నానావిధములుగా వర్తించుచు భయంకరమైన వాసనను కలిగియుండినవి. అన్నములు కూరలు మొదలగునవి వండు నపుడు వుడికినతోడనే పొయిమీదనుంచి క్రిందకుదించగా పాత్రములు యందు పురుగులు శబ్దించుచు వెలుపలకు వచ్చుచుండెను. జనమే జయమహారాజా! యీప్రకారము ప్రతినిత్యము ద్వారకాపట్టణ మందు అనేక అశుభసూచకములు కలుగుచుండెను. సర్వజ్ఞుడగు కృష్ణుడు తనమనస్సులో యిట్లని తలంచెను. పూర్వము భారతయుద్ధ మందు దుర్యోధనాదులగు తనకొడుకులు చచ్చినందుకు గాంధారి కోపించుకొని నేడు మొదలుకొని ముప్పదియారవ సంవత్సరమందు యాదవులందరును అన్యోన్యముగా యుద్ధముచేసి చచ్చెదరని యాదవు లకు శాపమిచ్చెను. ఆముప్పదియారవసంవత్సర మిపుడు వచ్చెను. గాంధారీదేవియొక్క శాపము తప్పదు. అది ఫలించగలదు. యాదవు లందరును చచ్చుటకు పుణ్యతీర్థస్థలమైనయెడల మంచిదిఅగును. అని కృష్ణదేవుడు యోచించి తన దివ్యబోధవలన రేపటిదినమందు సకల యాదవులును కలహించుకొని చచ్చెదరని యెరిగి పెద్దసభయందు

కృష్ణుడిట్లనెను. యాదవులారా! రేపటిదినము జాతర చేయవలయును. గనుక మీరు అందరును, సకలజనులతో కూడి సముద్రతీరమునకు భక్తితో రావలయును. అని కృష్ణుడా సభయందు గల యాదవ జనులతో చెప్పి బాజారులయందు ప్రసిద్ధముగా చాటించుటకు తగు మనుష్యుని పంపించెను. ఆమనుష్యుడు పెద్ద ఘంటానాదమును చేయుచు ప్రతీవీధియందును అందరికి తెలియునట్లుగా చాటించెను. జనమేజయమహారాజా! అట్లు చాటించినపిమ్మట రాత్రియందు సకల యాదవులకును ఒక స్వప్నమువచ్చెను. అస్వప్నమందు పెద్దకోరల వంటి పండ్లు కలిగి నల్లనిదేహముగల ఒక స్త్రీవచ్చి తమ యిండ్లలో జొరబడి యాదవస్త్రీలను యీడ్చుకొనిపోయినట్లును సకలశస్త్రాస్త్ర సమూహములను టెక్కెములను. బిరుదులను, సకలభూషణములను మొదలగు పదార్థములను రాక్షసులు అపహరించినట్లు కలకనిరి. యాదవజనులకు యిట్లు స్వప్నముకలిగెను. మరునటి దినమందే పూర్వము కృష్ణునకు అగ్నిదేవుడిచ్చిన చక్రాయుధము మిక్కిలి ఆశ్చర్యముతో అందరు చూచుచుండగా ఆకాశమునకు యెగిరి పోయెను. చక్రాయుధము వెళ్ళినతోడనే కృష్ణదేవుని గరుడచిహ్నమైన టెక్కెము ఆకాశమునకు యెగిరిపోయెను. ఆగరుడచిహ్నమైన కృష్ణుని బిరుదుగల టెక్కెముతోటి బలరాముని తాటిటెక్కెమును ఆకాశమునకు యెగిరిపోయెను. సుగ్రీవ శైబ్య, వలాహక, మేఘ పుష్పములను నాలుగువిధములైన వాహనములగు గుర్రపుగుంపు లతో కృష్ణుని దివ్యరథము ఆకాశమునకు యెగిరిపోయెను జనమే జయమహారాజా! దేవతలు ఆకాశమందుండి శీఘ్రముగా తీర్థయాత్రకు ప్రయాణమై రండని పెద్దధ్వని కలుగునట్లుగా యాదవులతో చెప్పిరి. దేవతలు ఆకాశమందుండి చెప్పిన మాటలను యాదవులందరు విని దేవతలను చూచియు భయపడక తగిన సవరణలచేత

హారములైన కల్లు మొదలగు పదార్థములను, మాంసములను, ప్రతి యింటియందును చేర్చుకొని పెట్టిరి.

## యాదవులందరు కృష్ణసహితులై సముద్రతీరమునకు పోవుట

జనమేజయమహారాజా! యాదవులు భోజనపదార్థములును, భక్ష్యములును, నానావిధములుగా సేర్పరచుకొనిరి. యాదవులు పాలు, చక్కెర, నేయి, మజ్జిగ మొదలగు నానావిధములైన అన్ని పదార్థములును, అక్షతగంధములును పుష్పములు మొదలగు పదార్థములను అధికముగా చేర్చుకొనిరి. ఈ పదార్థముల నన్నిటిని అనేకములగు కావళ్ల చేతను, తలమోపుల చేతను, బండ్ల చేతను మోపించుకొని సముద్రతీరమునకు యాదవులందరు వెళ్లుచుండిరి. యాదవులందరును యేనుగులగుంపులతోడను గుర్రపుదండులతోడను, రథములగుంపులతోడను, నానావిధములైన అలంకారముల తోడను మంచి శ్రేష్ఠములగు మనోహరములగు పుష్పమాలలతోడను భూషణములతోడను, సుగంధములపూతలతోడను, మంచిమంచి వస్త్రముల తోడను, వెళ్ళుచుండిరి. యాదవులందరును ఆశ్చర్యమును కలిగించు అలంకారములను గలవారై ఉల్లాసచేష్టలచేత ప్రకాశించుచు వెళ్ళుచుండిరి.

అప్పుడు కృష్ణునకు తన దివ్యరథము లేనందున మరియొక గొప్ప రథమును కృష్ణసారథియగు దారుకుడు తీసికొనివచ్చెను. కృష్ణుడు రథముమీద యెక్కి కూర్చుండి నిర్వికారచిత్తముచేత వెడలి వచ్చుచుండెను. బలరాముడు భూషణవస్త్రగంధముల అలంకారములు క్రొత్తగా చేసికొనక అదివరకు తన దేహమందుండు భూషణ వస్త్రగంధముల అలంకారములతోడనే వెళ్ళుచుండెను. బలరాముడు అట్లు వెళ్ళుచు యేవాహనము యెక్కక, కొంచెమైనను మనో

వికారము లేనివాడై స్నేహముగా మాటలాడుచు నడచి వెళ్లు చుండెను. యాదవస్త్రీలందరును అందలము మొదలగు వాహన సమూహములమీద యెక్కి మంచి మనోహరములైన అలంకారము లతో మిక్కిలి వైభవముకలిగి వెళ్ళుచుండిరి.

జనమేజయ మహారాజా! యాదవులందరును సముద్రతీరము నకు వెళ్ళిరి. అంతకుముందే కృష్ణదేవుని మంత్రియగు ఉద్ధవుడు చప్పరముమీద యెక్కి విలాసముగా సముద్రతీరమునకు వెళ్ళు చుండెను. సముద్రపు గట్టున కూర్చుండియుండు ఉద్ధవుని దగ్గరకు కృష్ణ బలరామాది యాదవులందరును వచ్చిరి. ఉద్ధవుడు కృష్ణదేవు నితో యిట్లనెను.

మహాత్మా! కృష్ణా! నేను తపస్సుచేసుకొను నిమిత్తమై అడవికి వెళ్ళెదను. అని వుద్ధవుడు చెప్పగా కృష్ణదేవుడు కాల స్వభా వమును యెరిగి యున్నందున వుద్ధవునిమాటకు అడ్డము చెప్పక ఊర కుండెను. బలరాముడును తపస్సుచేయుటకై అడవికి వెళ్ళెదనని కృష్ణదేవునితో చెప్పెను. అపుడు కృష్ణదేవుడు వుద్ధవునకు మాటల చేత నమస్కరించి ప్రీతిపూర్వకముగా అడవికి పంపించెను. వుద్ధవు డును సకల చింతలను విడిచి తపస్సుచేయుటకై అడవికి వెళ్ళెను. బలరాముడు వుద్ధవుని పంపించుటకు వెళ్ళి వినయభక్తులతో వుద్ధవుని అడవికి పంపించి తానా అడవియందు ఒకచోట నిశ్చలమైన నిర్ణయ మైన శాంతమగు మనస్సు గలిగి యుండెను. శాంత చిత్తముగల బల రాముడు ఒంటరిగా అడవియందు ఒకచోట వృక్షమూలముక్రింద కూర్చుండెను. సకల సంసార మోహమును విడిచి పరబ్రహ్మ నిష్ట గల బుద్ధితో కూర్చుండెను. ఉద్ధవ బలరాములు అడవికివెళ్ళిరి. ఇక సముద్రతీరమునకు వచ్చిన యాదవులందరును బ్రాహ్మణ సంతర్పణ ములు చేయుటకై మంచి మనోహరములైన అన్నములను కూరలు

పించినంటులు మొదలగు పదార్థములు పకించిరి. బ్రాహ్మణ భోజనములకు వండించిన పదార్థములను యాదవ స్త్రీలందరును బ్రాహ్మణులకు పెట్టనివ్వలేదు. యాదవులందరును అన్నాది పదార్థములను తమ ఇష్టప్రకారముగా కోతులకు పంచిపెట్టిరి.

జనమేజయ మహారాజా! వినాశకాలము వచ్చినచో విపరీతబుద్ధి కలుగునను పెద్దలవాక్యము నిశ్చయమాయెను. ధర్మాత్ములగు యాదవులకు యింతటి విపరీతబుద్ధి కలిగెను. ఏమి చేసెదము చెప్పుదును? అట్లు బ్రాహ్మణ భోజనము పెట్టింపబూని చేయించిన అన్నాది సకల పదార్థములను యాదవులు కోతులకు పంచిపెట్టిన పిమ్మట సంగీత వాయిద్యములతోను. నాట్యములతోను. అక్షత గంధ పుష్ప ధూపదీపములతోను సముద్రమును పూజించిరి అట్లు పూజించిన పిమ్మట అనేక పదార్థములచేత సముద్రమునకు నైవేద్యము చేసిరి. అంతట యాదవులందరును తమ దేహములకు మత్తు స్వభావమును గలిగింప దలచి తమకు యిష్టములైన పీటలను తెచ్చుకొని ఆ పీటల మీద కృష్ణదేవుని సమీపమునను కూర్చుండిన యాదవులందరును బంగారు కోరలచేత రొట్టె మాంసము మొదలగునవి దీసికొని నంచుకొనుచు కల్లు త్రాగిరి. సాత్యకి, కృతవర్మ, చారుదేష్ణులును, గదుడును, ప్రద్యుమ్నుడు మొదలగు యాదవులందరును, విధివశమువలన తమకు తృప్తికలుగునట్లు మిక్కిలిగా ఒక్కనాడే కల్లు త్రాగిరి. జనమేజయమహారాజా! యీ ప్రకారము వృష్ణి భోజ అంధక వంశస్థులగు యాదవులందరును ఒక కాలమందు తమ ఆశతీరునట్లు కల్లుత్రాగి మదముగలవారై పెద్ద పెద్ద కేకలు వేయుచు అనుకూలముగ ని ప్రతికూలమైన మాటలాడుచు నవ్వుకొనుచు తిరుగుచుండిరి.

## సాత్యకి కృతవర్మలకు గలిగిన రోషజనకమైన సంవాదము

జనమేజయ మహారాజా! యాదవులందరును కల్లుత్రాగిన వారలై మదించి చెడ్డతనముచేత ప్రవర్తించుచుండిరి. ఆ సమయ

మున సాత్యకి గ్రుడ్లు త్రిప్పుచు యెఱ్ఱని నేత్రములు కలవాడై కృతి వర్మయొక్క ముఖమును చూచెను. సాత్యకి తన దగ్గరనున్న ప్రద్యు మ్నుని చేతిని పరుచుచు కృతవర్మని అవమానించు వానివలె పెద్దగా పకపక నవ్వి ప్రద్యుమ్నునితో యిట్లనెను ప్రద్యుమ్నా! ద్రౌపది కొడుకులును, ధృష్టద్యుమ్నుడు మొదలగువారును, రాత్రికాలమందు నిద్రించునపుడు అట్టివారు తన కెంత శత్రువులైనను యెంతతుచ్ఛు లైనను చంపరుగదా! నిద్రించువాడు చచ్చినవానితో సమానుడు. అట్లు నిద్రించు ధృష్టద్యుమ్నాదులను దుర్మార్గుడైన కృతవర్ముడు అశ్వత్థామను సహాయపరచుకొని చంపివేసెను ఇట్టి కార్యమున కెంత నీచుడైనను ప్రయత్నింపడు. కృతవర్మ అంత పాపకార్యమును చేసి నాడని నేను వినియున్నాను. కృతవర్మ నిద్రించు వారలను పొడిచి చంపెనట. ఛీ! ఇట్టి హీను పోటు కాజాలదు. అని సాత్యకి ప్రద్యుమ్ను నితో చెప్పగా ప్రద్యుమ్నుడు సాత్యకితో యిట్లనెను. వృష్టికుల శ్రేష్టుడవగు సాత్యకీ! నిద్రించు వారిని చంపినవాడు నీచుడు. యీ కార్యమును నీవు చెప్పరాదు. అందువలన పాపముకలుగును. గనుక ఆమాట చెప్పకుండుము. ఈ కార్యము చేసినందుకు కృతవర్మను జనులు అధికముగా దూషింపగలరు. అట్లు దూషింపబడుటయే చాలును. అని ప్రద్యుమ్నుడు సాత్యకితో చెప్పగా ఆమాటలన్నియు కృతవర్మవిని రోషచిహ్నమైన వికార ముఖము గలవాడై సాత్యకిని జూచి యిట్లనెను.

సాత్యకీ! నీవుసిగ్గులేనివాడవై యితరుల యుద్ధమును దూషించు చున్నావు అర్జునుడు సైంధవుని చంపబూనిన దినమందు అర్జునుడు భూరిశ్రవుని చేతినినరుకగా భూరిశ్రవుడు శాంతచిత్తుడై ప్రాణములను విడుచుటకు యోగసమాధిని అభ్యసించుచుండెను. శాంతచిత్తుడైన భూరిశ్రవుని శిరస్సును నీవు నరికితివి. అది యిప్పుడు మరచియుంటివా?

షే! ఇట్టియుద్ధము న్యాయముగునా? అని కృతవర్మను సాత్యకితో చెప్పి సాత్యకిని దూషించెను. ఆమాటలను కృష్ణుడు విని భోజకులాధి పతియగు కృతవర్మనిమీద మిక్కిలి కోపముగలిగి యెఱ్ఱని నేత్రములు చేత కృతవర్మను చూచి మిక్కిలి కోపముతో కూడిన మనస్సుతో సకిలభోజకులస్థులను కలియజూచెను. సాత్యకికృష్ణునితో యిట్లనెను. అన్నా! కృష్ణా! యీ దుర్మార్గుడు కృతవర్మయొక్క తమ్ముడు శతధన్వుడనువాడు. పూర్వము శమంతకమణి నిమిత్తమై మహాత్ము డగు సత్రాజిత్తును అన్యాయముగా చంపెను అని సాత్యకి భోజవంశ స్థులయందు కీడు కనుపడునట్లు కృష్ణునితో చెప్పెను. ఈ కలహ వాదనపు మాటలను సత్యభామ విని కోపముగలదై స్త్రీస్వభావము వలన కంటియందు నీళ్ళు కార్చుచు కృష్ణుని యెదుటకు వచ్చెను. అట్టి దుఃఖముతోనున్న మనస్సుగల సత్యభామను కృష్ణుడు చూడగా కృష్ణునకు కృతివర్మాది భోజవంశస్థులమీద మిక్కిలి రోషముపుట్టెను, కృష్ణ సత్యభామలకు రోష కోప దుఃఖములు కలిగినవని సాత్యకి తెలిసికొని కృష్ణదేవునకు సత్యభామకును ప్రీతికలిగింపదలచి దుర్జ నుడై కృతవర్మను చంపదలచి లేచెను.

## మద్యపానమత్తుడైన సాత్యకి కృతవర్మ తలనరుకుట

సాత్యకి క్రోధముచేత కృతవర్మను చూచి యెఱ్ఱని ముఖ నేత్రములుగలవాడై యిట్లనెను. ఈదుర్మార్గుడగు కృతవర్మ అశ్వత్థా మను సహాయముచేసుకొని రాత్రియందు వేగముగా ద్రౌపదీపుత్రు లను ధృష్టద్యుమ్నుని అతని తమ్ములు మొదలగువారి నందరిని చం పెను. అట్టి నీచుడగు కృతవర్మను చంపుట ధర్మము. అని యిట్లు సాత్యకి చెప్పుచు మునిశాపమువలన పుట్టిన రోకలియొక్క అద్భుత శక్తిగల తన కత్తిని తీసికొని కృతవర్మయొక్క శిరస్సును కఠోర

ముగా నరికెను. అందువలన సాత్యకియొక్క కత్తి రక్తమయ మాయెను. సాత్యకి కృతవర్మను నరికి, తన బాహువిలాసముచేత, కత్తిని తీసికొని వేగముగా పడగొట్టి భోజకులముమీదికి పోయెను. కృష్ణుడు సాత్యకిని ఆపుటకు వెళ్ళెను. కృష్ణుడు వెళ్ళుటకు ముందే యుద్ధము చేయుటకు భోజకులస్థులును అంధక కులస్థులునుఒక్కపెట్టున అందరును లేచి అతివేగముగా సాత్యకిని చుట్టుకొనిరి. దివ్యబోధగల కృష్ణుడు విచారరహితమైన మనస్సుగలవాడై యుండి కాలస్వభావము తెలిసి కొని సకల యాదవులును నశింతురను అభిప్రాయముతో తన తమ్ము డైన సాత్యకిని రక్షించుటకు ప్రయత్నము చేయక మానుకొనెను. ప్రద్యుమ్నుడు అఖండ పరాక్రమవంతుడై శౌర్య బాహుబలముల చేత ప్రకాశించుచు సాత్యకి సహాయుడై యుండెను. సాత్యకి ప్రద్యు మ్నుని చూచి సంతోషించి వరుసపెట్టి భోజకులస్థులను క్రమముగా నరికివేయుచుండెను.

ఆకాశమందు దేవతలుండి సాత్యకిని మెచ్చుకొనిరి. సాత్యకి ప్రద్యుమ్నులకు యిద్దరికిని రోషాగ్ని మాత్సర్య శౌర్య పరాక్రమ ములు అతిశయించునట్లుగా వృష్ణివీరులు సింహనాదములు చేసిరి. ఆ సింహనాదముచేత వృష్ణిబలములు సంతోషించెను. ఆకాశమందు ప్రతిధ్వని పుట్టెను. పిమ్మట భోజ అంధక కులముతోకూడిన సైన్య మును వృష్ణివంశస్థులగు సాత్యకి ప్రద్యుమ్నుడు మొదలగువారు నరుకుచుండిరి. మునిశాప బలశక్తివలన అందరును కలిసి జాతిభేదము లేక ఒకరినొకరు కత్తులతో నరుకుకొనుచుండిరి. ఆవిధమంతయు కృష్ణుడు చూచుచు నిలుచుని యుండెను. జనమేజయమహారాజా! యుద్ధముచేయు రెండుపక్షముల యాదవులకును యుద్ధమునకు అక్కడ గల తుంగగడ్డి పరమసాధనమై యుండెను. దైవముయొక్క నేర్పరి తనమును వినుము. మహామునుల శాపమునందున అద్భుతశక్తివలన

రోకలి పుట్టెను. ఆశాపమే అక్కడగల తుంగగడ్డియందు అన్యశ శక్తిగల రోకలి స్వభావమును కలిగించెను. తుంగగడ్డిని యాదవు లందరు పెరికి గడ్డిచేత ఒకరినొకరు కొట్టుకొని చచ్చిరి. సాంబుని కడుపులోనుంచి రోకలి పుట్టగానే ఆరోకలిని పొడిగా చేయించి రోకలి పొడిని వసుదేవుడు సముద్రములో చల్లించెను. అట్లు చేసినను మునుల యొక్క శాపమువలన రోకలిశక్తి నశించలేదు. జనమేజయమహారాజా! యుద్ధము చేయు కాలమునందు కల్లుత్రాగుటచేత కలిగిన మదముపలనను మహామునులయొక్క శాపమునందుగల దివ్యశక్తివలనను యాదవులకు వివేకము లేకపోయెను. వివేకములేక తుంగగడ్డి పెరికి గడ్డిని పశులమీద వేసినంత మాత్రముచేతనే పశులకు బాధ కలుగదని యోచించకుండిరి. తుంగగడ్డిని పెరికి శత్రునిమీద వేసినతోడనే శత్రువు చచ్చిపడుచుండగా గడ్డిచేత శత్రువు యెట్లు చచ్చెనో అని యోచించక గడ్డిచేత కొట్టుకొని చచ్చిరి. గనుక యాదవుల కందరికిని బుద్ధులు పరవశములైనట్లు తోచుచున్నది. కృత్రిమమైన రోకలి యొక్క దివ్యశక్తియే యాదవులందరికిని కఠోరమైన మరణములకు అన్యోన్య కారణమాయెను.

జనమేజయ మహారాజా! రెండుపక్షములుగా యుద్ధముచేసి యాదవులందరును అన్యోన్యముగా కలహించుకొని యుద్ధముచేసి నపుడు తండ్రియనియు, కొడుకనియు, అన్నతమ్ము లనియు, తలచక కొట్టుకొని గొడ్డలిచేత నరుకబడిన వృక్షమువలె భూమిమీదపడి చచ్చిరి. దైవనిర్మాణమును యేమని చెప్పవచ్చును. మునిశాపము యొక్క దివ్యశక్తి యాదవుల మనస్సులయందు ప్రవేశించినందున ఒక్కడైనను తప్పించుకొని పోనేరక అరచుచు యుద్ధముచేసి అందరును పడిచచ్చిరి. అట్టి సమయమున యాదవులలో భోజకులస్థులును అంధక కులస్థులును అధికముగానున్నందున వారిచేత మహాబలవంతు

లగు సాత్యకి ప్రద్యుమ్నాది వృష్ణి వంశస్థు లందరును చచ్చిపడిరి.
జనమేజయ మహారాజా! ఆయుద్ధమందు అనిరుద్ధ, ప్రద్యుమ్న, సాంబ
సాత్యకి, గదుడు మొదలగు వృష్ణివంశస్థు లగువారు సమవారు చచ్చి
పడియుండగా కృష్ణుడు చూచెను. భోజ అంధక కులస్థుల పరాక్ర
మముచేత తనవారందరును చచ్చిపడి యుండగా కృష్ణుడు చూచి
మునిశాపముయొక్క మహాశక్తివలన కోపాగ్ని చిత్తము కలవాడై
యుండెను. కృష్ణుడు మిక్కిలి కోపముగలిగి యుద్ధమునకు ప్రవేశిం
పక బ్రతికియుండు భటులమీద రొంగపరికలను వేసి చంపెను. ఇట్లు
యాదవులను సామాన్య నామముగల భోజ, అంధక, వృష్టికులస్థులం
దరును రోకలియొక్క మహాశక్తివలన నశించిరి. ఇట్లు సకల యాద
వులును నశింపగా నారాయణ మూర్తియగు కృష్ణుడొక్కడే యుద్ధ
భూమియందు నిలుచుండి గాంధారి పూర్వము భారతయుద్ధభూమి
యందు తనను శపించిన వాక్యమును తలచుకొని ఆశ్చర్యపడి భారత
యుద్ధభూమివలెనే యాదవ యుద్ధ భూమియు యున్నదని
వూహించెను.

జనమేజయ మహారాజా! యుద్ధభూమియందు ఒంటరిగా నిలిచి
యుండు కృష్ణుని దగ్గరకు యుద్ధమందు ప్రవేశింపక యుండు దారుక
బభ్రులిద్దరునువచ్చి కృష్ణునితో యిట్లనిరి. మహాత్మా! కృష్ణదేవా!
సకల యాదవులును నశించిరి. ఇక్కడ నీవుండవలసిన పనిలేదు.
మీయన్నయగు బలరాముడు వెళ్ళిన స్థలమునకు వెళ్ళి ఆబలరాము
నితో గూడ తపస్సు చేసికొనుము. అని వారిరువురును చెప్పగా
కృష్ణుడు అట్లు చేసెదనని బలరాముడున్న అడవి భూమికి వెళ్ళెను.
ఆదారుక బభ్రులిద్దరును యాదవకుల నాశమునకు మిక్కిలి దుఃఖము
గలవారై కృష్ణుని వెంబడి అడవికి వెళ్ళిరి. అడవికి వెళ్ళిన కృష్ణుడు
ఒక వృక్షమూలము క్రిందనుండు బలరాముని జూచెను.

## యాదవు లంతయును మరణించినపిదప కృష్ణార్జునుల పౌత్త్ర దారుకుని సంగతి

బలరాముని జూచి కృష్ణుడు తనదగ్గర నున్న దారుకునితో యిట్లనెను. దారుకా! నీవు శీఘ్రముగా హస్తినాపురమునకు వెళ్ళి యాదవులు నశించిన క్రమమును పాండవులకు తెలిపి అర్జునుని యిక్కడకు తీసికొనిరమ్ము. అని కృష్ణుడు చెప్పగా దారుకుడు మహా వేగముగా నడచు గుఱ్ఱములను తెచ్చి ఒకచిన్న రథమునకు కట్టి ఆరథము తోలుకొని శీఘ్రముగా హస్తినాపుర మార్గమును పట్టి వెళ్ళుచుండెను. కృష్ణుడు తనదగ్గర నున్న బభ్రుని జూచి వానితో యిట్లనెను. బభ్రుడా! నీవు సముద్రతీరమునందున్న సకల యాదవస్త్రీలను యేనుగులను మొదలగు వానిని ద్వారకా పట్టణమునకు చేర్చి పిమ్మట ఇక్కడకు రమ్ము. అని కృష్ణుడు చెప్పగా కార్యనిమిత్తము బభ్రుడు వెళ్ళుచుండెను. ఒక బోయవాడు ఒకగడ్డిపరకను తీసికొని బభ్రునిమీద వేయగా ఆ బభ్రుడు పడిచచ్చెను. కృష్ణుని కంటికి కనబడు నంతదూరములోనే బభ్రుడు చావగా కృష్ణుడు చూచి ముని శాపమువలన కలిగిన మహాశక్తికి ఆశ్చర్యము కలవాడై తనయన్న యగు బలరామునితో యిట్లనెను. అన్నా! బలరామదేవా! యేనుగుల గుంపులను, గుఱ్ఱపుదండులను, రథముల గుంపులను, యాదవ స్త్రీసమూహములను, ద్వారకా పట్టణమునకు చేర్చి నేను మరల యిక్కడికి వచ్చెదను. నేను వచ్చుపర్యంతము నారాకకు నీవు కని పెట్టుకొని యీవృక్షము క్రింద నేయుండుము అని కృష్ణుడు బలరామునితో చెప్పి తాను ఏనుగులు మొదలగు వానిని యాదవస్త్రీలను వెంటబెట్టుకొని ద్వారకా పట్టణమునకు వెళ్ళి వసుదేవుని జూచి యిట్లనెను. తండ్రీ! వాసుదేవా! పూర్వము భారతయుద్ధమందు కౌరవకుల నాశమును చూచితిని. ఇప్పుడు యాదవకుల నాశనమును చూచితిని.

సకల బంధువులును నశించునపుడు యిక్కడుండుటకు నామనస్సు సమ్మతింపను. ఇదివరకే మాఅన్నయగు బలరాముడు అడవికి వెళ్ళి యున్నాడు గనుక నేనును అడవికి వెళ్ళి బలరామునితోగూడ తపస్సు చేసికొను చుండెదను. ఇక సర్వవిషయములను మీరే విచారించు కొనుడు నీవు చెప్పినట్లు జరుపుటకు యీ దినమందో లేక రేపో అర్జునుడు యిక్కడికి రాగలడు. అని కృష్ణుడు తనతండ్రియగు వసుదేవునితో చెప్పుచు వసుదేవుని పాదములమీద తన శిరస్సునుంచి భక్తి పూర్వకము గా నమస్కరించెను.

జనమేజయమహారాజా! కృష్ణుడు రాకమునుపే జనులవలన యాదవులందరును యుద్ధముచేసి చచ్చిన విధమును వసుదేవుడు విని సగము ప్రాణమువిడిచినట్లు దుఃఖముచేత కప్పగూలినట్లు పడి యుండెను. కృష్ణుడువచ్చి తానును బలరాముడును అడవికివెళ్ళి తపస్సుచేసికొనెదమని చెప్పగా సకలప్రాణములును పోయిన శవము వలె చేష్టలుతప్పి మొద్దువలెనుండెను. కృష్ణుడు చెప్పిన మాటలను వసుదేవుడున్న స్థితియు, స్త్రీలువిని చూచి అందరును ఒకేసారి పెద్దగొంతెత్తి యేడ్చిరి. కృష్ణుడు వారందరియందును దయగలవాడై స్త్రీలనందరిని ఊరడించి ఆస్త్రీలతో యిట్లనెను. యాదవస్త్రీలారా ఇక్కడికి యిప్పుడే అర్జునుడు వచ్చును. అర్జునుడు మీకు చెప్ప వలసినమాటలు చెప్పి మీదుఃఖములను పోగొట్టగలడు. అనిచెప్పి ఉపశాంతవాక్యములచేత స్త్రీల దుఃఖములను పోగొట్టి తన తండ్రి యగు వసుదేవునిదగ్గర కూర్చుండి వసుదేవుని పాదములను తద చేతులతో మెత్తమెత్తగా పిసుకుచు నేర్పుగలమాటలచేత వసు దేవుని చిత్తభ్రమను పోగొట్టి యిట్లనెను. తండ్రీ! వసుదేవ మహాత్మా! మహాబుద్ధిమంతుడగు అర్జునుడు యిక్కడికి శీఘ్రముగా వచ్చును. అర్జునునిచేత పనులు చేయించుకొని బ్రతికియుండువారిని

యేనుగులు మొదలగువానిని బీదలకు పంచిపెట్టుచుండుము. నేను అడవికి వెళ్ళి తపస్సు చేసికొనెదను. అవశ్యము యిట్లు చేయతగి యున్నది. కనుక విశేషముల మాటలవలన ప్రయోజనములేదు. వేయిమాటలు చెప్పక చేయదగినమాటను ముఖ్యముగా జెప్పితిని. అని కృష్ణుడు వసుదేవునితో తగినమాటలను జెప్పి మాటిమాటికి అర్జునుడు వచ్చునని చెప్పి వసుదేవుని ఆజ్ఞనుపొంది అడవికి వెళ్ళి బలరామునిజూచి అతనితో కృష్ణుడిట్లనెను.

## బలరాముడు శరీరమును విడిచి యనంతునియందు గలయుట

అన్నా ! బలరామా! నీకు భక్తితో నమస్కరించుచున్నాను. మనతండ్రియగు వసుదేవుని అనుజ్ఞనుపొంది యిక్కడికి వచ్చినాను. అని బలరామునితో జెప్పెను. బలరాముడు తన యోగబలమువలన సర్పరూపముగా తన నోటిలోనుంచి బయలువెడలి దేహమును విడిచెను. బలరాముని ముఖములోనుంచి వెడలివచ్చిన మహా సర్పము యెర్రగానుండెను. ఆసర్పమునకు మణులచేత ప్రకాశించు చుండెడి తెల్లని వేయినోరు లుండెను. ఆమహాసర్పముపర్వతమువంటి గొప్ప దేహముకలిగి ప్రకాశింపుచుండెను. బలరాముడు తనయోగ శక్తివలన మహాసర్పరూపముగా ఆకాశమునకు వెళ్ళి సముద్రములో ఆదిశేషుడనెడి సర్పమందు కలియుటకు వెళ్ళుచుండెను. బలరాముడు దేహమును విడిచి సర్పరూపముగా వెళ్ళినవిధమును కృష్ణుడు చూచెను. సముద్రమునకు ఆకాశమార్గముగా వెళ్ళుచుండెడి మహా సర్పమునకు ఎదురుగా అధికవినయముతో వరుణదేవుడు వచ్చి నిలిచెను. సర్పకులములయందు శ్రేష్ఠములైన దేవసర్పము లన్నియు అధికభక్తితో వచ్చి మహాసర్పమును సేవించుచుండెను. సర్పరాజగు వాసుకియు, కర్కోటక, తక్షక, ధారుణ, కుంజర, కుముద. దుర్ముఖ.

పృథుశ్రవ, హ్రాద, వక్రదంత, క్రోధ, శంఖ, పుండరీక, [illegible], అజేయ, ధృతరాష్ట్రుడు మొదలగు దేవసర్పము లన్నియు ఆదిశేషుడగు మహాసర్పమును కొలుచుటకు గంగ మొదలగు మహానదులన్నియు స్త్రీరూపములు ధరించివచ్చి అధికభక్తితో ప్రీతిపూర్వకముగా సేవించుచుండెను.

కృష్ణుడు దివ్యదృష్టిచేత చూచుచుండగా ఆదిశేషుడను అనంతుడు బలరామరూప మహాసర్పమును తనయందు కలిపికొనెను. తనయన్నయగు బలరామదేవుడు దేహమును విడిచి అనంతునియందు కలిసినపిమ్మట కృష్ణుడు అక్కడనుండి లేచి అక్కడక్కడ కూర్చుండి లేచుచు కొంతదూరమునకు వెళ్ళి యిట్లని యోచించెను. నేను యీ భూలోకమందు పుట్టినందుకు గొప్పగొప్ప కార్యములన్నియు తీరిపోయెను. ఇక శరీరమును విడిచి వెళ్ళవచ్చును. కణ్వనారద విశ్వామిత్రులు యాదవులను శపించినప్పుడు జరయను రాక్షసివలన నా దేహమునకు బాధకలుగునట్లు చెప్పియుండిరి. పూర్వము దుర్వాసుడు నాగృహమునకు వచ్చినపుడు పాయసాన్నమును అతని దేహమందంతటను పూసి అరకాలియందు నేను పాయసాన్నమును పూయనందుకు నాఅరకాలియందు ఉపద్రవము గలుగునని చెప్పివెళ్ళెను. అని సర్వలోకపాలుడగు కృష్ణదేవుడు భూలోకమునుండి యీ ప్రకారము మునులవాక్యమును దుర్వాసుని వాక్యమును యోచించి జ్ఞానేంద్రియమనస్సులను అడగించి నిర్బీజనిర్వికల్పకసమాధిని పొంది కాలిమీఁద కాలునుంచుకొని పండుకొనెను.

జనమేజయ మహారాజా! సముద్రములో ఆదిశేషువు నందు పండుకొను శ్రీమన్నారాయణమూర్తి అడవిలో భూమిమీద పండుకొనెను. ఆ సమయమందు జరయను రాక్షసి మెల్లగా తిరుగుచు కృష్ణదేవుడు పండుకొనియుండు అరణ్యభూమికి వచ్చెను. జరరాక్షసి

అక్కడ తిరుగుచున్న బోయవానిని చూచి బోయవాని బుద్ధియందు తన మాయాశక్తిని కలుగజేసెను. బోయవాడు జరరాక్షసియొక్క మాయచేత భ్రమింపబడినవాడై పండుకొని కాలిమీద కాలు వేసికొని యుండెడి కృష్ణుని నల్లని దేహమును చూచి నల్లయిఱ్ఱి మృగమని తలచెను. బోయవాడు కృష్ణుని దేహము నల్ల యిఱ్ఱియనియు, దాని స్వస్థానమందున్నదనియు, వెలుపలికి వచ్చి నిక్కి నిక్కి చూచు చున్నదనియు తలచి తీక్ష్ణమైన బాణమును సంధించి తన శక్తికొలది లాగివేసెను. బాణము కృష్ణదేవుని అరకాలియందు తగిలి మీగాలును భేదించుకొని అవతలపడెను. కృష్ణదేవుని శ్రీపాదమందు బాణము తగి లిన తోడనే బోయవాడు యిఱ్ఱిని తీసికొనుటకు కృష్ణదేవుని దగ్గ రకు వచ్చెను. అట్లు వచ్చి చూచి మహాపురుషుడగు కృష్ణదేవుని తెలిసికొని అధికదుఃఖము గలవాడై గడగడవణకుచు ఆ కృష్ణదేవుని శ్రీ పాదములయందు తన శిరస్సు నుంచి యేడ్చెను. కృష్ణదేవుడు తగిన మాటలచేత ఆ బోయవానిని దుఃఖమును పోగొట్టి తన యిష్ట ప్రకారము జరిగెనని తన మనుష్య దేహమును విడిచి పరము పద మును పొందుటకు వెళ్ళెను.

## శ్రీకృష్ణుడు శరీరమును విడిచి పరమపదమునకు పోవుట

జనమేజయ మహారాజా! కృష్ణదేవుడు తన మనుష్య దేహ మును విడిచి ఊర్ధ్వలోకమునకు వెళ్ళగా దివ్యమునులును, సిద్ధులును, రుద్రవసుమరుదాదిత్యవిశ్వదేవతలు మొదలగువారు, దేవేం ద్రుడు, వినయభక్తులతో యెదురుగా వెళ్ళిరి. కృష్ణునకు యెదురుగా వచ్చిన దేవతలందరును. కృష్ణుని దివ్యదేహపు పాదములకు నమస్క రించి అధికముగా స్తుతించిరి. దేవేంద్రుడు మెల్లగా కృష్ణదేవుని దగ్గ రకు వచ్చి నమస్కరించుచు కృష్ణదేవునితో యిట్లనెను. శ్రీమన్నా

రాయణమూర్తీ! కృష్ణదేవా! నీవు కృపాసముద్రుడ వగుదువు. ధర్మ మార్గమును రక్షించుటకు మనుష్యదేహము పొంది క్రీడించితివి. కంసుడు మొదలగు దేవశత్రుల నందరిని చంపితివి. భారతకులమందు గల చిక్కును పోగొట్టి దుర్యోధనాది దుర్మార్గులను యుద్ధమందు చంపించి భారతవంశమును పరిశుద్ధమగునట్లు చేసితివి. భూభారమును మాన్పుటకొరకు అవతరించి సకల దుర్మార్గులను సంహరించి భూభార మును మాన్పితివి. ఇక పరిపూర్ణ సత్య జ్ఞానానంద స్వరూపమగు నీ నిర్గుణతత్వమును పొందుము. స్వామీ! ఇకమీదట ప్రతియుగమం దును నీభక్తులయొక్క దుఃఖమును పోగొట్టుటకై యీప్రకారమే అవతరింపుచుండుము అని దేవేంద్రుడు చెప్పుకొనిన ప్రార్థనారూపము లగు మాటలను కృష్ణదేవుడు ప్రీతితో వినెను. దేవేంద్రుడు అధిక భక్తితో కృష్ణదేవునిమీద పుష్పవర్షమును కురిపించెను. బ్రహ్మ దేవుడు వచ్చి కృష్ణదేవుని పాదములకు నమస్కరించి భక్తిచేత కృష్ణ దేవుని తప్పక సంతోషముచేత చూచుచు, స్వరయుక్తముగా వేద వాక్యములచేత అనేకముగా స్తుతించెను. అపుడు కృష్ణదేవుడు స్తోత్ర మునకు సంతోషించి కృపాదృష్టిచేత బ్రహ్మాది దేవతల నందరిని జూచి యిట్లనెను.

దేవతలారా! అనిరుద్ధరూపమునుండు అహంకారమును, ప్రద్యుమ్నరూపమునుండు మనస్సును, సంకర్షణరూపమునుండు జీవుని వాసుదేవరూపమున నుండు పరమాత్మను యేకరూపముగా జేసి కొంటిని, ఈనాలుగు వ్యూహములను ఐక్యముచేసికొనినందున పర మానంద నిత్యమంగళ శాశ్వతరూపమగు నా పరమపదమును పొందె దను. మీరు సుఖవంతులై యుండుడు. అని శ్రీమన్నారాయణ మూర్తియగు కృష్ణదేవుడు మృదుమాధుర్యముగా బ్రహ్మాది దేవత లతో చెప్పెను. ఆమాటలకు బ్రహ్మాది దేవతలందరును ఆనందించిరి.

దేవదేవుడగు కృష్ణుడు బ్రహ్మాది దేవతలతో సంభాషించి అవాఙ్మ నస గోచరమగు పరమాత్మ తత్వరూపమైన తన పరమపదమును పొందెను. బ్రహ్మాది దేవతలందరును యింద్రియములకు కనబడని విష్ణుదేవుని బుద్ధిచేత చూచుచు విష్ణుదేవుని దివ్యమంగళ గుణములను స్తుతించుచు తమతమ నివాసస్థలములకు వెళ్ళిరి.

## దారుకుడు పాండవులకు సకలయాదవ క్షయమును చెప్పుట

జనమేజయమహారాజా! యీ చెప్పిన వృత్తాంతమును వింటివి గదా! ఇక దారుకుడు హస్తినాపురమునకు వెళ్ళిన వృత్తాంతమును చెప్పెదనువినుము. అట్లు కృష్ణదేవుడు పంపించగా వెళ్ళిన దారుకుడు హస్తినాపురమునకు వెళ్ళి పాండవులనుచూచి యిట్లనెను. మహాత్మా! పాండవులారా! పూర్వము కణ్వనారద విశ్వామిత్ర మహామునులు ముగ్గురును. యాదవులను శపించియున్నారుగదా! యాదవులు సముద్రతీరమునకు వెళ్ళి కల్లు త్రాగి మదించినవారలై మునుల శాపప్రకారము పుట్టిన రోకలిశక్తి గల తుంగలచేత కొట్టుకొని సకలయాదవులును చచ్చిపడిరి. ఇట్లు కత్తులచేత నరుకుకొని కొందరును తుంగగడ్డి కొట్టుకొనుటచేత బహుమంది చచ్చిపోయిరి. అందరు చచ్చినపిమ్మట కృష్ణదేవుడు తపస్సుచేసికొనుటకు అడవికి వెళ్ళి యున్నాడు. అంతకుమునుపే బలరాముడు అడవికివెళ్ళెను. కృష్ణదేవుడు అడవియందుండి నన్ను మీదగ్గరకు పంపించగా వచ్చితిని. అని దారుకుడు యాదవులు నశించిన వృత్తాంతమంతయు పాండవులతో చెప్పగా పాండవులందరును అధికదుఃఖసముద్రమందు మునిగినట్లుండిరి. సకలయాదవులును చచ్చిరని ద్రౌపది మొదలగు అంతఃపుర స్త్రీలు వినినవారలై అధికధ్వనులు కలుగునట్లుగా గొంతెత్తి పెద్దగా యేడ్చిరి. యాదవనాశమును విని హస్తినాపురమందు గల జను

లందరును దుఃఖించిరి. దారుకుడు అర్జునునితో యిట్లనెను. అర్జునా! కృష్ణదేవుడు నిన్ను పిలుచుకొని తనదగ్గరకు రమ్మని చెప్పగా వచ్చి నాను. అని దారుకుడు చెప్పగా అర్జునుడు దారుకునితో యిట్లనెను.

దారుకా! యాదవ కులము నశించెనని వినినపిమ్మట యిక్కడ నిలిచియుండుటకు నా మనస్సు సహించి యుండదు. శీఘ్రముగా ద్వారకకు వెళ్ళక విలునను నిన్ను పిలువవలసినపని లేదు. అని యిట్లు అర్జునుడు దారుకునితో చెప్పి తన యన్నయగు ధర్మరాజుతో మాట్లాడి అతని అనుమతిపొంది శీఘ్రముగా ద్వారకకు ప్రయాణమై వచ్చుచుండెను. అర్జునుడు దారుకుని వెంటబెట్టుకొని ద్వారకకు శీఘ్రముగా వచ్చెను. అపుడు ద్వారకాపట్టణమున కృష్ణుడు లేనందున మగడు చచ్చిన కులస్త్రీలవలెను, చంద్రుడు లేనట్టి రాత్రివలెను, దీన దశను పొందియుండెను. ద్వారకాపట్టణమును అర్జునుడు చూడగా అర్జునుని మనస్సు అగ్నిచేత దహించినట్లు దుఃఖము కలిగియుండెను. అర్జునుడు దుఃఖముకలవాడై నదీప్రవాహమునకు యెదురుగా నడిచి యీదినట్లు అర్జునుడు ద్వారకకు ప్రవేశించెను. ద్వారకయందుండు పురజనులందరును దుఃఖముచేత పెద్దగా యేడ్చుచు అర్జునుని చూచు చుండిరి. అర్జునుడు నగరులోపలికి వెళ్ళెను. కృష్ణుని పదియారువేల గోపికాస్త్రీలును దుఃఖమును సహింపలేక ముఖములయందు గుడ్డలు కప్పుకొని యేడ్చుచు అర్జునునిదగ్గరకు వచ్చిరి. స్త్రీలనుచూడగా దుఃఖములు స్త్రీరూపములను ధరించివచ్చినవో యన్నట్లుండెను. ఆ స్త్రీలు నడిచివచ్చినప్పుడు, వారికాళ్ళయందు శక్తిలేక తొట్రిగల పడుచుండెను. అర్జునుడు ఆ వచ్చు పదియారువేల స్త్రీలనుచూచి మిక్కిలి దుఃఖముగలవాడై గద్గదకంఠధ్వనిచేత యేడ్చుచు ఒకానొక విధముగా రథముదిగెను. ఆ దుఃఖమును శత్రువులు చూచినను, వారి మనస్సు నూరుచెక్కలుగా పగిలిపోగలవు. రుక్మిణీదేవియు,

సత్యభామయు, పెద్దగా యేడ్చుచు అర్జునునిదగ్గరకువచ్చి దుఃఖము
చేత మూర్ఛిల్లినవారివలె క్రిందబడిరి. తక్కినస్త్రీలును అర్జునుని
చుట్టును చేరి దుఃఖించుచు నాయొక్క దిక్కెవ్వరని దైన్యులై
యేడ్చుచుండిరి. అర్జునుడు ధైర్యమైన మనస్సుగలవాడై ఆస్త్రీల
నందరిని ప్రార్థించెను. దారుకుడు అర్జునుని వసుదేవునిదగ్గరకు
తీసికొనిపోయెను. అర్జునుడు దారుకునితో యిట్లనెను.

దారుకా! యాదవులందరును చచ్చినందున కలిగిన విచారము
గాక కృష్ణుని భార్యలగు యీ స్త్రీలయందును మిక్కిలి దీనరూపము
కనబడుచున్నది. ఈ స్త్రీలముఖములయందును మిక్కిలి విచారమైన
రూపముకలిగియున్నది. వీరిని చూచినందువలన నాకును అట్టిదే
సంభవించినది గాని వేరుకాదు. కృష్ణుడు యేవిధముగా నుండెనో
తెలియకున్నది. ఈ విచారము నాకు మిక్కిలిగానున్నది. కృష్ణుని
సమాచారమును మనకు యెవరు చెప్పగలరో తెలియకున్నది. అని
అర్జునుడు దారుకునితో చెప్పగా దారుకుడిట్లనెను. అర్జునా! నాకును
కృష్ణుని క్షేమసమాచారమును తెలిసికొనవలెనని తలంపుకలదు.
వసుదేవునిదగ్గరకు వెళ్ళినయెడల కృష్ణుని సమాచారము మనకు
తెలియగలదు. అని దారుకుడు అర్జునునితో చెప్పెను. అంత అర్జున
దారుకు లిద్దరును అట్లు చెప్పుకొనుచు కృష్ణుని సమాచారమును యేమ
నివిందుమో యని భయపడుచు తిన్నగా వసుదేవునిదగ్గరకు పోయిరి.

## అర్జునుడు సకలస్వజనక్షయ దుఃఖితుడగు వసుదేవునిజూచుట

వసుదేవుడు బహుదుఃఖముచేత శోషజెంది పాన్పుమీద
పడియుండెను. అట్టి వసుదేవుని అర్జునుడుచూచెను. వసుదేవుడు
అర్జునునిచూడగా క్రొత్తదుఃఖము అధికమైన మనస్సుతో లేచి
అర్జునుని కౌగిలించుకొని చచ్చిన యాదవులపేర్లు వరుసగా చెప్పుచు

గద్గదకంఠధ్వనిచేత పెద్దగా గొంతెత్తి యేడ్చెను, అర్జునుడు వసుదేవుని నూరార్చెను. వసుదేవుడు నాలుక తొట్రుపడుచుండగా అర్జుననిజూచి యిట్లనెను. అర్జునా! యాదవులందరును దేవతలతో సమానమైన పరాక్రమముగలవారై రాక్షసులను చంపి అధికశౌర్య కీర్తులుగలవారై బ్రతికిరి. యాదవులందరును, దైవమునకు కోపము గలిగిన హేతువుచేత నిష్కారణముగా రోషముకలిగి ఒకరితో మరియొకరు యుద్ధము చేసికొనిచచ్చిరి. అందులో నాబిడ్డలును మనుములును దేవతలను జయించెడి పరాక్రమశౌర్యవంతులగుదురు. అట్టివారందరును అన్యోన్యము యుద్ధముచేసి చావవలసివచ్చెను. అర్జునా! అయ్యో! నేనేమని చెప్పుదును? నీశిష్యులగు సాత్యకియు, ప్రద్యుమ్నుడును దేవతలచేత జయింపబడినవారగుదురు. సాత్యకి ప్రద్యుమ్ను లిద్దరును భయంకరమగు యాదవయుద్ధమందు మొట్టమొదట నే చచ్చిరని నేను వినియు నింకను బ్రతికియున్నాను మొట్టమొదట సాత్యకి కృతవర్మలకు జరిగిన రోషపుమాటలచేత యుద్ధముకలిగినది. ఆసాత్యకి కృతవర్మలను దూషింపరాదు. మునుల శాపమువలన యిట్లు జరుగవలసి జరిగినదేగాని మరియొకటికాదు. కృష్ణుడు తలచిన యెడల యెంత గొప్ప కార్యమైనను సులభముగా సాధింపగలడు. చచ్చిపుట్టిన పరీక్షిత్తునకు ప్రాణములను కలిగించెను గదా! యాదవులు కలహించుకొని యుద్ధము చేయునపుడు కృష్ణుడు కలహములను మాన్పక ఉపేక్షించి చూచుచు నూరకుండెను. యాదవులందరును అవశ్యము చావతగియుండునని తలచి కృష్ణుడు పుపేక్షించెను. అర్జునా! దైవవశమువలన యాదవులందరును కలహించుకొని చచ్చిరని నాకు వివేకశక్తి కలుగలేదు. అతి కఠోరముగా యాదవకులమంతయు నశించెనని నామనస్సునకు మిక్కిలి దుఃఖము కలుగుచున్నది. అని వసుదేవుడు చెప్పగా అప్పుడు అర్జునుడు యిట్లని

యోచించెను ఈ వసుదేవుడు చెప్పిన మాటలలో పాండవులు కల హించుకొనినపుడు కృష్ణుడు ఉపేక్షించి భూభారకుడైనని చెప్పెనే గాని కృష్ణుని పేరుచెప్పి దుఃఖించలేదు. గనుక కృష్ణుడు అవశ్య ముగ జీవించి యుండవచ్చును. అని యిట్లు అర్జునుడు యోచించు చుండెను.

## వసుదేవు డర్జునునకు యాదవనాశనము తెర గెరింగించుట

ఆ సమయమునందు వసుదేవుడు అర్జునునితో మరల యిట్లనెను' అర్జునా! కణ్వనారద విశ్వామిత్ర మహామునులయొక్క శాపమువలన సాంబుని గర్భములోనుంచి రోకలి పుట్టెనుగదా! అద్భుతశక్తిగల రోకలితో సమానశక్తివంతములైన లుంగగడ్డిని పెరికి. ఆ యాదవు లందరును వొకరినొకరు కొట్టుకొని మృతులైరి. పిమ్మట కృష్ణు డొక్కడే సకల యాదవ స్త్రీలను తీసికొనివచ్చి ద్వారకకు చేర్చి నాడు. యేనుగులగుంపులను, గుర్రపు దండులను, రథ సమూహము లను కృష్ణుడొక్కడే తోలుకొని ద్వారకకు వచ్చినాడు. అని యిట్లు వసుదేవుడు చెప్పగా అర్జునుడిట్లనెను. మామగారూ! వసుదేవా! ఆ మహాత్ముడగు కృష్ణుడు యెక్కడికి వెళ్ళెనో చెప్పుము. అని అర్జు నుడు తన మనస్సు తల్లడబడగా వసుదేవుడు అర్జునునిజూచి యిట్ల నెను. అర్జునా! కృష్ణుడు, నా దుఃఖమును పోగొట్టుటకొరకు నాతో చెప్పిన మాటలను చెప్పెదను వినుము. తండ్రీ! వసుదేవా! దైవా ధీనమువలన వృష్ణిభోజ అంధక కులములకు నాశము కలిగెను. విధి వశమువలన యిట్లు జరిగినేగాని మరియొకటికాదు. అర్జునునకు నా వృత్తాంతమంతయు చెప్పి పిలుచుకొని వచ్చుటకై దారుకుని పంపి యున్నాను. అర్జునుడు ఇప్పుడే యిక్కడికి రాగలడు. అర్జునుడు నీ యందు భక్తిగలవాడగును. నిన్ను సేవించుచు నీవు చెప్పిన పనులను

చేయుచుండగలడు. అర్జునుడు మహాబల బుద్ధిమంతుడై శౌర్యవిక్ర
మములు గలిగి చేయదగిన కార్యమును యెఱింగియుండెను. నాకును
అర్జునునకును కొంచెమైనను భేదములేదు. మా యిద్దరి రూపము
నొక్కటే యగును. గనుక నీవు దుఃఖమును విడువుము. అర్జునుని
చేత యేనుగు, గుఱ్ఱముల సమూహములను బంధువులను రక్షించు
కొనుము. తండ్రీ! వసుదేవా! అర్జునుడు స్త్రీలను బాలురను విచా
రించుకొని మిక్కిలి ప్రయత్నములచేత ఆపదలను పోగొట్టగలడు.
కొన్ని దినములలో సముద్రము యీ ద్వారకను ముంచివేయగలదు.
యాదవులు అన్యోన్యముగా యుద్ధము చేసి చావకమునుపే బలరా
ముడు అడవికి వెళ్ళి తపస్సు చేసికొనుచున్నాడు. నేను ఆ ప్రకా
రమే తపస్సు చేసికొనెదను. వేయిమాటలు చెప్పుట వలన ప్రయో
జనములేదు. గనుక మనస్సునందువిచారములను విడిచి నేను తపస్సు
నకై వెళ్ళుటకు అనుజ్ఞనిమ్ము. తండ్రీ! వసుదేవా! అర్జునుడు
చెప్పిన ప్రకారము జరుపుకొనుము. యుద్ధమందు చచ్చిన యాదవు
లందరికిని అర్జునుడే అగ్నిసంస్కారములు చేయువాడగును. అర్జునుడే
కొంతకాలమునకు నీకును పరలోక కార్యములను చేయగలడు.
అర్జునుడు నీయందు పరమభక్తి గలిగియుండును. అని కృష్ణుడు
నాతో చెప్పగా ఆ మాటలకు నేను సమ్మతించి కృష్ణుని అడవికి
తపస్సు చేయుటకు పంపించితిని. ఇక మీదట నీవు చెప్పినట్లు
చేసెదను. నీ యిష్టమునకు ప్రతికూలమైన మాటను చెప్పను. నా
మనస్సునయందుండు పరితాపమును చెప్పెద వినుము. యుద్ధభూమి
యందు పీలుగుపెంటలుగా బడియున్న నా బిడ్డలనందరిని సర్వదా
తలచుచుండక మానరాదు. ఇది నిశ్చయము. నా కిపుడు కలిగిన
పుత్రదుఃఖమువలన అన్నపానములయందును నా కిష్టములేదు. ఇందరు
చావగా నా దేహమందు యేవిధముచేతను ప్రాణమునిలువదు. గనుక

నీవు యీ స్త్రీలను, బాలురను, యేనుగు గుఱ్ఱములను యితర వస్తువులను తగిన ప్రకారము విచారించుకొనుము. కృష్ణుడు చెప్పి నట్లు చేయుము. అని వసుదేవుడు అర్జునునితో చెప్పగా అప్పుడు ఆ యర్జునుడు వసుదేవునకు దేహాయంను అపేక్ష లేదని యెరిగి విచార మైన మనస్సు కలవాడై వసుదేవునితో యిట్లనెను.

మామా! వసుదేవా! కృష్ణుడున్న ప్రదేశమును చూడవలె నని నాకు కోరిక గలిగి యున్నది నేను చెప్పుమాటలను వినుము. ధర్మరాజ భీమ నకుల సహదేవులును, నేనును ద్రౌపదియు. ఒక్క మనస్సు గలవారిమే యగుదుము. ఈ ప్రకారము యాదవులు నశింతురనియు ద్వారకాపట్టణమును సముద్రము ముంచుననియు ధర్మరాజు ముందుగా తెలిసికొని మాతో చెప్పిన మాటలను చెప్పె దను వినుము. భీమాదులగు తమ్ములారా! యాదవులు నశించు నట్లును, ద్వారకను సముద్రమును ముంచునట్లును తెలియుచున్నది. గనుక ద్వారకయందుండు మన యాదవ బాలురను స్త్రీసమూహము లను తగిన ధనాది పదార్థములను ఇంద్రప్రస్థపురమునకు చేర్చ వలయును. అని ధర్మరాజు మాతో చెప్పియున్నాడు. గనుక వసు దేవా! వీరందరును యింద్రప్రస్థపురమందు సుఖముగా నుండునట్లుగా అక్కడికి చేర్చెదను. నిన్ను ముందుపెట్టుకొని యీ స్త్రీ బాలాదు లందరిని తీసికొని వెళ్ళెదను. నీ మనస్సునందుగల దుఃఖమును విడు వుము. దైవముచేత కలుగవలసిన పనులు కలుగక మానవు. అని అర్జునుడు వసుదేవునితో చెప్పి తన దగ్గిరనుండు దారుకుని చూడగా ఆ దారుకుడు మిక్కిలి దుఃఖముచేత కుందుచుండెను. దారుకుడు కుందుచున్నాడని అర్జునుడు తెలిసికొని దారుకుతో యిట్లనెను. దారుకా! కృష్ణుడు వెళ్ళినచోటు తెలిసికొని నీవును నేనును వెళ్ళె దము. ఈ ద్వారకాపురమందు చేయదగిన కొన్ని కార్యములు

గలవు. ఆ కార్యములను మంత్రులతో చెప్పి వెళ్ళినయెడల యుక్తముగా నుండును. గనుక నీవే వెళ్ళి మంత్రులను పిలిచికొనిరమ్ము. అని అర్జునుడు దారుకునితో చెప్పగా దారకుడు వెళ్ళి ద్వారకాపట్టణమందుగల వసుదేవుని మంత్రులను పిలుచుకొని వచ్చెను. సుధర్మ మను సభామంటపమునకు ముందుగానే అర్జునుడు వెళ్ళెను. అర్జునుని దగ్గరకు ఆ మంత్రులు రాగా అపుడర్జునుడు ఆమంత్రులను కౌగిలించుకొని దుఃఖాగ్నిచేత దహింపుచున్న మనస్సుతో ఆమంత్రులతో యిట్లనెను.

మంత్రులారా! ఇప్పుడు పురజనులను పిలిపింపుడు. ఆ పురజనులకును మీకును చెప్పవలసిన కొన్ని మాటలు కలవు. అని అర్జునుడు చెప్పగా వసుదేవుని మంత్రులు వేగముగా ద్వారకయందుండు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు మొదలగు జనులలో ముఖ్యమైన వారిని రప్పించిరి. బ్రాహ్మణాది జనులందరును తగు ఆసనము మీద కూర్చుండియున్న అర్జునునిజూచిరి. అర్జునుడును జనులందరిని కలయజూచి దీనమగు ముఖముతో యిట్లనెను.

జనులారా! నేడు మొదలు యేడవ దినమందు యీ ద్వారకాపురమును సముద్రము ముంచగలదు. అని ఆకాశమందు దేవతలు చెప్పగా నేను విని యున్నాను. గనుక మనము శీఘ్రముగా యీ ద్వారకను విడిచి వెళ్ళవలయును. కృష్ణుని మనుమడగు వజ్రదేవుని ఇంద్రప్రస్థపురిమునకు ప్రభువుగా జేసెదను. వజ్రదేవుడు మీకు రాజుగానుండి మిమ్మును రక్షింపగలడు. గనుక వసుదేవుడు యిదివరకు మిమ్ము రక్షించినట్లే వజ్రదేవుడును రక్షింపుచుండును. వజ్రదేవుని ఆజ్ఞాప్రకారము యింద్రప్రస్థ పట్టణమందు సుఖముగా నుండుడు. జనులారా! యీ ద్వారకయందుండు మీ సామగ్రులను మనుష్యులచేత మోయించుకొని వెడలుడు. నూపులుగా కొన్ని వస్తువు

లను కట్టుకొనుడు. మీరు వేగముగా బండ్లను తయారుచేసుకొని ఆ బండ్లమీద మీమీ సామాగ్రు లన్నిటిని యింద్రప్రస్థమునకు చేర్చుకొనుడు. వాహనములు మొదలగు పదార్థములు, పసిముట్లు సిద్ధము చేసికొని తలచినప్పుడు వెళ్ళుటకు తయారుగా నుండుడు. ఈ దేశమునందుగల జనులందరును ధర్మరాజు వలన ఆదరింపబడి సౌఖ్యవంతులు కాగలరు. యాదవులు నశించినందున యిక ధర్మరాజే మనకందరకును రక్షకుడగును. అని అర్జునుడు పురజనులతో చెప్పి పంపెను. పురజనులు వెళ్ళినపిమ్మట వసుదేవుని మంత్రులతో అర్జును డిట్లనెను.

మంత్రులారా! ఏనుగులు మొదలగు వాహనములను తీసికొని వెళ్ళుటకు తగిన పరిచారక జనులను సిద్ధముచేయుడు. నగరునందలి సామాగ్రులను ధనములను తీసికొని వెళ్ళుటకు తగిన మనుష్యులను నియమింపుడు. ప్రయాణమై వెళ్ళు విషయమును మరువవద్దు. నేటికి యేడవ దినమందు ద్వారకను సముద్రము అవశ్యముగా తప్పక ముంచివేయగలదు. స్త్రీలను బాలురను సుఖముగా పంపుటకు అందలములు మొదలగు వాహనములను తయారు చేయించవలెను. ధైర్యముగలిగి జాగ్రత్తగా నుండుడు. మంత్రులారా! గడచిన కార్యములకు చింతించుటవలన ప్రయోజనములేదు. మనకు ధర్మరాజు గలడు. గనుక భయపడవద్దు. చావగా మిగిలిన జనులకు కృష్ణుని మనుమడగు వజ్రదేవుని ప్రభువుగా చేయవచ్చును.

## వసుదేవుడు శరీరమును విడిచి పరమగతికి పోవుట

అర్జును డీరీతిగా వసుదేవుని మంత్రులతో చెప్పి వారివారి గృహములకు పంపించి తాను మిగుల విచారముతో కూడిన మనస్సు కలవాడై ఆరాత్రియందు కృష్ణుని గృహములో నివసించెను. ఆరాత్రి

వేకువజామున నిర్మలమగు యోగసిద్ధివలన వసుదేవుడు దేహమును విడిచి పరమపదమును పొందెను. అపుడు వసుదేవుని గృహమందు యేడ్పులు వినిపించెను. వసుదేవుని భార్యలలో దేవకీదేవి మొదలగు నలుగురు భార్యలు సహగమనముచేసి చచ్చుటకు నిశ్చయించిరి. ఆ విచారకరమగు ధ్వనులను విని అర్జునుడచటికి వెళ్లెను. అర్జునుడు మిక్కిలి వైభవముతో వసుదేవుని కళేబరమును దహింపదలచి ఒక విమానమును కట్టించెను ఆ విమానమునందు పుష్పమాలలును అరటి స్తంభములును బంగారుకుండలతో నిర్మింపబడిన శిఖరములును గలవు. వసుదేవుని మృతశరీరమునకు అర్జునుడు స్నానము చేయించి చందనము పూసి చీనాపట్టువస్త్రముల చేతను ఆభరణముల చేతను, పుష్పమాలలచేతను అలంకరింపజేసెను. యాచకులగు బ్రాహ్మణోత్తములు మంత్ర తంత్ర విధులచేత కార్యములనుజరిపి సామవేదమను గానము చేయుచుండిరి. వసుదేవుని భార్యలగు దేవకియు, రోహిణియు, భద్రయు, మదిరయు అను నలుగురును తగు విమానములమీద యెక్కి వసుదేవుని విమానము వెనుక వచ్చుచుండిరి. వారివెంబడి చెలికత్తెలును, చుట్టములును, వచ్చుచు దుఃఖించుచుండిరి. వసుదేవుని భార్యలు నలుగురును, విచారించు జనులకు దుఃఖములను పోగొట్టు మాటలను చెప్పుచు తెలివిగా నుండిరి. వసుదేవుని విమానము వెనుక దేవకి మొదలగువారి విమానములును ముందు యాజకుల అగ్నిహోత్రములును నడుచుచుండెను. ద్వారకా పురజనులందరు మిక్కిలి విచారించుచు కన్నీరు కార్చుచు హాహాకారములతో వెనుకను ప్రక్కను నడచుచుండిరి, ఇంతకు మునుపే వసుదేవుడు వేడుకకై వెడలుచుండు తోటయందు మంచిగంధము, అగరుకర్రలచేత గొప్ప చితిపేర్చి యుంచిరి. ఆ చితియందు వసుదేవుని కళేబరమును శాస్త్రోక్తప్రకారము పెట్టిరి అర్జునుడు వసుదేవునకు పితృమేధకార్యము

లన్నియు జరపెను అర్జునుడు వసుదేవుని శరీరమును చితియందుంచి దహించెను. చితియందలి అగ్ని ప్రజ్వలించుచుండగా వసుదేవుని భార్య లగు దేవకి మొదలగు నలుగురును సంతోషముగా నా చితియందు ప్రవేశించి ప్రాణములను విడిచిరి. పల్లెవాండ్రు మొదలు నగరవాసుల వరకుగల జనులందరును విచారించుచు బిగ్గరగా ఏడ్చుచుండిరి. నేతిని కుండలతో ఆ చితియందు పోయుచుండగా అగ్నిజ్వాలల శబ్దము లును సామగాన ధ్వనులును జనులయొక్క హాహాకారములును కలసి మిక్కుటముగా నుండెను. వృష్ణులు అంధకులు భోజులు మొదలగు యాదవ పురుషులును స్త్రీసమూహములును వసుదేవునకు ఉదక ప్రదాన విధిని జరిపిరి. అర్జునుడు వసుదేవుని బంధుజనులను మాటల చేత ఆదరించి తానును ఆజనులును విచారముగల మనస్సుగలవారై ద్వారకా పట్టణములోనికి ప్రవేశించిరి. జనమేజయ మహారాజా! యీప్రకారము పుణ్యాత్ముడైన అర్జునుడు వసుదేవునకు పితృమేధ కార్యమును జరపి పండితజనులతో కూడుకొని వృష్ణి భోజ అంధకులు అన్యోన్యముగా కలహించి చచ్చిన యుద్ధభూమికి వెళ్ళెను. వసు దేవుడు చచ్చిన మరుచటిదినమున అర్జునుడు యుద్ధభూమికి వెళ్ళి వృద్ధ బాల స్త్రీజనులకు చచ్చిపడియున్న వృష్ణి భోజ అంధకకుల కళేబరములను చూపించెను. వృద్ధ బాల స్త్రీలందరును చచ్చిపడి యున్న తమ బంధువులను చూచి మిక్కిలి విచారముచేత మూర్ఛిల్లి కొందరు భూమిమీద పడిరి. కొందరు నానావిధములగు విచారమగు మాటలను చెప్పుకొనుచు బిగ్గరగా ఏడ్చుచుండిరి. కొందరి చేతులు పైకెత్తి హాహాకారములతో ఏడ్చుచుండిరి. అప్పు డర్జునుడు మిక్కిలి దుఃఖముకలవాడై కుప్పగూలినట్లు కూర్చుండి విచారించుచుండెను.

దారుకుడు దుఃఖశాంతి మాటలచేత అర్జునుని దుఃఖమును పోగొట్టెను. అర్జునుడు సకల జనుల దుఃఖములను పోగొట్టుటకు

తగిన మాటలను చెప్పెను. అర్జునుడు బ్రాహ్మణులను సహాయపరచుకొని యుద్ధభూమియందు చచ్చిపడి యున్న యాదవ కళేబరములకు అగ్నిసంస్కారములు చేసెను. అర్జునుడు సకల యాదవులకును తిలోదక ప్రదానము చేయుటకు యాదవ స్త్రీబాలాదులను పంపించెను. యాదవ స్త్రీ వృద్ధ బాలాదు లందరును తమవారికి తిలోదకప్రదానములు చేసిరి. జనమేజయమహారాజా! ఇట్లు అర్జునుడు తన బంధువులగు యాదవు లందరికిని. అగ్నిసంస్కార తిలోదక కార్యములను జరిపి మనోచింత గలిగియుండెను.

## అర్జునుడు రామకృష్ణుల వెదుకుచు వనమునకు పోవుట

జనమేజయమహారాజా ! పిమ్మట అర్జునుడు యాదవస్త్రీ బాల వృద్ధులను కలయజూచి వారితో యిట్లనెను. బంధుజనులారా ! బలరామకృష్ణులిద్దరును తపస్సుచేయునిమిత్తము అడవికి వెళ్ళుచుండిరి గదా! ఆ వనభూమిని వెదకుచు వెళ్ళి బలరామకృష్ణులను నేను చూడవలయునని కోరియున్నాను. గనుక మీరందరును దుఃఖమును విడిచి ద్వారకకు వెళ్ళుడు అని స్త్రీబాలాదులతో అర్జునుడు చెప్పి వారి నూరార్చుచు ద్వారకకు చేర్చుటకొరకు దారుకుడు మొదలగు యోగ్యజనులను నియమించెను. దారుకుడు మొదలగువారు యాదవ స్త్రీబాలాదుల నందరిని వెంటబెట్టుకొని ద్వారకకువెళ్ళిరి. అర్జునుడు బ్రాహ్మణులు మొదలగు కొంతమంది జనులను వెంటబెట్టుకొని బలరామకృష్ణులను చూచుటకు అడవిభూమికి వెళ్ళెను. అర్జునుడు తన మనస్సులో నిట్లని తలచెను.

అయ్యో! కృష్ణుడు నన్ను పిలిపించి వసుదేవునకు కావలి యుండునట్లు నియమించి తాను అడవికివెళ్ళెను. ఇపుడా వసుదేవుడు చచ్చెను. నేను అడవికివెళ్ళి నీ తండ్రిచచ్చెనని కృష్ణునితో యేమని

చెప్పవలెను? వసుదేవుని చావు చెప్పుటకు గదా నేను వెళ్ళుచున్నాను బ్రహ్మనిష్ఠను పొందియుండు కృష్ణదేవునితో సీఘ్రమె వచ్చెనని చెప్పినయెడల మహాత్ముడగు కృష్ణునిమనస్సునకు వ్యాకులము గలుగును. వసుదేవునిచావును కృష్ణునితో చెప్పక కృష్ణునిచూచి కృష్ణుడు చెప్పినపనిని భక్తిపూర్వకముగా చేయుచుండెదను. అని అర్జునుడు తలచుచు వెళ్ళుచు నానావిధములైన దుఃఖములను తలచెను. పూర్వము గాంధారి జనులు లేని భూమియందు దిక్కులేనివాడను లేనపుడు చచ్చునట్లుగా కృష్ణునికోపించి యున్నది. అప్పుడు నేను కృష్ణునిదగ్గర నుండి వింటిని అయ్యో! అట్టికురవస్థ కృష్ణునకు సంభవించునా! నిప్పునకు చెదలుపట్టునా! అని యిట్లు అర్జునుడు తలచుచు దుఃఖముతో కూడిన మనస్సుగలవాడై అడవియందు దిక్కుతప్పి మరియొక వైపుకు వేగముగా వెళ్ళుచుండెను.

ఆహా! బ్రహ్మవ్రాతకు అడ్డములేదుగదా! అర్జునునితో గూడ వచ్చెడి బ్రాహ్మణాదిజనులును, అర్జునునిముఖమందు కనబడు దుఃఖభావమును చూచి తామును దుఃఖమనస్సుగలవారై సరియైనమార్గమును చెప్పజాలకుండిరి. అర్జునుడు మొదలగువారు అడవియందు దారితప్పి కొన్నిదినములు దిక్కు తెలియక యిట్టట్టు తిరుగుచుండిరి. ఒకనాడు బోయవాడు అర్జునుడు మొదలగువారిని చూచి యిట్లనెను. జనులారా! మీరు యెక్కడికి వెళ్ళెదరని యడిగెను అర్జునుడు మొదలగువారు కృష్ణదేవుడు తపస్సుచేయుస్థలమునకు వెళ్ళుచున్నామని బోయవానితో చెప్పిరి. బోయవాడు వారితో యిట్లనెను. జనులారా! నేను ఒకనాడు యీఅడవియందొకచోట కృష్ణదేవునిచూచితిని. ఆ స్థలమును మీకు చూపుటకు వచ్చెదను. నావెంబడి మీరురండు. కృష్ణుడు నేను చూచినస్థలమందు యిపుడుండునో ఉండడో తెలియదు. అని బోయవాడు చెప్పుచు కృష్ణుని తానుచూచిన స్థలమునకు అర్జునాదిజనులను తీసికొనిపోయెను.

## అర్జునుడు శ్రీకృష్ణుల కళేబరములు చూచి విలపించుట

జనమేజయమహారాజా! ఆప్రకారము అర్జునానజనులందరును బోయువాని వెంబడి వెళ్ళి కృష్ణుని దేహము పడియున్న స్థలమునకు చేరిరి. కృష్ణుని కళేబరమును అర్జునుడుచూచి మూర్ఛపొంది క్రింద బడెను. అర్జునునితో వెళ్ళిన బ్రాహ్మణాదిజనులందరును మహా దుఃఖమును పొందిరి. అర్జునుడు కొంతసేపటికి మూర్ఛను తెలిసికొని పడియున్న కృష్ణునిశరీరమును కౌగిలించుకొని దుఃఖించుచు పెద్దగా గొంతెత్తి యేడ్చుచు నిర్విరామముగా కాల్చుచుండెను. అధిక కాలము అర్జునుడు కృష్ణునిశరీరమును కౌగిలించుకొని యేడ్చుచుండెను.

అక్కడకు వెళ్ళిన బ్రాహ్మణులు అర్జునుని వూరార్చిరి. అర్జునుడు యేడ్పుమాని అరచేతులతో తన నేత్రములను వొత్తుకొనుచు కృష్ణుని కళేబరమును చూచుచుండెను. అర్జునుడు యేకారణముచేత యీ మహాత్ముడగు కృష్ణుడు యిట్లాయెనని తలచి కృష్ణుని కళేబర మందుగల అవయవముల నన్నిటిని పరీక్షించి చూచెను. మహా యోగీశ్వరులచే ధ్యానింపబడు కృష్ణుని పాదమందు బాణపుదెబ్బ తగిలి రంధ్రమై యుండెను. గాయము ను అర్జునుడుచూచి ఆశ్చర్యపడి యిట్లనెను. పూర్వము రుద్రతేజోవంతుడగు దుర్వాస మహాముని కృష్ణుని గృహమునకువచ్చి పరమాన్నము పెట్టింపుమని కృష్ణుని అడిగెను. కృష్ణుడు పరమాన్నము చేయించి తెచ్చి దుర్వాసునికివ్వగా దుర్వాసుడు పరమాన్నమును తన దేహమందంతట పూయుమని కృష్ణునితో చెప్పెను. అప్పుడు కృష్ణుడు మిక్కిలి భక్తితో పరమాన్నమును దుర్వాసుని దేహావయవములయందంతటనుపూసి అరకాలి యందు పూయకుండెను.

దుర్వాసుడు బ్రాహ్మణులయందు కృష్ణునకుగల భక్తికిసంతోషించి కృష్ణునకు వరమిచ్చి తన అరకాలియందు కృష్ణుడు పాయ

నాన్నమును పూనునందున కృష్ణుని అరికాలియందు నాభి కలుగు నని చెప్పెను. అట్లే కృష్ణుని పాదమందు యొకడు బాణము వేసెను. ఆ దెబ్బవలన కృష్ణుడు శరీరమును విడిచి వెళ్ళెను. అని అర్జునుడు తలచుచు ఆశ్చర్యపడి స్మరించుచున్న వానివలె చచ్చిపడియుండె కృష్ణుని దేహమును రెప్పలార్పక చూచుచుండెను. కృష్ణుని కళే బరము కాంతితప్పక యెప్పటివలె నవ్వుచున్న వానివలె నుండెను. అది చూచుచు అర్జునుడు పలుకకుండెను. అట్టి విచారమందు మునిగి యున్న అర్జునుని బ్రాహ్మణాది జనులు చూచి అనేక విధములగు మాటల చేత పూరార్చి యిట్లనిరి.

అర్జునా! కృష్ణుడును యీప్రకారము దేహమును విడిచి పరమ పదమునకు పోయెను. ఇక చేయదగిన కార్యములను చేయు చుండవలెను. కృష్ణుని భార్యలు మొదలగు బంధుజనులను ఇక్కడికి తీసికొని వత్తుమా లేక కృష్ణుని కళేబరమును ద్వారకకు తీసికొని వెళ్ళుదమా! యీ రెండు విధములలో ఏ ప్రకారముగా చేసిన యెడల బాగుగా నుండునో ఆ విధమును నిశ్చయించి చెప్పుము. అని బ్రాహ్మ ణులు అర్జునుని అడుగగా అర్జును డిట్లనెను.

బ్రాహ్మణులారా! దైవవిధి ప్రకారము సముద్రము ద్వార కను యే దినమందు ముంచునో అది నిశ్చయింపుడు. ఆ దుఃఖము నా మనస్సును బాధించుచున్నది. మనము యీ అడవికి వచ్చి గడచిన దిన ములు లెక్కించి చూడగా మరుసటి దినము ద్వారకా పట్టణమును సముద్రము ముంచునట్లు లెక్క యేర్పడెను. సూర్యుడు అస్తమించు టకు సమీపగతుడై యుండెను. అందుచే నర్జునుడును బ్రాహ్మణాది జనులును చక్కగా యోచించి యీరాత్రికి ద్వారకాపట్టణమందు ఒక మనుష్యుడైనను లేకుండునట్లు చేయవలయును. రేపు సూర్యో

దయ కాలమందు సముద్రము ద్వారకాపట్టణమును ముంచివేయును. మనమీ రాత్రికి ద్వారకాపట్టణమునకు వెళ్ళి కృష్ణుడు పరమపద ప్రాప్తుడాయెనని చెప్పక ఇక్కడ కృష్ణుడు జీవించియున్నట్లు కొన్ని సమాచారములను చెప్పవలయును. అట్లు చెప్పి ద్వారకనుంచి సకల జనులను ప్రయాణముచేసి తీసికొని వెళ్ళవలయును. అట్లుత్వరపెట్టి వెళ్ళనియెడల రేపుసూర్యోదయ కాలమందు ద్వారకను సముద్రము ముంచు నేని అధికదుఃఖము సంభవించుటయేగాక సకల విధములచేతను పాపము కలుగును. మనము లోకమందు అపకీర్తికలవార మగుదుము.

## అర్జునుడు రామకృష్ణులకు అగ్నిసంస్కారము చేయుట

మనము శీఘ్రముగా కట్టెలను అగ్నియు. సంపాదించి కృష్ణుని మంగళదేహమును దహించి వెళ్ళుట మేలగును. అని అర్జునుడును బ్రాహ్మణజనులును యోచించి కృష్ణుని మంగళదేహమునకు మిక్కిలి భక్తితో అర్జునుడు శాస్త్రవిధి ప్రకారము అగ్నిసంస్కారముచేసి పితృమేధమును జరిపెను. అర్జునుడు బలరాముని తలచుకొని మునులు చెప్పిన మాట తప్పదని తలచుచు చుట్టుప్రక్కలవైపు చూడగా ఒక చెట్టుక్రింద బలరాముని కళేబరము కనబడెను. అర్జునుడును బ్రాహ్మణులును వెంటనే బలరాముని దేహమును అగ్నిచేత దహించిరి. జనమేజయమహారాజా! అట్లు అర్జునుడు బలరామకృష్ణుల దేహములకు మంగళమైన అగ్నిసంస్కారమునుచేసి కృతార్థుడై తనతోడ వచ్చిన బ్రాహ్మణాది జనులను వెంటతీసికొని ద్వారకాపట్టణమునకు వెళ్ళుచు బ్రాహ్మణాది జనులతో యిట్లనెను.

బ్రాహ్మణాది జనులారా! మనము బలరామకృష్ణులు పరమపదమును పొందిరని ద్వారకయందు చెప్పరాదు. అట్లు చెప్పినయెడల రుక్మిణి మొదలగు కృష్ణుని భార్యలు అగ్నిప్రవేశమై తమ భర్తలతో

కలియుటకు ప్రయత్నింతురు. వారిని మనము నిలుపజాలము. రుక్మిణి మొదలగు వారికి మనము బోధించుచుండగా సూర్యోదయమైన యెడల సముద్రము ద్వారకను ముంచివేయును. అందువలన సకల జనులును మనమును నశింతుము. మనము మేలుచేయబోయి లోక నిందితమైన కీడును సంపాదించుకొనవలసి వచ్చును గనుక మనదేశ మునకు తప్పించుకొని వెళ్ళి అన్ని పనులకు వెనుక చూచుకొనవచ్చును. శీఘ్రముగా రండు. అని అర్జునుడు బ్రాహ్మణాది జనులతో చెప్పుచు ద్వారకాపట్టణమునకు వెళ్ళి రాత్రియందు తాను తలచినప్రకారము సకల కార్యములను చక్కపరచుకొని మరునాడు సూర్యోదయము కాకమునుపే సకల జనులను ధనాది పదార్థములను ప్రయాణము చేయించెను. కృష్ణుని అంతఃపుర స్త్రీలగు రుక్మిణి మొదలగు వారిని యెనిమిదిమందిని కృష్ణుని పదియారువేల గోపికాస్త్రీలను, బల రాముని భార్యలను వీరందరిని తగిన వాహనములమీద యెక్కించు కొని తగిన పురుషులను వెంటతీసుకొని అర్జునుడు ద్వారకనుంచి వెడలి వచ్చెను రథములను యేనుగులను, గుఱ్ఱములను, పరిచారకులను సామగ్రులను అధికారులగు జనులు తీసికొనివచ్చిరి. ద్వారకాపట్ట ణపు అధికారులగు జనులు బండ్లమీదను, కావిళ్ళచేతను సకల పదార్థములను యెత్తించుకొని వచ్చుచుండిరి. అర్జునుడు కృష్ణబల రాముల స్త్రీలనందరిని తగిన వాహనములమీద యెక్కించుకొని విధవస్త్రీలను గౌరవముగా నడిపించుకొని వచ్చుచుండెను. అర్జునుడు వజ్రుడు మొదలగు యాదవ బాలురను తగినట్లు నడిపించుకొని ద్వారకనుండి వచ్చుచుండెను. జనమేజయమహారాజా ! అర్జునుడే జనుల కందరికిని దిక్కైయుండెను. అర్జునుడు అందరిని తీసికొని రథముమీద యెక్కి దుఃఖపూరితమగు మనస్సుతో వెళ్ళుచుండెను.

## ద్వారకానగరము సముద్రమున మునిగిపోవుట

జనమేజయమహారాజా! అర్జునుడు సకల జనులను తీసికొని ద్వారకాపట్టణమును విడిచి రాగా సూర్యోదయమాయెను. సూర్యోదయమైనతోడనే ద్వారకాపట్టణమును వేగముగా సముద్రము ముంచివేసెను. సముద్రము ద్వారకను ముంచివేయగ ద్వారకనుంచి వచ్చుచున్న జనులందరును వెనుకకు తిరిగిచూచి ఆశ్చర్యపడిరి. జనులట్లు కేకలు వేయుచుండగా రెండవ సముద్ర ధ్వనివలె నుండెను. ద్వారకనుండి వచ్చిన జనులనందరిని అర్జునుడు భోజనము కొరకు నిలిపెను. ఆ పంచనదీయములను యాదవ స్త్రీలందరును దిగి భోజనము చేసి యుండగా అక్కడనుండు దొంగలు ఆ స్త్రీలను చూచి తమలో తామిట్లని యోచించిరి ఈ స్త్రీలు మొదలగు జనుల మూకలో బంగారము మొదలగు ధనము అధికముగానున్నది. జనులను కాపాడుటకు యోధులు లేరు. అర్జునుడు ఒకడే యున్నాడు. వృద్ధుడు. మనము శీఘ్రముగా మన బలముతో వచ్చి యీ మూకను పోనివ్వక ధనములను అపహరింతము. మనము అడ్డము వచ్చినయెడల వీరు మనలను అతిక్రమించి పోజాలరు. యీ మునులదగ్గరయుండు బంగారము మొదలగు ధనములయొక్క గుట్టంతయు మనకు చక్కగా తెలిసెను. అని కిరాతకులు యోచించి ఒకరితో ఒకరు చెప్పుకొని ఉత్సాహ మనస్సులు గలవారై యాదవస్త్రీల దేహములయందుండు ఆభరణాదులను అపహరింపదలచిరి. అట్లు అపహరింపదలచిన కిరాతులందరును అనేక వేలమంది వచ్చిరి. ఆ సైన్యమంతయు యాదవ స్త్రీల గుంపునుచూచి తమలో తామిట్లు చెప్పుకొనిరి. కిరాతులారా యీ గుంపులోనుండు పురుషులందరును పిల్లవాండ్రును, ముసలివారును అయి యున్నారు. యుద్ధమునకు ఒక్కడైనను వచ్చినట్లు కనబడలేదు. గనుక యీ స్త్రీలనందరిని పోనివ్వక వీరి దేహముల

యందుండు నగలను దోచుకొందుము. అని కిరాతసైనికులు తమలో తాము చెప్పుకొనుచు, నిర్భయులై లేచి యాదవస్త్రీల గుంపులో ప్రవేశించి ఆ స్త్రీల దేహములయందుగల నానా విభూషణములను తీసికొనుటకు ఆరంభించిరి.

## బోయ లర్జునుని యెదిరించియాదవాంగనలసొమ్ము లపహరించుట

కిరాతులు యాదవస్త్రీల యొక్క సొమ్ములను అపహరించుటకు ప్రారంభింపగా అర్జునుడు తెలిసికొని కిరాతులతో యిట్లనెను. కిరాతులారా! ఈ జనులకు నేను రక్షకుడనై యున్నాను. గనుక తొలగిపొండు. ఆశచేత స్త్రీల సొమ్ములను అపహరింప దలచితిరేని మీ శిరస్సులు నరికి యీ భూమికి బలియిత్తును. అని అర్జునుడు బెదరించుచు చెప్పినను, కిరాత సైనికులు అర్జునుని మాటలను లక్ష్యపెట్టక అక్కడక్కడ యాదవ స్త్రీల సొమ్ములను తీసికొనుచుండిరి. అతిరథశ్రేష్ఠుడగు అర్జునుడు గాండీవమను తన ధనస్సును తీసికొని యెక్కుపెట్టి మిక్కిలి తీక్ష్ణమైన బాణసమూహములను కిరాతుల దేహములమీద వేసెను. కిరాతులు అర్జునునిమీద వేయుచు, నిర్భయులై అర్జునునిమీదకు వచ్చిరి. అర్జునుడు కోపించుకొని కిరాతుల మీదమహాస్త్రములనుప్రయోగింపదలచగామంత్రములుస్ఫురింపలేదు. అర్జునుడు దైవవిరోధమువలన మంత్రము స్ఫురణము తప్పెనని తలచి సాధారణములైన బాణములను తన శక్తికొలది లాగి కిరాతులమీద వేసెను. ఆ బాణములు కిరాతులను జంపజాలక వ్యర్థములాయెను.

అర్జునుడు కాలవిపర్యయమునకు ఆశ్చర్య దుఃఖములుగలవాడై తనభుజాబలమువలన గాండీవము చేతకొట్టి ఆబోయబలము యొక్క మదమును అణచి కృష్ణుని అంతఃపుర స్త్రీలగు రుక్మిణిమొద

లగు యెనిమిది మందిని, బలరాముని భార్యలను, మరికొందరగు యాదవ స్త్రీలను మాత్రము కాపాడెను తక్కిన యాదవస్త్రీలను కిరాతులు పట్టుకొని వారి దేహముల యందుండు నగలను తీసికొని వెళ్ళిరి. ఆ దొంగలకు యేనుగులు, గుర్రములు రథములు ఆవశ్యకములు లేనందున వాని నన్నిటిని విడిచి వెళ్ళిరి. అర్జునుడు యాదవస్త్రీలందరిని నడిపించుకొని మిక్కిలి దీనమగు మనస్సుతో కురుక్షేత్రమును ప్రవేశించిరి. ఆమార్గమందు తనకు ఆప్తులగు జనులు కనబడినపుడు ఆజనులతో తనకు కలిగిన అవమానమును అర్జునుడు చెప్పుచు వెళ్ళెను. అర్జునుడు విచారమైన మనస్సుతో యాదవస్త్రీ బాలవృద్ధులందరిని కురుక్షేత్రమునకు చేర్చెను.

జనమేజయ మహారాజా! యాదవులు నశించక పూర్వము ధర్మరాజు అర్జునునితో మాటమాటకు చెప్పిన మాటలను చెప్పెదను వినుము. తమ్ముడా! అర్జునా! భారతయుద్ధ భూమియందు చచ్చి పడియున్న తనవారిని చూచి, గాంధారీదేవి కృష్ణునిమీద కోపించుకొని తనవారు చచ్చినట్లు యాదవులందరును చచ్చెదరని యాదవులందరిని శపించెను. గాంధారి శాపమువలన యాదవులందరును చావక మానరు. గనుక చావగా మిగిలిన యాదవస్త్రీ బాలవృద్ధ జనములను మనము యిక్కడకు తీసికొనివచ్చి ఆయా బాలురకు తగిన పట్టణములను దేశములను యిచ్చి ఆదరింపవలెను. అప్పుడు యాదవ స్త్రీ బాలాదులను యింద్రప్రస్థపురమునకు చేర్పుము. యాదవబాలురకు తగిన పట్టణములను యిచ్చి ఆయా దేశములకు పట్టాభిషేకలను చేయుము. ఈ కార్యమునకు ఉత్సాహింప వలయును అని ధర్మరాజు అర్జునునితో అనేకమార్లు చెప్పుచుండెను. గనుక ధర్మరాజు దయను అర్జునుడు యెరిగి యున్నందున యాదవస్త్రీ బాలవృద్ధులను కురుక్షేత్రమునకు చేర్చి, ఒకచోట ఆబాలురకు కొన్ని పట్టణదేశములన్ను

యిచ్చి నిలిపెను. అట్లు జరిగించిన పద్ధతిని చెప్పెదను వినుము. అర్జునుడు యాదవస్త్రీ బాలాదులను కురుక్షేత్రమునకు చేర్చి కృతవర్మ కుమారునితో యిట్లనెను.

కృతవర్మకుమారా! నీవును, నీ తల్లియు, నీసహోదరులును, మృత్తికావరపట్టణమందు నుండుడు. ఆపట్టణమును, అందుకు సంబంధించిన దేశమును బహుసంపదలచేత మనోహరమైయుండును. ఆ పట్టణదేశములు నీకిచ్చితిని. అని కృతవర్మకుమారునితో అర్జునుడు చెప్పి ఆపట్టణదేశములకు వానిని ప్రభువుగా నేర్పరచి అభిషేకము చేసెను. కృతవర్మ కుమారుడంతలకు సంతోషించి తన బంధుమిత్ర పరిచారకులను తీసికొని మృత్తికావరపట్టణమునకు వెళ్లెను. అర్జునుడు సాత్యకి కుమారునిజూచి వానితో యిట్లనెను. సాత్యకి పుత్రా! సరస్వతి అను మహాపట్టణము దానికి సంబంధించిన దేశమును నీ కిచ్చితిని. గనుక నీవు నీబంధుజన సహితముగా సరస్వతీపట్టణమునకు వెళ్ళి నివసింపుము. అని అర్జునుడు సాత్యకి కుమారునితో గౌరవ పూర్వకముగా చెప్పి ఆపట్టణదేశములను యిచ్చి అభిషేకముచేసెను. సాత్యకికొడుకు సంతోషించి తన బంధుజనములను తీసికొని సరస్వతీ పట్టణమునకు వెళ్ళెను. తక్కిన యాదవ స్త్రీ బాలవృద్ధజనులందరిని యింద్రప్రస్థపట్టణమునం దుండునట్లు యేర్పరచి కృష్ణుని మనుమడగు వజ్రదేవునితో అర్జునుడు యిట్లనెను. వజ్రదేవా! యింద్రప్రస్థపట్టణమునకు, దీనికి సంబంధించిన దేశమునకును నీవు ప్రభుడవై యుండుము. ఆపట్టణదేశములను నీకిచ్చితిని. సకల యాదవస్త్రీ బాలవృద్ధాదులను నీవు పోషించుచుండుమని పట్టాభిషేకము చేసెను. అర్జునుడు వజ్రునకు యింద్రప్రస్థపట్టణ దేశములనిచ్చి పట్టాభిషేకముచేసి యాదవుల యొక్క యేనుగులను, గుర్రములను, రథములను మూడుపాళ్ళు చేసి కృతవర్మకొడుకునకు ఒకపాలును, సాత్యకి కొడుకునకు ఒకపాలును,

వజ్రదేవునకు ఒక పాలును పంచిపెట్టెను. అర్జునుడా ముగ్గురికిని ఏనుగులు మొదలగు వానిని పంచిపెట్టి వజ్రదేవునితో యిట్లనెను. వజ్రదేవా! అక్రూరుని భార్యాపుత్రులను నీయొద్దనుంచుకొని రక్షింపుము. అని చెప్పి వారిని వజ్రదేవునికి అప్పగించెను. వజ్రదేవుడును మిక్కిలి వినయముతో వారిని రక్షించుటకు పూనుకొనెను. అక్రూరుని భార్యాపుత్రులు వజ్రదేవునివద్ద నిలువక తమ కిచ్చవచ్చిన వేరొక చోటికి పోయిరి. అట్లు వెళ్ళిరని అర్జునుడువిని యూరకుండెను. జనమేజయమహారాజా! యిట్లు అర్జునుడు యాదవుల నాయా ప్రదేశములయందు ప్రీతిపూర్వకముగా నిలిపిపంపించి వజ్రదేవుడు మొదలగు సకల యాదవ బాల వృద్ధస్త్రీలను తీసికొని అర్జునుడు ఇంద్రప్రస్థ పట్టణమునకుచేరెను. పిమ్మట బలరామకృష్ణులు చచ్చినవృత్తాంతము వారి భార్యలతో అర్జునుడు చెప్పదలచి తగినజనులను వెంటపెట్టుకొని వారిదగ్గరకుపోయి విచారపూరితమైన మనస్సుతో ఆ స్త్రీలతో యిట్లనెను.

## అర్జునుడు బలరామకృష్ణుల నిర్యాణము యాదవస్త్రీల కెరింగించుట

యాదవస్త్రీలారా! పూర్వము నేను కొంతమంది బ్రాహ్మణాది జనులను తీసికొని బలరామ కృష్ణులను చూచుటకు అడవికి వెళ్ళగా దిగ్భ్రాంతి గలుగునట్లు కొన్నిదినములు బలరామ కృష్ణులను వెదకుచు విసికితిని. అంతలో ఒక బోయవాడు మీరెక్కడకు వెళ్ళుచున్నారని మమ్ము అడిగెను. కృష్ణదేవుడు తపస్సుచేయు స్థలమునకు వెళ్ళుచున్నామని ఆబోయతో మేము చెప్పితిమి. ఆ బోయవాడు మాయందు కరుణగలిగి కృష్ణదేవుడున్న స్థలమును చూపించెదను రమ్మని మమ్ము పిలుచుకొనిపోయి కృష్ణదేవుడున్న స్థలమును మాకు

చూచెను. అని అర్జునుడా స్త్రీలతో చెప్పి తలవంచుకొని మిక్కిలి దుఃఖించుచు కన్నీరు గార్చుచు మరియొకమాట చెప్పజాలక పలుక కుండెను. రుక్మిణి మొదలగు స్త్రీలందరును, కృష్ణుడు పరమపదమును పొందెనని తెలుసుకొని దుఃఖదేహులైయుండియు, ధైర్యవంతులై అర్జునునితో యిట్లనిరి.

అర్జునా! అన్నా! నీవుయిట్లు దుఃఖించినందున ప్రయోజనము లేదు. ఎవ్వరికైనను కాలవిపర్యము తప్పదు. గనుక యేకాలము నకు యేఫలము ననుభవింప వలెనో ఆకాలమునకు ఆఫలమును అను భవింప వలయును. కొరతమాట లున్నయెడల చెప్పుము. అని బల రామ కృష్ణదేవుల భార్యలందరును అర్జునుని యడుగగా అర్జునుడు దుఃఖించుచు వారితో యిట్లనెను. తల్లులారా! బోయవాని వెంబడి మేము వెళ్ళిచూడగా బలరామ కృష్ణుల కళేబరములు కనబడెను. మేము దినములు లెక్కించి చూడగా యేడునాడు ద్వారకను సము ద్రమునందు ముంచునట్లు తెలిసినవి. అప్పుడు బలరామ కృష్ణదేవుల వృత్తాంతమును మీకు చెప్పినయెడల మీరు దుఃఖింపు చుందురనియు. అంతలో తెల్లవారగనే సముద్రము ద్వారకను ముంచునని తెలిసిన వెం టనే బలరామ కృష్ణదేవుల. కళేబరములను అగ్నిసంస్కారములు తీర్చి అతివేగముగా రాత్రికి ద్వారకకువచ్చి చేరితిమి. విచారముతో సకలజనులను, మిమ్మును, యేనుగులను, గుర్రములను, రథములను సామగ్రులను తీసికొని ప్రయాణముచేసి సకలయాదవస్త్రీలను బాల వృద్ధులను, పురజనులను వెంటబెట్టుకొని సూర్యోదయము కాక మునుపే వెడలి వచ్చితిమి. అందువలన మీరును నేనును అపకీర్తి పాపములను పొందకుంటిమి. తల్లులగు యాదవస్త్రీలారా! కృష్ణబల రాముల వృత్తాంతమును మీకుచెప్పక దాచితిని. ఈ తప్పు నాయం దున్నందున నామనస్సు మిక్కిలి పరితపించుచుండెను. ఈతప్పి

దమువలన నాకు పాపము కలుగకుండునట్లు మీరు కృపచేత నన్ను అనుగ్రహింప వలయును. అని అర్జునుడు యాదవస్త్రీలతో చెప్పి వారికి సాగిలపడి నమస్కరించెను. కృష్ణబలరాముల భార్యలగు యాదవస్త్రీలందరును సాగిలపడియున్న అర్జునుని గౌరవముతో లేవ నెత్తి అర్జునుని ఓదార్చి అర్జునునితో యిట్లనిరి. పుణ్యాత్మా! అర్జునా! ఇక తగిన కార్యములను యిక్కడ చేయవలయును. ఇకవిచా రించిన ప్రయోజనములేదు. దైవము చేసిన పనికి యెవ్వరైనను అడ్డు పడజాలరు గనుక దుఃఖించవద్దు. అని యాదవస్త్రీలందరును అర్జునుని ఓదార్చిరి.

జనమేజయమహారాజా! స్త్రీలగుంపునందు రుక్మిణీ, జాంబవతి మొదలగు కొందరు స్త్రీలు అగ్నిప్రవేశమువలన తమ భర్తయందు కలియుటకు నిశ్చయించిరి. ఆస్త్రీ బంధుజనులందరును మిక్కిలి దుఃఖమును పొందియుండిరి. సహగమనము చేయుటకు నిశ్చయించిన కృష్ణబలరామ భార్యలకు అర్జునుడు మంచిమంచి విమానములు కల్పించెను. అర్జునుడు బ్రాహ్మణోత్తములను పంపించి చందనపు కట్టెలచేతను, అగరుమున్నగు పుణ్యకట్టెలచేతను చితిని కల్పింపజేసెను. మనోహరమైన సువాసనగల చితియందు తగురీతి బ్రాహ్మణులు అగ్నిని చేర్చి ప్రజ్వలింపజేసిరి. రుక్మిణి, జాంబవతి మొదలగు కృష్ణబల రామభార్యలలో కొందరు విమానములమీద నెక్కి సంతోషముగా వెళ్ళి అగ్నియందు ప్రవేశించి తమభర్తలయందు కలిసిరి. సత్య భామ మొదలగు తక్కిన యాదవస్త్రీలందరును పరమనియమముతో తపస్సు చేసికొనుటకు అడవికి వెళ్ళిరి. అట్లు అర్జునుడు యేవిధమైన లోపము కలుగకుండునట్లు యాదవులకు సర్వకార్యములను జరిపెను. ఆస్త్రీ బాలవృద్ధాదులను తగు వాక్యములచేత ఓదార్చి తగురీతిని వారి అనుమతినిపొంది కన్నీరు కార్చుచు దుఃఖాగ్నిచేత పీడింప బడుచు వేదవ్యాసమహామునిదగ్గరకు వెళ్లెను.

## అర్జునుఁడు వేదవ్యాసునియొద్దకు పోయి యాదవక్షయము చెప్పుట.

జనమేజయమహారాజా! గంగానదీ సమీపమందుండు తపోవనమందు ఒక ఆశ్రమముతో తగిన ఆసనముమీద ఏకాగ్రమగు చిత్తముతో వ్యాసుడు కూర్చుండియుండెను. వేదవ్యాసమునీశ్వరుని దగ్గరకు అర్జునుడు వెళ్ళి మిక్కిలి భక్తిశ్రద్ధలతో సాష్టాంగ నమస్కారముచేసెను. వ్యాసమునీంద్రుడు అర్జునుని జూచి దగ్గరకు పిలిచి తన సమీపమందు కూర్చుండబెట్టుకొని అర్జునుని ముఖము చూచి యిట్లనెను. అర్జునా! నిన్ను గుర్తింపజాలకున్నాను. నీముఖమందు కాంతిలేక మారురూపము కలిగియున్నది. ఇపుడు నిన్ను చక్కగా చూచినపిమ్మట గుర్తించితిని. నీముఖము దుఃఖరూపము కలిగి దైన్యమును పొందియున్నది. ఇట్లుండుటకు కారణమేమి? చంపుటకు యోగ్యముకాని వానిని యెవని నైనను అక్రమముగా చంపితివో లేక పరులచేత అపజయమును పొందితివో చెప్పుము. అని దివ్యజ్ఞాని యగు వేదవ్యాసమునీంద్రుడు అడుగగా అర్జును డిట్లనెను. మహాత్మా! వేదవ్యాసమునీంద్రా! తామరరేకులవంటి నేత్రములుగలవాడును, నల్లని మేఘమువంటి దేహకాంతిచేత ప్రకాశించువాడును నైన శ్రీకృష్ణుడును, బలరాముడును దేహములను విడిచి పరమగతికి పోయిరి. ఇక యేమని చెప్పుదును. సకలయాదవులును అన్యోన్యముగా కలహించుకొని చచ్చిరి. యాదవు లందరును యిదివరకు యుద్ధముల యందు తీక్ష్ణము లైన ఆయుధములచేత కొట్టబడినను చావక యుండిరి. యాదవుల దేహములు మిక్కిలి గట్టివగుటవలన యెంత దెబ్బల నైనను సహించుకొనిరి. యాదవవీరులకు యుద్ధములయందు మిక్కిలి పుత్సాహము కలిగియుండును. అట్టి యాదవ వీరు లందరును తుంగ గడ్డిపరకలచేత కొట్టుకొని నశించిరి.

వ్యాసమునీంద్రా! బలరామ కృష్ణులును సకల యాదవులును నశించిన పిమ్మట నేను అధిక దుఃఖ మనస్సుతో యాదవస్త్రీ బాల వృద్ధులను వెంటబెట్టుకొని వచ్చుచుండగా కిరాతబలము, నామీదకు యుద్ధమునకు వచ్చెను. నేనునవ్వుచు నాబాహుశక్తిని గాండీవ అస్త్రశక్తులను మనస్సునందు తలచుకొని కొంతసేపటికి ధనస్సునందు అల్లెత్రాటిని సంధించితిని నాకు బాహుబలము తగ్గిపోయెను. దివ్యాస్త్రములయొక్క మంత్రతంత్రములు నాబుద్ధికి స్ఫురింపలేదు. ఇక నే నేమి చెప్పుదును నేను యీకిరాతులను చంపుటకు సాధారణము లైన బాణములు చాలవాయని తలంచి అనేకవాడి బాణములను ఆ కిరాతుల మీద వేసితిని. అవియన్నియు వ్యర్థములైనందున ఆబోయలకు యేవిధమైన బాధకలుగలేదు. అందువలన వారిని నేనేమియు చేయజాలకుంటిని. అందుకునేను ఆశ్చర్య దుఃఖములు గలిగి చూచుచుండగా కిరాతులందరు యాదవస్త్రీలను చుట్టుకొని వారిదేహముల యందుగల సొమ్ములను వొలుచుకొనిరి. అంతట నేను భయపడి గాండీవముచేత నాశక్తికొలది కిరాతులనుకొట్టి బలరామ కృష్ణదేవుల ముఖ్యభార్యలను మరికొందరగు యాదవస్త్రీ బాలవృద్ధులనుమా వెంటబెట్టుకొని అక్కడక్కడ జనులుండు స్థలములయందు నిలుపుచు కురుక్షేత్రమునకు చేర్చితిని. ఇట్లు నాకు కలిగిన బంధుమరణ అపజయములచేత నామనస్సు దుఃఖాగ్నియందు పరితపించుచున్నది గనుక పొందగూడని కష్టములను నేనుపొందితిని. అందువలన నాకు మారు రూపము గలుగ కుండునా! ఇక నేనేమి చేయవలయునో ఆమాటను నాకు కృపతో చెప్పుము అని అర్జునుడు వేదవ్యాస మునీశ్వరునితో చెప్పుకొనగా వ్యాసమునీంద్రుడు యిట్లనెను.

## వేదవ్యాసు డర్జునకు హితోపదేశము చేయుట

అర్జునా! పూర్వము కణ్వ నారద విశ్వామిత్ర మహామునులు యాదవులకు శాపమిచ్చియున్నారు. అట్టి క్రూరశాపముచేత యాదవు

లందరును మునిశాపమువలన పుట్టిన రోకలియొక్క అద్భుతశక్తిగల తుంగలచేత అన్యోన్యముగా కొట్టుకొనినశించిరి. నీవు దుఃఖించవలసిన పనిలేదు. ఆ యాదవులకు మునిశాపమువలన నాశము కలుగునని కృష్ణుడు మునుపే యెరిగియున్నాడు. ఆ కృష్ణుడు మునులశాపమును తప్పింపలేక నూరకలేదు. ఉపేక్షించి యూరకుండెను. యెట్లనగా చెప్పెదను వినుము. కృష్ణుడు కణ్వాదిమునులు యాదవులను శపించిన వృత్తాంతమును విని యిట్లని తనలో తాను యోచించెను. కలియుగము రాబోవుచున్నది. అటువంటప్పుడు యాదవు లుండరాదు. నేనును నా దేహమును కలియుగము రాకమునుపే విడువవలయును. గనుక యెట్లైనను యాదవులకు నాశముతప్పదు. కణ్వాదిమునులు శాపమును తప్పించినను యాదవులు చావకమానరుగదా! గనుక మునులశాపమును తప్పించిన ప్రయోజనములేదు. అని కృష్ణుడు యోచించి కణ్వాదిమునుల శాపమును తప్పింపక ఉపేక్షించెను. అర్జునా! యీమూడులోకములను సంకల్పమాత్రముచేత సహరించి మరల యెప్పటివలె కలిగించుటకు కృష్ణుడు సమర్థుడగును. విష్ణుదేవుడగు కృష్ణుడు కణ్వాదిమునుల శాపమును తప్పించుటకు శక్తిలేక మానుకొనెనని నీవు తలచవద్దు. అవశ్యముగా యాదవులు తప్పక నశింపవలసియున్నది. గనుక నశించిరి. ఈ విషయమై నీవు దుఃఖింపకుము. నీవు భారతయుద్ధముచేయునపుడు యీశ్వరుడగు కృష్ణుడు నీయందుగల స్నేహముచేత తాను శూలాయుధమును ధరించి యెవ్వరికిని కనబడక నీశత్రువులను ముందుగానే చంపుచుండెను. అట్లు చంపువిధమును నీవును చూచుచుంటివి, కృష్ణుడు నిన్ను సర్వదా రక్షించుచుండెను. కాలవిపర్యయము కలిగినందున కృష్ణుడు నిన్ను విడిచి తాను పరమపదమునకు వెళ్ళెను. అర్జునా! భూమియొక్క భారమును పోగొట్టుటకై విష్ణుదేవుడు కృష్ణుడుగా అవతరించెను.

విష్ణుదేవుడు ఆశ్చర్యమగునట్లు భూభారమును మాన్పి నిత్యశుద్ధ బుద్ధముక్త నిష్క్రియనిష్కల నిర్గుణాద్వితీయమగు తన పరమ పదమును పొందినాడు. కృష్ణునిగురించి మీవంటి బుద్ధిమంతులు దుఃఖించరాదు. అర్జునా! భూభారమును మాన్పుటకు అవతరించినట్లు విష్ణుదేవునకు నీవు సహాయుడవై భారతయుద్ధమందు భీమునితోడు చేసికొని ప్రజలను సంహరించితివి. అందుచేత భూభారము నివర్తిం చెను. భూభారము నివర్తించినతోడనే దివ్యాస్త్రములు నిన్నువిడిచి వెళ్ళినవి. నీకు యిపుడు దివ్యాస్త్రముల మంత్రతంత్రములు స్ఫురించ లేదు. నీవు భారతయుద్ధమందు ప్రవర్తించిన పద్ధతికి దేవతలందరును నిన్ను మెచ్చుకొనిరి. గనుక అర్జునా! మంచికాలమందు జనులకు బల బుద్ధిశౌర్యధైర్యసాహససంపదలు అతిశయించుచు ప్రకాశించు చుండును. కాలవిపర్యమైనప్పుడు బల బుద్ధిశౌర్యధైర్య సాహస సంపదలు నశించుచుండును. ఇట్లు కలుగుట కాలస్వభావమైయున్నది. గనుక వివేకులగువారు మంచికాలము వచ్చినను చెడుకాలము వచ్చి నను సంతోషదుఃఖములను చెందరు. అర్జునా! సర్వము కాలస్వభా వమువలన కలుగుచున్నవిగనుక మీరు యితరచింతలను విడిచి పుణ్యలోకములకు వెళ్లు వుపాయమును వెదకికొనుడు. మీరు చింతనువిడిచి నిర్వికారచిత్తములచేత పెద్దలు స్తుతించినట్లుగా దేహ ములనువిడిచి పుణ్యగతిని చెందుడు. అని యిట్లు వేదవ్యాసమునీంద్రుడు అర్జునునితో చెప్పగా అర్జునుడు దుఃఖమోహములు లేనివాడై భరింపజాలని ఆనందమును పొందెను. అర్జునుడు పరమానందము గలవాడై మిక్కిలి భక్తివినయములతో వ్యాసమునీంద్రునకు నమస్క రించి అనుమతిసపొంది హస్తినాపురమునకువచ్చెను. హస్తినాపుర మునకువచ్చిన అర్జునుడు దారుకుడువచ్చి తనను పిలుచుకొని పోవగా ద్వారకకు తాను వెళ్ళినది మొదలుకొని వ్యాసుడు తనతో చెప్పిన మాటలవరకు గల వృత్తాంతమంతయు ధర్మరాజుతో చెప్పెను.

ఈవృత్తాంతమంతయు ధర్మరాజు విని అర్జునుడు యాదవస్త్రీ బాలవృద్ధాదులను కురుక్షేత్రమునకు తీసికొనివచ్చి వారివారికి తగిన దేశములనిచ్చి పట్టాభిషేకము చేసినందుకు పరమానందమును పొంది వేదవ్యాసుడు అర్జునునితో చెప్పినప్రకారము చేయుటకు నిశ్చయించి యుండెను. అని వైశంపాయనమునీంద్రుడు బలరామకృష్ణులు మొదలగు వృష్ణివంశస్థులయొక్కయు, భోజ అంధకవంశస్థులయొక్కయు వృత్తాంతమంతయు జనమేజయమహారాజుతో చెప్పెను.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణ సుధాకర లక్ష్మణామాత్య
పుత్రలక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన
తెనుగువచన కావ్యంబగు శ్రీ మహా
భారతమందు మౌసలపర్వము
ము గి సె ను.



# మహాప్రస్థానిక పర్వము

విషయసూచిక



# మహాభారతము

## వచనము

## మహాప్రస్థానిక పర్వము

దేవా! హరిహరనాథా! వైశంపాయన మునీంద్రునిజూచి జనమేజయ మహారాజు యిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! పాండవులు, కృష్ణుడు పరమానంద రూపమగు పరమపదమును పొందెననియు బలరాముడు ఆదిశేషుడగు అనంతునియందు కలిసెననియు సకలయాదవులును మునుల శాపమువలన పుట్టిన అద్భుతమైన రోకలిశక్తివలన నశించిరనియు వినినపిమ్మట యేవిధముగా ప్రవర్తించిరో చెప్పుమని ప్రార్థింపగా వైశంపాయన మునీంద్రుడు జనమేజయునిజూచి యిట్లనెను. జనమేజయ మహారాజా! అర్జునుడు ధర్మరాజు దగ్గరకువచ్చి బలరామ కృష్ణాది యాదవుల వృత్తాంతమును, తనకు కిరాతబలమువలన కలిగిన అపజయమును, వేదవ్యాసుడు తనకు చెప్పిన హితకార్యములను అన్నియు క్రమముగా ధర్మరాజుతో చెప్పెను. ఆమాటలను ధర్మరాజువిని మహాప్రస్థానమునకు మనస్సుగలవాడై యుండెను. (స్వర్గగమనమునకు ప్రయాణమగుట మహాప్రస్థాన మందురు.) ధర్మరాజు భూసంచారముచేసి యోగబలము వలన స్వర్గమునకు వెళ్ళదలచి అర్జునునితో యిట్లనెను.

తమ్ముడా! అర్జునా! కాలుడు సకల భూతములను చంపుచున్నాడు. కర్మ సన్యాసము చేయవలెనని యిపుడు నాబుద్ధియందు దోచుచున్నది. నేను కర్మసన్యాసము చేయవలెనని నిశ్చయించు

చున్నాను. అట్లు చేయుట మంచిదని నీకును నీమనస్సునందు తోచు చున్నట్లు నాకు తెలియుచున్నది. అని ధర్మరాజు అర్జునునితో చెప్పగా అర్జును డిట్లనెను. అన్నా. ధర్మరాజా! కాలమును యేమని చెప్ప వలెను? కాలముతో సమానమైనది కాలమేగాని మరియొకటికాదు. కాలమునకు గల విలాసములు మరియొక వస్తువునకు కలుగజాలవు. నేను చక్కగా ఆలోచించితిని. నీవు చెప్పినట్లు కర్మ సన్యాసముచేసి భూసంచారము చేయుట మిక్కిలి శ్రేష్ఠముగా నున్నది. నీవు చెప్పినమాట నాకు సమ్మతమగును. అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పగా ఆమాటలకు ధర్మరాజు అర్జునుని మెచ్చుకొని ధర్మరాజు శీఘ్రముగా భీమనకులసహదేవులను పిలిపించి వారలతో యిట్లనెను. భీమ నకుల సహదేవులారా! తమ్ములారా! సకలభూత ములను కాలుడు పరిపక్వము చేయుచున్నాడు. గనుక యిపుడు నునము కర్మసన్యాసముచేసి భూసంచారము చేయవలెనని నాకు తలంపు గలిగియున్నది. అర్జునుడు సమ్మతించి యున్నాడు. మీ అభి ప్రాయమును చెప్పవలయునని ధర్మరాజు అడుగగా భీమనకుల సహ దేవులు ధర్మరాజుతో యిట్లనిరి. అన్నా! ధర్మరాజా! నీవు చెప్పినట్లు చేయుదము. నీకుమేము అడ్డు యెన్నటికిని చెప్పము అని వారు ధర్మ రాజుతో చెప్పిరి. ధర్మరాజు తనయిష్టమునకు తనతమ్ములు నలుగు రును సమ్మతించిరని సంతోషించి యుయుత్సుని పిలిపించి అతనితో ధర్మరాజు యిట్లనెను.

యుయుత్సుడా! మేము కర్మసన్యాసముచేసి భూసంచారము చేయవలెనని తలచియున్నారము. నీవు సకల రాజ్య తంత్రములకు ప్రధాననాయకుడవై విచారించుచుండుము. పరీక్షిత్తునకు పట్టాభి షేకము చేసెదను. అని ధర్మరాజు యుయుత్సునితో చెప్పి సకల రాజ్య తంత్రములను రాజగృహమందు జరుపవలసిన నడవడికలను

యుయుత్సునకు చెప్పి యుయుత్సుని ప్రధాననాయకునిగా జేసెను. ధర్మరాజు సకలసైన్య భటులను రప్పించి పెద్దలు స్తుతింపునట్లుగా పరీక్షిత్తునకు సకల భూమినిచ్చి పట్టాభిషేకము చేసెను. అట్లు ధర్మ రాజు అభిమన్యుని కొడుకగు పరీక్షిత్తునకు సకలరాజ్య పట్టాభిషేకము చేసి రాజ్యపరిపాలన పద్ధతులను ఉపదేశించి అర్జునుని భార్యయగు సుభద్రాదేవితో ధర్మరాజిట్లనెను.

మరదలా! సుభద్రా! నీకొడుకగు అభిమన్యునియొక్క పుత్రుడైన పరీక్షిత్తు సకలకురుభూమికి ప్రభువాయెను. కృష్ణుని మనుమడగు వజ్రదేవునకు యింద్రప్రస్థ పట్టణపురాజ్యములను ప్రీతి పూర్వకముగా యిచ్చినాను. నీవు గృహమందుండి యింద్రప్రస్థ హస్తినాపురమందుండు మన గృహములను రెంటిని రక్షించుచుం డుము. నీవు ధైర్యవంతురాలవై వజ్రదేవ పరీక్షిత్తుల గృహము లను రెంటిని విచారించుచుండుము. తక్కిన యాదవులందరిని వజ్ర దేవుడు రక్షింపగలడు. వజ్రదేవుని మనము విచారించి రక్షించుట పరమ ధర్మము. అతనిని మనము రక్షింపనియెడల ధర్మహానియగును. గనుక మాకు మారుగా నీవు గృహమందుండి వజ్రదేవ పరీక్షిత్తులను కాపాడుచుండుము. మేము కర్మ సన్యాసముచేసి భూప్రదక్షిణముచేసి సంచరించెదము. మేము గృహమును విడిచి బయలుదేరునపుడు మా వెంబడి నీవురాక గృహమందు నిలిచియుండవలెను. అని ధర్మరాజు సుభద్రాదేవితో చెప్పి మనస్సులో చింతాక్రాంతుడాయెను.

పిమ్మట ధర్మరాజు భారతయుద్ధమందు చచ్చిన తన బంధు జనులకును రోకలియొక్క దివ్యశక్తివలన చచ్చిన యాదవులకు పరలోక సౌఖ్యము కలుగుటకొరకు ప్రతిమనుష్యుని పేరుచెప్పి అనేక విధములగు దానములను చేసెను. ఆ చేసిన దానములను చెప్పెదను వినుము. అనేకవేల ఏనుగులు, గుర్రములు గోవులు, అనేక సువర్ణ

రాసులను. నానావిధములగు రత్నములను, పరమ సంతోషముతో, ధర్మరాజు బ్రాహ్మణోత్తములకు దానములు చేసెను. ధర్మరాజు మృతులైన తన బంధువులగు సకలకౌరవ యాదవులపేర్లు చెప్పి వారలకు శాశ్వతములైన దివ్యసౌఖ్యములు కలుగునట్లుగా అనేక భూదానములను, కన్యకాదానములను, వస్త్రదానములను చేసి అనేక వేల రథములను యిచ్చెను. పిమ్మట ధర్మరాజు తన్ను ఆశ్రయించియున్న ధౌమ్యుడు మొదలగు బ్రాహ్మణులకు తృప్తి కలుగునట్లు ధనాదిబహు వస్తుసమూహముల నిచ్చెను. కృపాచార్యునకు బహుధనమిచ్చి బహు మానములచేత సంతోషపరచెను.

జనమేజయ మహారాజా! ధర్మరాజు దానాది కార్యములు జరిపి మిగిలిన ధనమును పరమానందముచేత పరీక్షిత్తునకు సమర్పించెను. ఆ పరీక్షిత్తును కృపాచార్యునకు శిష్యునిగా అప్పగించి పురజన దేశజనులను రప్పించి ఆ జనులను పరీక్షిత్తునకు జూపి ఆ జనులతో ధర్మరాజిట్లనెను జనులారా! మా అయిదుగురికి మారుగా యీ పరీక్షిత్తును మీరు సేవింపుడు యితని వలన మీరు రక్షింపబడు చుండుడు. ఈ పరీక్షిత్తునకు రాజ్యమిచ్చి పట్టాభిషేకము జేసితిని. మీరందరును మమ్ము గౌరవించినట్లు యీ పరీక్షిత్తును, గౌరవింపు చుండుడు. మీ రితనియందు అధికప్రేమగలవారై నానాటికి యితని మనస్సునకు సంతోషము కలుగునట్లు ప్రవర్తింపుచుండుడు. మే మైదుగురము కర్మసన్యాసముచేసిభూమియందు సంచరించుచు కాలము గడపెదము. అని ధర్మరాజు పురజనులతో తమ అభిప్రాయమును చెప్పెను. ఆ మాటలను వారు విని తమ ముఖములు చిన్నబుచ్చుకొని ధర్మరాజును జూచి యిట్లనిరి. మహారాజా! ధర్మరాజా! మమ్ము ఉపేక్షించి నీవు వెళ్ళుట తగదు. నీచిత్తము కృపకు మూల భూమిగదా! మీ పెద్దలగు శంతను భీష్మాదుల దగ్గరనుంచి మిమ్ము

ఆశ్రయించుకొని మేము బ్రతుకుచున్నాము. మమ్మును మీరు విడిచి వెళ్ళరాదు. అని ఆ జనులు మోహముచేత గద్గదస్వరముగా ధర్మరాజుతో చెప్పిరి. అప్పుడు ధర్మరాజు తగిన మాటలను చెప్పి తన అభిప్రాయమునకు ఆ జనులును సమ్మతిపరిచెను. అప్పుడు వారిలో కొందరు మరికొందరి సొత్తుల నధికాభిలాషతో అపహరించినందున కలహముజరిగెను. ఆ కలహమును సహదేవుడు విని నవ్వుచు ధర్మరాజును జూచి యిట్లనెను. అన్నా ! ధర్మరాజా ! కలియుగము ప్రవేశించినందున యిట్టి కలహములు కలుగుచున్నవి. జనులయొక్క నడవడిక యిప్పుడే అక్రమముగా కనబడుచున్నది. అని చెప్పి నవ్వెను. ధర్మరాజు నవ్వుచు సహదేవునిజూచి యిట్లనెను. తమ్ముడా ! సహదేవా ! మనము యింతవరకు జీవించితిమి. అది చాలును. మన మిదివరకు క్రమముగానో అక్రమముగానో బ్రతికితిమి. కలియుగము వచ్చినది. గనుక మన మికమీద బ్రతికియుండరాదు. అని ధర్మరాజు సహదేవునితో చెప్పి తన దేహమందుండు సకలాభరణములను తీసి నారకృష్ణాజిన వస్త్రములను ధరించెను. ధర్మరాజునుజూచి భీమార్జున నకుల సహదేవులును ద్రౌపదియు సకలాభరణములను తీసివేసి నారవస్త్ర కృష్ణాజినములను ధరించిరి. ధర్మరాజాదులు కాలమునకు తగిన నిష్ఠావిధులను జరిపి అగ్నిహోత్రములను వుదకమందు కలిపి, ముఖములందు అధికమగు తెలివి గలవారై గృహములను విడిచి బయలుదేరి వచ్చుచుండిరి.

పంచపాండవుల వెనుకవైపు ద్రౌపదీదేవి ఆరవదై వచ్చుచుండెను. ఆరుగురి వెనుక ఒక కుక్క యేడవదై వచ్చుచుండెను. ఇట్లాయేడుగురును గృహమును విడిచి వచ్చుచుండగా వారి వెంబడి హస్తినాపురమందలి బాలవృద్ధులు మొదలగు జనులందరును వచ్చుచుండిరి. పాండవులను చూచుటకుపురజనులందరును రాగా పూర్వము

పాండవులు జూదమాడి అరణ్యవాసమునకు వెళ్లినప్పటివలె కనుపడు చుండెను. యుయుత్సుడు సకలసైన్య భటులను వెంటబెట్టుకొని పాండవుల వెంబడి వచ్చుచుండెను. జనమేజయమహారాజా! నీతండ్రి యగు పరీక్షిన్మహారాజును అతని భార్యలగు అంతఃపురస్త్రీలు మొదలగు వారును పాండవుల వెనుక వచ్చుచుండిరి. హస్తినాపుర మందు గల జనులందరును ధర్మరాజు దగ్గరకువచ్చి పాండవులను చూచు చుండిరి. ధర్మరాజు తన వెంబడి వచ్చు జనులను ఒకనినైనను నిలువు మని చెప్పక తలవంచుకొని వెళ్లుచుండెను.

జనులందరును మిక్కిలి దుఃఖముగలవారై విచారముచేత శక్తిలేక దేహములు వణకుచుండగా, ధర్మరాజ భీమార్జున నకుల సహదేవులకు క్రమముగా నమస్కరించి వెనుకకు తిరిగి హస్తినా పురమునకు వచ్చిరి. పురజనులును యుయుత్సుడును, సకలసైన్యము లును, నీ తండ్రియగు పరీక్షితుడును, అతని అంతఃపుర స్త్రీలు మొదలగు వారందరును మిక్కిలి విచారములో హస్తినాపురమును ప్రవే శించిరి. అప్పుడు అర్జునుని భార్యయగు ఉలూచి యను నాగకన్యక పాతాళలోకమందుండు తన తండ్రిదగ్గరకు పోయెను. అర్జునుని మరి యొక భార్యయగు చిత్రాంగద తన కుమారుడగు బభ్రువాహనుని దగ్గరకు వెళ్ళెను. తక్కిన స్త్రీలందరును, నీ తండ్రియగు పరీక్షిత్తుని దగ్గర యుండిరి. జనమేజయ మహారాజా! అప్పుడు కృపాచార్య ధౌమ్యులిద్దరును నీ తండ్రియగు పరీక్షిత్తునకు, తదితర జనులకు తగిన మాటలను చెప్పి యూరార్చిరి. సుభద్ర మొదలగు స్త్రీ జనులకును, పురజనులకును తగురీతిని మాటలు చెప్పి కృపాచార్య ధౌమ్యులు యూరార్చి కార్యములయందు ప్రోత్సాహముగ జేసిరి.

హస్తినాపురము పూర్వమువలెనే సంపదలచేత ప్రకాశించు చుండెను. ఇక ధర్మరాజుయొక్క వృత్తాంతమును చెప్పెదను వినుము.

ధర్మరాజు హస్తినాపురమును విడిచి ముందర వెళ్ళుచుండెను. ధర్మరాజువెనుక భీముడును, భీమునివెనుక అర్జునుడును. అర్జునునివెనుక నకులుడును, నకులునివెనుక సహదేవుడును. సహదేవునివెనుక ద్రౌపదియు, ద్రౌపదివెనుక కుక్కయు, యిట్లావారందరును క్రమముగా వెళ్ళుచుండిరి. వారిని విడువక కుక్కయు, వారు గృహమును విడిచి వచ్చినది మొదలు వారివెంబడి వెళ్ళుచుండెను. ఇట్లు వారందరు రాజమార్గమునుబట్టి ఉపవాసవ్రతముగలవారై వెళ్ళుచుండిరి. గంగానదీ సమీపమునకు పోయి వారందరు అచటనుండి పూర్వపువైపునకు వెళ్ళదలచి యోగబలముచేత అరణ్యములను నదులను దాటి పూర్వసముద్రపు గట్టునకు చేరిరి.

## అగ్నిదేవుడు అర్జునునిచేత గాండీవము సముద్రమున వేయించుట

పాండవులయెదుట అగ్నిదేవుడు అచ్చట కనబడెను. ఆయగ్నిదేవుని అవయవకాంతులు దిక్కులయందును ఆకాశమందును వ్యాపించుచు భయము పుట్టించుచుండెను. అర్జునుడు బహుకాలమునుండి తాను ధరించియుండు గాండీవమందుగల స్నేహముచేత గాండీవమును విడువక తెచ్చుచుండెను. ఆ యర్జునునితో అగ్నిదేవు డిట్లనెను. అర్జునా! కృష్ణుని చక్రము బహుకాలము క్రిందటనే ఆకాశమునకు యెగిరిపోయెను. నీవు యెందువలననో గాండీవమును విడువకున్నావు. దేవకార్యముకొరకు వరుణదేవునిదగ్గరగల గాండీవమును నీకు తెచ్చి పూర్వము యిచ్చియుంటిని. గనుక నిదగ్గరగల గాండీవమును మహాధనస్సును వరుణదేవునకు అప్పగించుము. అని అగ్నిదేవుడు అర్జునునితో చెప్పెను. అర్జునుడు మంచిది. నీవు చెప్పినట్లు చేసెదనని అగ్నిదేవునితో చెప్పి ధర్మరాజ భీమ నకుల సహదేవులకు తెలియపర

చెను. వారును అగ్ని దేవుడు చెప్పినట్లు చేయుమని అర్జునునితో చెప్పిరి. అర్జునుడు గాండీవ మను మహాధనుశ్రేష్ఠమును సముద్రములో పెట్టెను. అంతట అగ్ని దేవు డంతర్ధానుడై వెళ్ళెను. యోగవిద్యానిపుణులగు పాండవులు తూర్పుసముద్రపు గట్టుదగ్గరనుంచి భూమండలమును ప్రదక్షిణముగా తిరుగదలచి యోగమునలన దక్షిణసముద్రపు గట్టుకు చేరిరి. అంతట ఆ దక్షిణసముద్రపు గట్టుదగ్గరనుంచి పశ్చిమదిక్కు వైపు మొగముంచి పశ్చిమసముద్రపు గట్టుకు చేరిరి. పశ్చిమసముద్రపు గట్టు భూమికి నైఋతిదిక్కు దగ్గరనుండి చక్కగా ఉత్తరదిక్కు వైపు వెళ్ళుచు సముద్రమునందు కలసిపోయిన ద్వారకాపట్టణ సమీపముగా పోవుచుండిరి. జనమేజయమహారాజా! అక్కడనుండి పాండవులు అనాయాసముగా యోగబలశక్తివలన హిమవత్పర్వతమును దాటి అనేక అరణ్యా నవనదీ పర్వతాది ప్రదేశములను అతిక్రమించి వెళ్ళుచుండిరి. ఇట్లావ ండవులును ద్రౌపదియు, ఆకుక్కయు, యేడుగురును, దృఢమైన యోగాభ్యాస శక్తివలన నిర్మలబుద్ధులు గలవారై దుఃఖశ్రమములు లేనివా రగుచు నడచుచు మేరుపర్వత సమీప భూమిమీద గా వెళ్ళుచుండిరి.

## ద్రౌపది మొదలగువారు గతప్రాణులై పడుట

జనమేజయమహారాజా! ఇట్లాయేడుగురును స్థిరమగు యోగబలమును సాధనముగా చేసికొని మిక్కిలి వేగముగా మేరుపర్వత సమీపభూమిమీద వెళ్ళుచుండిరి. ద్రౌపదీదేవి యోగబలము తగ్గినదై భూమిమీద పడెను. భీము డదిచూచి ధర్మరాజుతో యిట్లనెను. అన్నా! ధర్మరాజా! ద్రౌపది యోగమునువిడిచి భూమిమీదపడెను. ద్రౌపది ధర్మచిత్తముగలది. ద్రౌపదివలన ధర్మహాని కలిగినట్లు యెప్పుడును తెలియలేదు. అట్టి ద్రౌపది యోగమును విడిచి భూమి

కూలపడి ప్రాణములు విడుచుటకు కారణమేమో తెలియకున్నది.
అని భీముడు ధర్మరాజుతో చెప్పి దుఃఖించుచు అడిగెను. అంతట
ధర్మరాజు భీమునితో యిట్లనెను. భీముడా! ద్రౌపది సర్వకాలముల
యందును అర్జునుని విషయమై పక్షపాతము కలిగియుండును అట్టి
పక్షపాతముచేత మన నలుగురియందుకంటె అర్జునునియందు అధిక
మగు ప్రీతిగలదై యుండును. అట్టిదోషము యీ ద్రౌపదియందు
కలదు. ఆదోషము చేత దీని పుణ్యకార్యములు ఫలించనందున దీని
కింతటి దురవస్థ లభించెను. అని ధర్మరాజు భీమునితో చెప్పి తన
బుద్ధికి సమాధానము చేసికొని స్థిరమైన ధైర్యశక్తి కలవాడై నిర్వికార
మనస్సుతో ద్రౌపది కళేబరమును విడిచి వెళ్ళుచుండెను. అట్లు
యోగబలముచేత ధర్మరాజు వెళ్ళుచుండగా అతనిని వెంబడించుకొని
భీమార్జున నకులసహదేవులును వరుసగాయు యోగబలముచేత వెళ్ళు
చుండిరి. కొంతదూరమట్లు వెళ్ళినపిమ్మట సహదేవుడు యోగమును
విడిచి క్రిందబడి ప్రాణములను విడచెను. భూమిమీద పడిన సహ
దేవుని భీముడు చూచి ధర్మరాజుతో యిట్లనెను. అన్నా ధర్మరాజా!
సహదేవుడు యోగమును విడిచి క్రిందబడి ప్రాణములను విడిచెను.
సహదేవుడు సర్వదా అహంకారము లేనివాడు. నీకు సర్వదా అతి
భక్తితో శుశ్రూషలు చేయుచుండును. మాఅందరికంటె సహదేవుడు
ధర్మమార్గము తప్పక ప్రవర్తించుచుండును. అట్టి సహదేవుడు యోగ
మును విడిచి యిట్లు పడి చచ్చుటకు కారణమేమో చెప్పుమని భీము
డడుగగా ధర్మరా జిట్లనెను.

భీముడా! యీసహదేవుడు సర్వదా తనకంటె బుద్ధిమంతుడు
లేడని తలచుచుండును. అట్టి అహంకారముచేత సహదేవుడు యోగ
మును విడిచి యిట్లాయెను. అని ధర్మరాజు భీమునితో చెప్పి సహ
దేవుని కళేబరమును ఉపేక్షచేత విడిచి మిక్కిలి ధైర్యవంతుడై

వెళ్ళుచుండెను. ధర్మరాజును వెంబడించి భీమార్జున నకులులును, కుక్కయు వెళ్ళుచుండిరి. కొంతదూరమట్లు వెళ్ళినపిమ్మట తనతమ్ముడైన సహదేవుడును, ద్రౌపదియు క్రిందపడి చచ్చిరని నకులుడు దుఃఖించి ధైర్యములేక యోగమునువిడిచి క్రిందబడెను. భీముడు క్రిందబడి ప్రాణములను విడిచిన నకులునిజూచి మిక్కిలి విచారమైన మనస్సుతో ధర్మరాజుతో యిట్లనెను.

అన్నా! ధర్మరాజా! నకులుడు యోగమును విడిచి క్రిందబడెను. నకులుడు మిక్కిలి సౌందర్యదేహము కలిగినవాడు. యీనకులుడు మిక్కిలి శౌర్యధైర్య స్నేహము కలిగి యుండును. ఇతని యందుగల మంచిగుణములు లోకమందు మరియొకరి కుండజాలవు. ఇతనితో సౌందర్యమందును, పుణ్యమందును, సమానుడు మరియొకడు లేడు. ఇట్టి పుణ్యాత్ముడైన నకులునకు యిట్టిదురవస్థ యెట్లు ప్రాప్తించెనో తెలియలేము. అయ్యో! క్రిందబడి ప్రాణములను విడిచిన నకులుని చూడుము. అని భీముడు చెప్పి దుఃఖించగా ధర్మరాజిట్లనెను. భీమా! నకులుడు తనతో సమానమైన సౌందర్యదేహుడు యీలోకమందెక్కడను లేడనియు, తానే అధికసౌందర్యము కలవాడనియు, సర్వదా తలచుచుండును అట్టి అహంకారము గలిగి యున్నందున నకులునకు యిట్టికీడు కలిగెను. అని ధర్మరాజు భీమునితో చెప్పి మంచి ధైర్యశక్తి కలవాడై నకులుని కళేబరమునుచూచి ఉపేక్షించి వెళ్ళుచుండెను. ధర్మరాజును వెంబడించి భీమార్జునులును, కుక్కయు వెళ్ళుచుండిరి. కొంతదూరము వెళ్ళినతోడనే నకుల సహదేవ ద్రౌపదులు పడిన పాటును అర్జునుడు చూచుచు తలచుకొనుచు దుఃఖించి ధైర్యముతప్పి యోగమునువిడిచి ప్రాణములను వదలి క్రిందబడెను. అర్జునుని భీముడుచూచి మిక్కిలి దుఃఖము గలవాడై ధర్మరాజతో యిట్లనెను. అన్నా ధర్మరాజా! అర్జునుడు

ప్రాణములనువిడిచి క్రిందబడెను చూచుము అర్జునుడు యెప్పుడును అసత్యపుమాటను చెప్పలేదు. పుణ్యాత్ముడైన అర్జునుడు యిట్లుపడి పోవుటకు కారణము తెలియదు. అని భీముడు ధర్మరాజుతో చెప్పి దుఃఖించుచుండగా ధర్మరాజు భీమునితో యిట్లనెను.

భీమా! అర్జునుడు కౌరవ సైన్యమునంతయు ఒక్కనాడే చంపెదనని నాతో చెప్పి యున్నాడు ఆ చెప్పిన ప్రకారము చేయలేదు. వేరొకవిధముగా చేయుటవలన మిక్కిలి పాపము కలిగెను అదిగాక అర్జునుడు సకల రథికులను. తిరస్కరించుచు, లక్ష్యపెట్టక యుండును. ఈ రెండు కారణములవలన అర్జునుడు నశించెను. అని ధర్మరాజు భీమునితో చెప్పి అర్జునుని పుణ్యదేహమును విడిచి మిక్కిలి ధైర్యవంతుడై యోగబల శక్తివలన వెళ్ళుచుండెను. భీముడు తన తమ్ములును ద్రౌపదియు పడిచచ్చిరని దుఃఖించుచు ధైర్యములేనివాడై క్రిందబడి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! నేను యోగమును విడిచి క్రిందబడితిని. నేనిట్లు పడుటకు కారణమును నీవు యెరిగిన యెడల నాయందు కృపజూపి నాకు చెప్పుము అని అడుగగా ధర్మరాజు భీమునితో యిట్లనెను.

భీమా! నీవు అధికముగ్గా ఆహారమును భక్షించుచుందువు. నీవు నీబాహుబలమువలన యెవ్వరిని లక్ష్యపెట్టక ప్రవర్తించుచుంటివి. నీవు బలగర్వమువలన సర్వదా నోటికివచ్చినట్లు మాటలాడుచుందువు. ఈకారణములవలన యిప్పుడు నీవు యోగబలమును విడిచి క్రిందబడితివి. అని ధర్మరాజు భీమునితో చెప్పి భీముని చూడక వెళ్ళుచుండెను. ధర్మరాజును వెంబడించి ఆతని వెనుక మిక్కిలి భక్తితో కుక్కయు వెళ్ళుచుండెను. జనమేజయమహారాజా! ధర్మరాజు వెంబడి మిక్కిలి భక్తితో యోగబలమువలన కుక్కయు వెళ్ళుచుండెను. అని నీకు మాటిమాటికి చెప్పుచుంటిని, ఆకుక్కయొక్క

వృత్తాంతమును తరువాత చెప్పెదను. కుక్క ను మరువక యుండుము. అని వైశంపాయనుడు జనమేజయునితో చెప్పెను. జనమేజయ మహారాజా! ధర్మరాజు మిక్కిలి ధైర్యముతో మిక్కిలి యోగనిష్ఠ గలిగి వెళ్ళుచుండగా దేవేంద్రుడు రథమును తీసికొని ధర్మరాజున కెదురుగా వచ్చెను.

## ఇంద్రుడు రథముగొని ధర్మరాజు నెదుర్కొనుట

దివ్యరథమును తీసికొని ధర్మరాజునకు యెదురుగా వచ్చిన దేవేంద్రునియొక్క దేహకాంతి భూమ్యాకాశాదులగు దిక్కుల యందును వ్యాపించియుండెను. దేవేంద్రునిరథము వచ్చుచుండగా ఆరథధ్వనిచేత మేరుపర్వతిపు గుహలు ప్రతిధ్వని కలిగించుచుండెను. అక్కడగల సిద్ధసాధ్యసంఘములు నానావిధములుగా దేవేంద్రుని స్తుతించుచుండిరి. స్తోత్రముయొక్క ధ్వని మిక్కుటముగానుండెను. మేరుపర్వతసమీపమందు కల్పవృక్షములు పుష్పవర్షములు కురియు చుండెను. అట్టివిధముగా దేవేంద్రుడు రథముచు తెచ్చి ధర్మరాజు యెదుట నిలిపెను. ధర్మరాజు మిక్కిలి వినయభక్తితో దేవేంద్రునకు నమస్కరించెను. అంత దేవేంద్రుడు సంతోషించి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! యీదివ్యరథముమీద యెక్కుము. స్వర్గము నకు వెళ్ళెదము:అని దేవేంద్రుడు ధర్మరాజుతో చెప్పగా అప్పుడు ధర్మరాజు దుఃఖముచేత పరితపించుచు దేవేంద్రునితో యిట్లనెను. మహాత్మా! దేవేంద్రా! నాతమ్ములగు భీమార్జున నకుల సహదేవులు నలుగురును నాతోడ వచ్చుచు భూమిమీదపడి ప్రాణములు విడిచిరి. ఆ దుఃఖము నామనస్సును బాధించుచున్నది. ద్రౌపది నావెంబడి వచ్చుచు శ్రమజెంది క్రిందబడి ప్రాణములు విడిచెను. గాన నావెంబడి వచ్చిన నాతమ్ములును ద్రౌపదియు యిపుడు రానియెడల నేను యీ

రథము నెక్కనుగనుక వారందరిని నా వెంబడివచ్చునట్లు చేయుము. నీవు కృపగలవాడవు. నా ప్రార్థనను ఫలింపజేయుము. అని ధర్మరాజు దేవేంద్రుని ప్రార్థింపగా దేవేంద్రుడు ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! నీవు దుఃఖపడవలసిన పనిలేదు. నీ తమ్ములు నలుగురును ద్రౌపదితో కూడినవారలై స్వర్గలోకమునకు వెళ్ళి యున్నారు. నీవు వారందరిని స్వర్గమందు చూడగలవు. నీ దేహమును విడువవద్దు. నీవు ధర్మమయస్వరూపుడవు గనుక నీవు యీ దేహము తోడనే స్వర్గమునకు రమ్ము రథమును ఎక్కుము. అని దేవేంద్రుడు చెప్పగా ధర్మరాజిట్లనెను.

## ధర్మరాజ సురరాజులకు కుక్కవిషయముగా జరిగిన సంవాదము

మహాత్మా! దేవేంద్రా! యీకుక్క హస్తినాపురమునుండి నా వెంబడి వచ్చుచు భక్తిపూర్వకముగా నన్ను సేవించుచు నన్ను విడువక నాతోడ వచ్చుచున్నది. గనుక యీకుక్క నా వెంబడి స్వర్గమునకు రావలయును. నామనస్సు అన్యాయమార్గమునకు సహింప నేరదు. అని ధర్మరాజు ప్రార్థింపగా దేవేంద్రుడిట్లనెను. ధర్మరాజా! నీ విట్లు చెప్పుట ధర్మమగునా? కుక్కకు దేవస్వభావము కలుగదు. ఈ అభిప్రాయమును విడువుము. ఇది సాధ్యము కాదు. యీ కుక్కను విడిచి వెళ్ళినయెడల అన్యాయము కానేరదు. గనుక నీవట్లు తలంచక రథముమీద నెక్కుము. అని దేవేంద్రుడు నవ్వుచు ధర్మరాజుతో చెప్పెను. ధర్మరాజు దేవేంద్రునితో యిట్లనెను. మహాత్మా! దేవేంద్రా! నిన్ను నేను ఆశ్రయించి యున్నాను. నీవు పండితుడవై ప్రభువై యున్నావు. కుక్కను నాతో స్వర్గమునకు రప్పించుట సాధ్యము కాకపోయినను నీవంటి మహాత్ముడు నాకోరికను ఫలింప జేయవలయునుగదా! యీకుక్క నాయందు భక్తిగలిగి నన్ను ఆశ్ర

యించుకొని వచ్చుచున్నది. ఇట్టి నాభక్తుని విడిచి పొందు భాగ్యము భాగ్యముకాదు. అది నాకు యిష్టము కానేరదు. అని ధర్మరాజు చెప్పగా దేవేంద్రుడు మరల ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! ధర్మమార్గముల విషయమై నీవు కోపించుకొనవద్దు. నేను చెప్పుమాటలను వినుము. కుక్కలకు నా నివాసస్థానమగు స్వర్గము లభింపనేరదు. పాపమువలన కుక్కజన్మము కలుగును. పుణ్యమువలన స్వర్గము కలుగును. గనుక యీకుక్కను నీవు విడిచినందున అన్యాయము కలుగదు. నీకు మిక్కిలి స్వర్గలోకభోగలక్ష్మి ప్రాప్తించినపుడట్టి భోగలక్ష్మిని విడువరాదు. ఈ కుక్కను విడువనియెడల నీకు స్వర్గభోగము కలుగదు. అని దేవేంద్రుడు చెప్పగా మరల దేవేంద్రునితో ధర్మరాజు యిట్లనెను.

మహాత్మా! దేవేంద్రా! తనయందు భక్తిగలవానిని విడువరాదు. అట్లు విడిచినయెడల బ్రహ్మహత్యతో సమానమైన పాపము కలుగునని పెద్దలు చెప్పెదరు. గనుక నీవు సకల ధర్మ రహస్యములను యెరిగినవాడవు. నీకు నేను చెప్పవలసినపనిలేదు. ఈ కుక్కను విడిచి నేను వచ్చుట ధర్మముకాదు. దివ్యసౌఖ్యమును అపేక్షించి పాపమును చేయజాలను అని ధర్మరాజు చెప్పను. దేవేంద్రుడు మరల ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! వ్రతనియమము గలవాడు కుక్కను తాకినయెడల అట్టివాడు కోరిచేసిన పుణ్యమునకు నాశనము కలుగును. గనుక యిట్టి పాపరూపమగు కుక్కను గురించి యిట్లు నిర్బంధింపరాదు. గాన యీకుక్కనువిడువుము. దీనిని విడిచినయెడల నీకు స్వర్గలోక సౌఖ్యము కలుగును. నీవు మిక్కిలి పుణ్యాత్ముడవై యున్నావు. ఆ పుణ్యాధిక్యతచేత స్వర్గమును దేవభావమునచూచియు స్వర్గసుఖము లనుభవింపక యిట్లుండరాదు. భీమసేన అర్జున నకుల సహదేవ ద్రౌపదులను విడిచితివి. వారిని గురించి యింతవరకు మోహ

లాడవంటివి. ఈ కుక్కను దేవగణములచేతను పండితులచేత స్తుతింప దగిన పుణ్యాత్ముడవు. నీవు యీకుక్కను గురించి యిట్లు మాటలాడ రాదు. అని దేవేంద్రుడు చెప్పగా ధర్మరాజు మరల యిట్లనెను.

మహాత్మా! దేవేంద్రా! నీవుస్వర్గలోకములకు ప్రభుడవగుదువు. ధర్మమునకు ప్రభుడవై యున్నావు. కనుక నీకంటె నేను ధర్మాధర్మ ములను యెరిగిన వాడను కాను. మీవంటి మహాత్ములతో వాదము చేయరాదు. అయినను విన్నపము చేయదగిన విషయమును మీతో విన్నవించుకొనుటచేత దోషము లేదని తలచి విజ్ఞాపనము చేసికొనె దను. భీమార్జున నకుల సహదేవ ద్రౌపదులు కాలవశమువలన మృతులైరి. వారిని విడువక నేను యేడ్చుచున్న యెడల మరల వారు రారుగదా! నాతో వచ్చినకుక్క చావక బ్రతికియుండెను. దానిని విడువకుండుట తప్పగునా! నేను చెప్పుకొను విన్నపమును వినుము. శరణుజొచ్చినవానిని రక్షింపకున్నను పరిశుద్ధస్నేహితునకు ద్రోహము చేసినను, స్త్రీని చంపుటయు, బ్రాహ్మణుని విత్త మపహరించు టయు, యివియన్నియు సమాన పాపములని నాకు తోచు చున్నవి. గనుక అపరాధము లేని భక్తుని విడువరాదు. ఈ కుక్క నాయందు భక్తిగలదై నన్ను ఆశ్రయించుకొని నా వెంబడి వచ్చు చున్నది. నాకుగలుగు స్వర్గలోక సౌఖ్యము అక్కరలేదు. నాయందు నీమనస్సు నుంచుము. నన్ను కృపతో చూడుము. ఈ కుక్కను నేను విడువనందుకు నాకు పాపము కలుగకుండునట్లు వరమిమ్ము నీవు వెళ్ళుము. నేను తీక్ష్ణమగు తపస్సు చేసికొనుచు యీవనభూమియం దుండి నిన్ను సేవించుచుండెదను. అని ధర్మరాజు నిర్భయముగా దేవేం ద్రునితో చెప్పెను.

## సారమేయ రూపమున వచ్చిన ధర్ముడు ధర్మరాజునకు ప్రత్యక్షమగుట

జనమేజయ మహారాజా! ధర్మరాజు మిక్కిలి దృఢనిశ్చయముతో దేవేంద్రునితో చెప్పిన పిమ్మట జరిగిన వృత్తాంతమును చెప్పెదను వినుము. ఆ కుక్క ధర్ముడను దేవత. ఆ ధర్ముడు కుక్క రూపముదాల్చి ధర్మరాజుయొక్క చిత్తమును పరీక్షింప దలచి హస్తినాపురమునుండి ధర్మరాజు వెంబడి వచ్చుచుండెనని తెలిసికొనుము. ధర్మరాజు కుక్కనువిడిచి స్వర్గమునకు వెళ్ళజాలక దేవేంద్రునితో నిర్భయముగా మాటలాడిన మాటలను ధర్మదేవతవిని తన కొడుకగు ధర్మరాజునకుగల ధర్మబుద్ధికి పరమానందమునుపొంది కుక్కరూపమును విడిచి తననిజరూపముతో ధర్మరాజునకు ప్రత్యక్షమాయెను. ధర్మరాజు మిక్కిలి వినయ భయములతో నమస్కరించుచు పరమానందము గలవాడాయెను. ధర్మరాజుతో ఆ ప్రత్యక్షమైన ధర్మదేవు డిట్లనెను.

పుత్రా! ధర్మరాజా! నీపుణ్యమునకు నీకుగల నిర్మల శ్రద్ధకును సర్వభూతముల యందు నీకుగల దయకును నామనస్సు పరమానందమునుపొందెను. పుత్రుడా! భూలోకమందు నీవంటి ధర్మాత్ముడు లేడు. పూర్వమునీవు అరణ్యవాసము చేయుచు ద్వైతవనమం దున్నపుడు సరస్సు గట్టునకు నీటినిమిత్తమై నీతమ్ములు రాగా నీనలుగురు తమ్ములను చంపితిని. అంతట నీవు వచ్చితివి. అపుడు నీనలుగురు తమ్ములలో ఒకనిని కోరుకొనిన యెడల బ్రతికించెదనని నీతో చెప్పితిని. అపుడు నీవు నీతల్లులగు కుంతీమాద్రీదేవుల నిద్దరిని తలంచుకొని కుంతీపుత్రులగు ముగ్గురిలో నేనుంటిననియు మాద్రీదేవి కుమారులగు నకుల సహదేవులలో నొకనిని కోరుట ధర్మమనియు తలచి నకు

లుని బ్రతికింపుమని నాతో చెప్పితివి. ఇట్టి ధర్మబుద్ధి యెవరికిని కలుగ నేరదు.

పుత్రా! ధర్మరాజా! నీ తల్లియగు కుంతియందు బుట్టిన భీమార్జునులను కోరుకొనక నకులుని బ్రతికింపుమని కోరితివి. ఆ ధర్మము నా మనస్సును యెప్పుడును విడువకున్నది. ఆ మాటకునిన్ను యెట్లు స్తుతింపవలెనో తెలియదు. నీ నడవడిక యంతయు యీ దేవేంద్రుడు యెరుగును. ఇప్పుడు నీయందు భక్తితో యీ కుక్క వచ్చినదని ఆ కుక్కను నీవు విడువజాలక దేవేంద్రుడు తెచ్చిన రథము మీద యెక్కుటకు సమ్మతింపకుంటివి నీతో సమానులగు పుణ్యాత్ములు స్వర్గమందైనను లేరు. నీయందు యింత ధర్మబుద్ధి వున్నదని యిప్పుడే దేవేంద్రుడు తెలిసికొనెను. ఇక నీవు చింతలేని వాడవై యీ దేహముతోడనే స్వర్గమునకు వెళ్ళుము. నీకు సకల పుణ్యలోకములును ఆశ్వర్యమును కలిగింపవు. నీకు పరిశుద్ధమైన శాశ్వత సుఖము కలుగును. నిన్ను దేవలోకమందుండు వారందరును స్తుతింపగలరు. అని కుక్కరూపమును విడిచిన ధర్మదేవుడు ధర్మ రాజుతో చెప్పెను.

పరమ సంతోషముతో గంధర్వులును, దేవమునులును, మరుద్దేవతలును, అశ్వినీ దేవతలును వసుదేవతలును అక్కడికి వచ్చిరి. ధర్మదేవుడును దేవేంద్రుడును పరమ ప్రీతిచేత ధర్మరాజును యెత్తుకొని దివ్యరథము మీద కూర్చుండబెట్టిరి. ధర్మరాజు సకల దేవసమూహములచేత సేవింపబడుచు దివ్యరథముమీద యెక్కి స్వర్గమునకు వెళ్లుచుండెను. ధర్మదేవుడును దేవేంద్రుడును తమ దివ్యవిమానముల మీద యెక్కినవారలై ధర్మరాజునకు రెండు ప్రక్కల నడచుచుండిరి. ధర్మరాజు దివ్యరథముమీద యెక్కినవాడై సకల దేవతలచేతను సేవింపబడుచు తన తేజస్సు సకల దిక్కుల

యందును వ్యాపించుచుండగా సిద్ధులచేత స్తుతింపబడుచు ధర్మరాజు ఆ దేహముతోడనే స్వర్గలోకమునకు వెళ్ళెను. అప్పుడు స్వర్గలోక సముడును, అఖండ ప్రజ్ఞావంతుడునగు నారదమునీంద్రుడు ధర్మరాజునందు అనుగ్రహము గలవాడై అందరువినునట్లుగా సంపూర్ణ కంఠ ధ్వనితో యిట్లనెను.

దేవతలారా! భూలోకమందు దానములచేతను తపస్సుల చేతను ప్రసిద్ధులైన మహారాజులను యిదివరకు మనము అనేకులను వినియున్నాముగదా! మహారాజుల యొక్క కీర్తులు సకలలోకము లందును వ్యాపించెను. మహారాజులలో ఒకడైనను మనుష్య దేహముతో యీస్వర్గలోకమునకు రాజాలకపోయిరి. ధర్మరాజు మనుష్య దేహముతో స్వర్గలోకమునకువచ్చెను ఇట్టిపుణ్యాత్ముడు మరియొకడు కనబడలేదు. అని నారద మహాముని అందరు వినునట్లు పెద్ద కంఠ ధ్వనితో చెప్పెను. ధర్మరాజు నారదమహామునితో యిట్లనెను. మహాత్మా! నారదమునీంద్రా! నా తమ్ములగు భీమార్జున నకుల సహదేవులను. యితరబంధువులను జూచుటకు అపేక్షించియున్నాను. అయ్యో! భీమార్జున నకుల సహదేవులుండు స్థలములను చూపుడు, వారుండుస్థలములు సుఖవంతములైనను, దుఃఖవంతములైనను అక్కడనే నేనుండెదను. సకలలోకములను చూడవలెనను వేడుకకంటె నా తమ్ములను, నా పక్షమందు యుద్ధముచేసి చచ్చినవారిని చూడవలెనను వేడుక నాకు అధికముగా నున్నది అని యిట్లు ధర్మరాజు నారదునితో చెప్పగా దేవేంద్రుడామాటలువిని ధర్మరాజుతో తగినట్లు మాటలాడవలెనని యితడు చెప్పిన మాటలు హీనములు గావని తలచి ధర్మరాజుతో యిట్లనెను.

మహాత్మా! ధర్మరాజా! నీవు పుణ్యాధిక్యతచేత మనుష్య దేహమును విడువక, ఆ దేహముతోడనే యీ స్వర్గలోకమునకు

వచ్చితిని. ఇక్కడకు వచ్చినను నీకు మనుష్యస్వభావము కలిగి యున్నది. ఈ దేవసభయందుండు మునులను సిద్ధులను చక్కగా చూడుము. పూర్వమువలె మనుష్యభావమును కలిగియుండదగదు. ఇతరులు పొందజాలని మహాపదమును నీవిప్పుడు పొందితివి. మహాపదము నీనిర్మలమనస్సువలన కలిగెను. నీతమ్ములైన భీమార్జునసకుల సహదేవులు నీవుపొందిన స్థానమును పొందజాలరు. పూర్వమువలె వారితో నీకు స్నేహసంబంధము యిక్కడ అనుకూలింపదు. దైవ స్వరూపమగు బుద్ధిచేత స్వర్గలోక విశేషములను చూడుము. అని దేవేంద్రుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు సర్వలోకప్రభుడగు దేవేంద్రునితో యిట్లనెను. మహాత్మా! దేవేంద్రా! మీరు యేమి చెప్పినను నాతమ్ములను ప్రీతితో చూడకమానను. అయ్యో! నా పుత్రమిత్ర సహోదరాది జనులను చూడక నిలువజాలను. గనుక నా తమ్ములు మొదలగు బంధుజనుల నందరినిజూచి మరల యిక్కడకు వచ్చి సకలభోగములను అనుభవించెదను. నాబంధుజనులను చూచు టయే నాకు పరమానందమును కలిగించును అని ధర్మరాజు దేవేంద్రు నితో చెప్పెను. అని మహామునులచేత స్తుతింపదగినట్లు పాండవుల యొక్క స్వర్గప్రయాణమును, వైశంపాయన మునీంద్రుడు జనమే జయునితో చెప్పెను.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య
పుత్ర లక్ష్మనారాయణామాత్య ప్రణీతంబైన
తెనుగువచన కావ్యంబగు శ్రీ మహా
భారతమందు మహాప్రస్థానికపర్వము
ము గి సె ను.

# స్వర్గారోహణ పర్వము

## విషయసూచిక



# మహాభారతము

## వచనము

## స్వర్గారోహణ పర్వము

దేవా! హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుని జనమేజయుడు చూచి యిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! నాపూర్వపు తాతలగు పాండవులును దుర్యోధనాదులును స్వర్గస్థులై యే యే విధములగు స్థానములను పొందిరో, యెట్లు ప్రవర్తించిరో. చెప్పుము. ఆ వృత్తాంతమును వినవలెనని నామనస్సునందు అపేక్ష కలిగియున్నది. నీవు సర్వజ్ఞుడవగుదువు. నీయొక్క దివ్యవాక్యములను వినుటకు నేను అపేక్షించి యున్నాను నాయందు కృపనుంచి నా పూర్వ పితామహులగు పాండవ కౌరవుల స్వర్గలోక వృత్తాంతములను చెప్పవేయని ప్రార్థించెను. అని జనమేజయమహారాజు ప్రార్థింపగా సర్వలోక పూజ్యుడగు వేదవ్యాసమునీంద్రుని కృపవలన కలిగిన జ్ఞానవంతుడును పండితులచేత స్తుతింపదగినట్టివాడు నగు వైశంపాయనమునీంద్రు డిట్లనెను. జనమేజయమహారాజా! పూర్వము చెప్పిన చొప్పున స్వర్గమును బొందిన ధర్మరాజు తన బంధుజనులను చూచుటకు అపేక్షించెను. దేవేంద్రుడు సమ్మతించి ఒక దేవదూతను పిలిచి వానితో యిట్లనెను. దేవదూతా! ధర్మరాజునకు తన బంధుజనులను చూడవలెనని అపేక్ష కలిగియున్నది. గనుక నీవు యీ ధర్మరాజును తీసికొనివెళ్ళి బంధుజనులను యితనికి జూపుము. అని దేవేంద్రుడు చెప్పగా దేవదూత వినయముతో ధర్మరాజును తీసికొని వెళ్ళెను.

## ధర్మరాజు దుర్యోధనుని జూచి అసూయాపరుడైన నారదు డతనిం దేర్చుట

ధర్మరాజుతో నారదాదిమునులు కొందరు వెళ్ళిరి. వేడుకగా వెళ్ళిన ధర్మరాజాదులకు యెదుటనే దుర్యోధనుడు కనబడెను. దుర్యోధనుడు యెత్తైన సింహాసనముమీద కూర్చుండి సూర్యునితో సమానమైన కాంతిగలవాడై దేవతాస్త్రీలచేత చుట్టబడి వీరలక్ష్మి చేత ప్రకాశించుచు మిక్కిలి సౌఖ్యసాధనములు కలిగియుండెను. మిక్కిలి విభవముతో దుర్యోధనుడు స్వర్గమందు ప్రకాశించుచుండగా ధర్మరాజతనిని చూచి తనవెంబడియుండు నారదాదిమునులతో యిట్లనిరి. మహాత్మా! మునులారా దుర్యోధనుడు మిక్కిలి లోభ గుణముగలవాడు దీర్ఘాలోచనము లేక స్వల్పబుద్ధి గలిగియుండెను. ఇతనినిమిత్తమువలన సకలదేశపురాజులును తమతమ ఏనుగు గుర్రపు కాల్బలదండులతో యుద్ధమందు చచ్చిరి. దుర్మార్గుడగు దుర్యోధనుడు పుణ్యాత్మురాలగు ద్రౌపదిని సభకు యీడ్చి తెచ్చి పెద్దల యెదుట అవమానపరచెను. గనుక దుర్యోధనుడు పోకిరియనదగును. ఇట్టి వానివద్ద నేను నిలువను. భీమార్జున నకుల సహదేవ ద్రౌపదులు యెక్కడున్నారో అక్కడికి నన్ను తీసికొనివెళ్ళుము. అని ధర్మరాజు నారదాదిమునులతో చెప్పి దుర్యోధనుని ముఖము చూచుటకు యిష్టములేక వెనుకకు తిరిగెను. నారదుడు నవ్వుచు ధర్మరాజును జూచి యిట్లనెను.

ధర్మరాజా! యీదుర్యోధన మహారాజు యుద్ధమందుమృతి బొందెను. అందువలన యితడు దేవతలచేత సేవింపబడుచున్నాడు. దుర్యోధనుడు పుణ్యాత్ములందరును గౌరవింపగా సకలరాజులను శ్రేష్ఠమగు రాజధర్మమైన యుద్ధమందు చంపించెను. అట్లు చంపించుట పాపముకాదు. దుర్యోధనునివలన మీకును ద్రౌపదికిని యిబ్బ

వరలో కలిగిన అవమానకష్టములను యిక తలపెట్టవద్దు. యీస్వర్గ లోకము పుణ్యస్థానము. ఇట్టి పుణ్యలోకమందు అసూయాహోషము మొదలగు మనోవికారములను పొందరాదు. గనుక సకల మనో వికారములను విడిచి సమబుద్ధిగలవాడ వగుము. ధర్మరాజా! జూద మాడుటచేతను, యుద్ధమందువచ్చిన అధర్మముచేత ప్రాప్తించిన పాపములెన్నిగలవో ఆ పాపములన్నిటిని పోగొట్టుకొనుము. అని నారదమహాముని చెప్పగా ఆమాటలన్నియు ధర్మరాజువిని యిట్లనెను.

మహాత్మా! నారదమునీంద్రా! యీ రాజ్యహీనుడగు దుర్యో ధనుడు మిక్కిలి పాపాత్ముడును పెద్దలకు సర్వదా అపకారము చేయు వాడును, కులము నశింపజేసిన పాపాత్ముడును, అయియుండగా దేవ తలకు పూజ్యుడగునా? కాజాలడు. విశేషించి మాటలాడుటవలన ప్రయోజనములేదు. పాపాత్ముడైన దుర్యోధనుని గురించి సంభా షింపరాదు. గనుక దుర్యోధనుని అట్లుండనిమ్ము. నా తమ్ములగు భీమార్జున నకుల సహదేవులను, ద్రౌపదిని, నాపుత్రులగు ఉపపాండ వులను నాబంధులగు ధృష్టద్యుమ్నాదులను నేను చూడవలయును. వారలున్నచోటికి నన్ను పంపుడు అని ధర్మరాజు నారదమహా మునితో చెప్పి అక్కడ తక్కిన దేవమునులను కలియజూచి వారలతో యిట్లనెను.

## ధర్మరాజు దేవమునులను కర్ణాది స్వజనులనుజూడ వేడుకొనుట

మహాత్ములారా! దేవమునులారా! భారతయుద్ధమున మృతు లైన వారందరికిని నేను తిలోదకములను యిచ్చుటకు సంసిద్ధుడనై యున్నపుడు కర్ణుడు తనకొడుకని కుంతీదేవి నాతో చెప్పినది. కర్ణుడు తనకు పుట్టిన విధమంతయు నాకు తెలియచేసెను. అది మొదలు

కర్ణుని నేను తలచినపుడెల్ల నామనస్సు పరితపించుచుండును. కర్ణుని పాదములను కుంతీదేవి పాదములవలె పూజింపలేక పోతిని. అందు వలన నేను మిగుల దుఃఖించుచుందును కర్ణుడును మేమును యేకీభ వించి స్నేహముగానున్న యెడల మమ్ములను దేవేంద్రుడైనను గెలువజాలడు. కర్ణుడు మాకు అన్నయని తెలియనందున అతనిని చంపుటకు అర్జునుని పంపించితిని. అర్జునుని పంపించి కర్ణుని చంపించితి నని యిప్పుడు నేను దుఃఖించుచుందును. అట్టి మహాత్ముడగు కర్ణుని యీస్వర్గమందు చూడవలెనని కోరుచున్నాను. కర్ణ డిక్కడెక్కడ నుండెనో చెప్పుము. మునులారా! ద్రుపద విరాట యుధామన్యులును శంఖుడు మొదలగు వారిదాయాదులును, యుద్ధమను అగ్నిహోత్రము నకు, తమ ప్రాణము లను హవిస్సులనుంచి హోమముచేసిరి. అట్టి వారిని చూడవలయును. నా ప్రాణములతో సమానులగు భీమార్జున నకుల సహదేవ ద్రౌపదులను చూడక నిలువలేను. వీరిలో ఒకరి కైనను స్వర్గలోక భోగములు కలుగనియెడల నాకును అట్టి అపేక్ష కలుగదు. నాతమ్ము లెక్కడుండిరో, అదియే పుణ్యలోకమని తలచి అక్కడనే నేను వుండెదనుగాన నన్నచటికి పంపుడు అని ధర్మ రాజు దేవమునులతో చెప్పి ప్రార్థింపగా వారు ధర్మరాజుతో యిట్లనిరి.

ధర్మరాజా! నీవు కోరిన ప్రకారము చేయునట్లు మాకు దేవేంద్రుడు విధించియున్నాడు. గనుక నీ యిష్టప్రకారము జరిగించె దము అని ఆ దేవమునులు ధర్మరాజుతో చెప్పి దేవదూతను జూచి వానితో యిట్లనిరి. దేవదూతా! ధర్మరాజును, భీమార్జున నకుల సహదేవులును ద్రౌపదియు గల చోటునకు పంపించుము అని మునులు చెప్పగా దేవదూత మిక్కిలి ప్రేమతో యీవైపు రమ్మని ధర్మ రాజుతో చెప్పుచు తాను ముందర వెళ్ళుచుండెను. దేవదూత వెంబడి

ధర్మరాజు వెళ్ళుచుండెను. కొంతదూరము వెళ్ళగా మార్గము వెంట్రుకలచేతను యెముకలచేతను దట్టమై, చెడువాసనకలిగి ముండ్లు మొదలగు వానిచేత కష్టము కలిగించుచుండెను. ఆ మార్గము అగ్నియాగలచేతను దోమలగుంపులచేతను, నిండియుండెను. ఆ మార్గమందు మిక్కిలి పెంజీకటి కలిగి అనేక విధములగు పురుగులచేతను, రక్తమాంసముల ప్రదేశములచేతను పీనుగులచేతను మిక్కిలి భయంకరము కలిగించుచుండెను. ఆ మార్గము తీక్షణముగాను వేడిగాను వుండెను. కాకులు మొదలగు పక్షుల ధ్వనులుగలిగియుండెను. ఆ మార్గమున ధర్మరాజు పోయి పోయి యెర్రగా కాచిన నూనెవంటి నీళ్ళుకల ఒక వనమును చూచెను.

ఆ వనమందు యినుపముండ్లు కలిగి అంటినవారికి అనేక బాధలు కలుగుచుండెను. ఆ వనమందు వాడిగల కత్తులే ఆకులవలెనుండెను. ఆ వన ప్రదేశమున వైతరణియనునది కలదు. అక్కడ అనేక విధములగు నరకదుఃఖములను పాపాత్ములు అనుభవించుచుండిరి. వారిని ధర్మరాజు చూచి దేవదూతతో యిట్లనెను. మునీంద్రా! నాతమ్ములగు భీమాదులున్న చోటు యిక నెంతదూరము కలదు. ఈ ప్రదేశముకూడా దేవతలకు అధీనమైయున్నదా? అని ధర్మరాజు దేవదూతను అడుగగా దేవదూత ధర్మరాజుతో యిట్లనెను. మహాత్మా! ధర్మరాజా! యీ నరక ప్రదేశముకూడ దేవతాధీనమైన ప్రదేశమగును. మనము పొందుటకు వచ్చిన ప్రదేశమిదియే అని దేవదూత చెప్పగా ధర్మరాజాచోటుచూచి అసహ్యాపడి చెడువాసన మొదలగునవి కలిగియుండుటచేత నరకప్రదేశమందు మిక్కిలి దుఃఖముకలవాడాయెను. ధర్మరాజు దుఃఖమనస్సుగలవాడై అక్కడినుండి మరలిపోవుటకు ప్రయత్నించెను. అప్పుడు కొన్ని మాటలు ధర్మరాజునకు వినిపించెను. ఆమాటలను చెప్పెదను వినుము.

పుణ్యాత్మా! ధర్మరాజా! నీ పుణ్యదేహము యిక్కడికి వచ్చినందున నీ దేహమువలన దివ్యపరిమళముతో చల్లనిగాలి మా మీాద విసరుచున్నది. మంచిగాలివలన మా దుఃఖమంతయు నశించెను. మేము సకల విధములైన నరక దుఃఖములను విడిచి మిక్కిలి సౌఖ్యవంతుల మగుచున్నాము. నిన్ను జూచినందున అనేక నరక బాధలను విడిచితిమి. గనుక నీవు మాయందు కృపగలిగి సర్వదా యిక్కడనే నిలిచియున్న యెడల మేము సుఖముగ బ్రతుకుదుము. కొంతసేపైనను యిక్కడనిలిచియుండుమని కొన్ని మాటలు ధర్మరాజుతో చెప్పినట్లు ధర్మరాజునకు వినిపించెను. ఆ దుఃఖభారపు మాటలను ధర్మరాజు విని వీరలు యెంతగొప్ప దుఃఖము లనుభవించిరో యని తలచి వారియందు ధర్మరాజునకు కృపగలిగి వెళ్ళక అక్కడ నిలిచి యుండెను.

మరల కొన్ని మాటలు ధర్మరాజునకు వినిపించెను. ఆ మాటలను ధర్మరాజు విని మీారెవ్వరని అడిగెను. అప్పుడా మాటలు చెప్పినవారు ధర్మరాజుతో యిట్లనిరి. ధర్మరాజా! నేను కర్ణుడను. నేను భీమసేనుడను, నేను అర్జునుడను, నేను నకులుడను, నేను సహదేవుడను, నేను ద్రౌపదిని, నేను దృష్టద్యుమ్నుడను, మేము ద్రౌపదీ పుత్రులము అని ధర్మరాజునకు మాటలు వినిపించెనేగాని కర్ణాదులు కనబడలేదు ఆమాటలను ధర్మరాజువిని మిక్కిలి దుఃఖముగలవాడై తనలో తానిట్లని తలచెను. అయ్యో! దైవము కర్ణ భీమాదులను ఇట్లు మహానరకమందుంచెనుగదా! ఈ కర్ణాదులు యేమి పాపములు చేసిరో తెలియదు. ఇట్టి మహానరకములను కర్ణ భీమార్జు నాదులు అనుభవించుటకు కారణము తెలియదు. అయ్యో! దేవేంద్రాది దేవతలు నీచులకు కలుగు నరకములందు కర్ణ భీమార్జునాదులనుంచిరి. వీరిని యిట్టి నరకముయందుంచుట ధర్మముకాదు. దేవేంద్రాది

దేవతలందరును ధర్మమార్గమును విడిచి అధర్మపరులై నా బంధు జనులను యిట్లు కష్టపెట్టుచున్నారు. కర్ణ భీమార్జునాదులు పండితు లచేత పూజింపదగినవారై సత్యవంతులై కృపగలవారై సర్వదా దాన ధర్మబుద్ధి గలవారై అధిక దక్షిణ పూర్వకముగా యజ్ఞవిధు లను జరిపిన వారగుదురు. పుణ్యాత్ములగు కర్ణ భీమార్జునాదులు తగని దుఃఖములను అనుభవించు చున్నారు. ఒకప్పుడును ధర్మబుద్ధి లేని దుర్యోధనుడు అట్లు దేవతలచేత పూజింపబడుచు సకల సుఖముల ననుభవించుచు సర్వదా సుఖాభివృద్ధిని పొందియున్నాడు. దుర్యో ధనుడు తన బంధు భార్యలతో గూడుకొని పుణ్యస్థానమందు మహా భోగమును పొందియున్నాడు. ఈ కర్ణ భీమార్జునాదు లొకప్పుడైనను యీగ కాలియంత పాపమునైనను చేసినట్లుగా నేను వినినవాడను గాను. అట్టి పుణ్యాత్ములగు కర్ణ భీమాదులకు దైవము న్యాయము తప్పి నరకబాధలను కలిగించెను. అని ధర్మరాజు తలచుకొని అపరి మితమైన దుఃఖమందు మునిగినవాడై యిట్లని తలంచెను.

ఆహా! ఇంతమనోదుఃఖము నాకిప్పుడు కలుగుటకు కారణ మేమి? ఇది గొప్పమాయయో లేక కలగనుటయో, నిశ్చయమెా తెలియలేదు. నాకిపుడు చిత్తభ్రాంతి గలిగియున్నందున యిది యిట్టి దని నిశ్చయించుటకు వివేకము లేక యున్నది. అని ధర్మరాజు తల చుచు మిక్కిలి విచారపూరితమగు మనస్సుతో దుఃఖముచేత కుందిన వాడై కొంతసేపు వూరకుండెను. పిమ్మట మంచిబుద్ధి గలవాడై దేవేంద్రునిమీద కోపించుకొని తన దగ్గర గల దేవదూతతో యిట్ల నెను. మహాత్మా! దేవదూతా! నీవు యెవరిదూతవో వారిదగ్గరకు వెళ్ళుము. నా తమ్ములు యిక్కడ నరకములయందు పడియుండి దుఃఖించుచున్నారు. అందువలన యిక్కడనే నా తమ్ములను విడిచి ఇక నేను దేవేంద్రుని వద్దకు రాజాలను. ఇక్కడనే నేనున్ను నా తమ్ములను

కనిపెట్టుకొని యుండెదము. ఇట్లు నేను చెప్పినట్లు కృపాసముద్రుడగు దేవేంద్రునితో చెప్పుము. అని ధర్మరాజు చెప్పగా దేవదూత వేగముగా దేవేంద్రునితో చెప్పెను.

## ఇంద్రుడు నరకము కడనున్న ధర్మరాజు నొద్దకువచ్చి యతనిని సంభావించుట

దేవేంద్రుడా! ధర్మరాజు చెప్పినమాటలు దేవదూతవలన విని వేగముగా దేవముని సమూహములతో గూడినవాడై ధర్మరాజు దగ్గిరకు వచ్చెను. ధర్మదేవుడును, తన పుత్రుడైన ధర్మరాజు నందుగల ప్రీతిచేత ధర్మరాజు దగ్గిరకు వచ్చెను ధర్మదేవుడనగా యముడని తెలియవలయును. ధర్మరాజుండు నరకప్రదేశము దగ్గిరకు ధర్మదేవుడును దేవేంద్రుడును వచ్చినతోడనే నరకములనుభవించు పాపాత్ములకు నరకబాధలు నివారించెను. అక్కడగల మురికి వాసన కాకును గ్రద్దలు మొదలగు వాని ధ్వనులు. మాంసపు కుప్పలు. పక్షుల పంక్తులు పీనుగుల కుప్పలు, తోచకపోయెను. రక్తమాంసములును, వెంట్రుకల కుప్పలును యెముకల రాసులును కనబడలేదు. దేవేంద్ర ధర్మదేవతలు వచ్చినపుడు క్రూరములైన కత్తులనే ఆకులుగా గల అరణ్యమును, ఆ యరణ్యముతో గూడిన వైతరణీ నదియు కనిబడలేదు. మంచి సువాసనగల చల్లనిగాలి కొట్టుచుండెను ఆ గాలి కొట్టుటచేత ఆనందము కలుగుచుండెను.

ఆగాలి అమృతమయమని చెప్పదగినదై సర్వదిక్కులయందును వ్యాపించియుండెను. దేవేంద్రునితో వచ్చిన వసురుద్ర ఆదిత్య గరుడ గంధర్వ సిద్ధ సాధ్య సర్వాది సమూహము లన్నియు ధర్మరాజుదగ్గర నిలిచియుండి ధర్మరాజును సేవించుచుండిరి. దేవత లందరును ఆనందోల్లాసములతో ధర్మరాజును చూచుచుండిరి. ఆ వచ్చిన దేవత లంద

రును ధర్మరాజుయొక్క గుణములను చెప్పుకొనుచుండిరి. దేవ సమూహ మునిసమూహములతో గూడిన దేవేంద్రుడు ధర్మరాజు దగ్గరకు వచ్చి శాంతిపు మాటలతో యిల్లనెను మహాత్మా! ధర్మ రాజా! యీ నరకప్రదేశమందు నీవున్నావని యీ దేవత లందరును చింతించి నిన్ను వెంటబెట్టుకొని వెళ్ళుటకు వచ్చియున్నారు. కోప మును విడువుము నీసద్గుణవిశేషమువలన నీకుసకలసిద్ధులును నాశము లేని శాశ్వతలోక సమృద్ధియు. మిక్కిలి సౌఖ్యాతయు, సర్వోత్కార బుద్ధియు అధికకీర్తియు కలిగెను.

ధర్మరాజా! మరియొక విశేషమును చెప్పెదను వినుము. రాజనువానికి నరకము తప్పక కలుగును. రాజు పరమ పుణ్యాధిక్యు డైనమొదల నరకస్థలమును చూడవలయును. ఈ ప్రకారము వేద మందు చెప్పబడి యున్నదిసుమా! ఆహేతువుచేత నీవును నరకస్థల మును చూచితివి. సకల జనులకును పుణ్యపాపములు కలిసియుండును. పుణ్యములవలన స్వర్గసుఖములు కలుగును పాపములవలన నరక దుఃఖములు కలుగును. మొదట స్వర్గసుఖముల ననుభవించినవాడు పిమ్మట మహానరక దుఃఖముల ననుభవించును. మొదట నరకదుఃఖ ముల ననుభవించినవాడు పిమ్మట మహాసౌఖ్యము ననుభవించును. స్వల్పపుణ్యములు గలవాడు మొదట స్వర్గసౌఖ్యములను అనుభవించి పిమ్మట మహానరకములను పొందును. అధిక పుణ్యములుగలవాడు మొట్టమొదట నరకముల ననుభవించి పిమ్మట మహాసౌఖ్యములను అనుభవించవలయును. ధర్మరాజా! యీప్రకారము యేర్పాటై యున్నది. ఆ యేర్పాటుప్రకారము నిన్ను మొదట నరకస్థలమునకు పంపించితిని ఇక మహాసౌఖ్యములను నీకు కలిగింపదలచి యీనరక ప్రదేశమునకు నిన్ను పంపించితినేగాని మరియొకటి కాదు. నీవు మనస్సునందు కోపించుకొని సంకటపడుచున్నందున యీ యేర్పాటు

పద్ధతిని నీకు చెప్పవలసి వచ్చెను. నీ యన్నగు కర్ణుడు శ్రేష్ఠమైన పుణ్యగతిని పొంది ప్రకాశించుచున్నాడు. అని ఆ కర్ణుని నీవు సర్వదా తలచుకొని మిక్కిలి దుఃఖించుచుందువు. ఆ కర్ణుడు మహా దివ్యపదమును పొంది ప్రకాశించుచున్నాడు. ఆ సూర్యపుత్రుడగు కర్ణుని నీవు చూచి నీ దుఃఖమును విడువుము. నీతమ్ములగు భీమార్జున నకుల సహదేవులును, ద్రౌపదియు, నీ సైన్యమందుండు సకల రాజులును ద్రౌపది పుత్రులు మొదలగువారును దివ్యస్థానమందు ప్రకాశించుచుండగా నీవు చూచి ఆనందింపగలవు. దైవనిర్మాణమువలన కలిగెడి ఫలమును తప్పింపరాదు. అందుచేత స్వల్పదుఃఖమును అనుభవించితివి. ఇక మహాసౌఖ్యములను అనుభవింపుచు నావెంబడి యుండుము. నీవు అనుష్టించిన వ్రతములను దానములకును తగిన భోగములను నేను నీకు కలిగించెదను. ఆభోగముల ననుభవించుచు నావెంబడి విహరించుచుండుము ధర్మరాజా! నీవు చేసిన రాజసూయ అశ్వమేధయజ్ఞముల వలన సంపాదింపబడిన మహాపుణ్యలోక సౌఖ్యములను మిక్కిలి విభవముతో అనుభవించుచు నాశములేని దివ్యసౌఖ్యమం దుండుము. పూర్వపు మహారాజులగు మాంధాతృ నలహరిశ్చంద్ర దిలీప దుష్యంత భరతులు మొదలగువారు పొందిన కీర్తిని నీవును పొందుము. ఈ మునులును యీ దేవతలును గరుడ గంధర్వ సిద్ధ సాధ్య సర్వశ్రేష్ఠులును నిన్ను పొగడుటకు సంతోషముగా వచ్చియున్నారు. వీరందరిని చూడుమని వచ్చియుండు దేవత లందరిని దేవేంద్రుడు ధర్మరాజునకు చూపెను. ధర్మరాజు వచ్చిన దేవతలకు నమస్కరించెను. దేవత లందరును నవ్వుముఖముగలవారై ప్రీతిపూర్వకముగా ధర్మరాజుతో మాటలాడిరి.

### యముడు ధర్మరాజును ఉచితవచనములచేత సంభావించుట

దేవేంద్రుడు మహానుభావుడగు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! యిదిగో ఆకాశగంగానదిని చూడుము. ఆ కాశగంగానది

యందు స్నానముచేసి అఖండముగా స్వర్గభోగములను అనుభవించుచు పూర్వపు మహారాజులకంటె అధికుడవై యుందువు. అని యిట్లు ధర్మ రాజుతో చెప్పెను. ధర్మదేవుడు మనోహరమైన దివ్యరూపముగల వాడై వికసించిన ముఖముతోడ తన కొడుకైన ధర్మరాజు దగ్గరకు బోయి ఆతనితో యిట్లనెను. పుత్రుడా! ధర్మరాజా! సాటిలేని నీ గౌరవమును పరీక్షించి చూచితిని. మూడుసార్లు నీ గౌరవస్వభావ మును పరీక్షించగా నీధర్మబుద్ధి నాకు తెలిసెను. నీవు ద్వైతవనము దున్నపుడు ఒకసారియు కురుక్షేత్రో వచ్చినపుడు మేరుపర్వతము దగ్గిర ఒక్కసారియు నీతమ్ముల నిమిత్తమై యిక్కడ నీవిప్పుడు దుఃఖించగా ఒక్కసారియు నీచిత్తమును పరీక్షించితిని. నీ మనస్సు ఒకప్పుడైనను ధర్మచలనము లేక నిశ్చలమై యున్నది. నీబుద్ధియందు మనోనిగ్రహ ఇంద్రియనిగ్రహ సత్యసద్గుణములును నాయందు భక్తియు నీకు అధిక ములై యున్నవి. నీవు పరమ కీర్తివంతుడవైతివి. మనోవికారమును విడిచి సుఖముగ నుండుము. రాజగువాడు అవశ్యముగా నరకమును చూడవలయును. దేవేంద్రుడు దండనకొరకును నేనును నిన్ను నరకప్రదేశ మునకు పంపించితిమి. కర్ణ భీమార్జునాదులు నరక దుఃఖములను అనుభవించినట్లు కొన్ని మాటలు నీకు వినుపించినవి. ఆమాటలన్నియు మా మాయలవలన కలిగెనని తెలిసికొనుము. భీమార్జునాది జను లందరును పుణ్యలోకములయం దున్నట్లు దేవేంద్రుని మాటలవలననే నీకు తెలిసెను. నీవు యీ ఆకాశగంగానదియందు స్నానము చేయుము. అట్లు స్నానము చేసినయెడల మనుష్యస్వభావము నివ ర్తింపగలదు. సకలదుఃఖములు నశింపగలవు. నీతమ్ములగు భీమార్జు నాదులును, ద్రౌపదియు, ద్రౌపదీపుత్రులును మొదలగు వారంద రును పరమసౌఖ్యములను పొందియున్నారు. అట్టి దివ్యపదముల యందు ప్రకాశించుచు విహరించు నీతమ్ములను చూడగలవు. నీవు

యీస్వర్గమందు మహాపదమును పొంది విహరించుచు శాశ్వత సుఖములను అనుభవింపగలవు. ఇక నీకు యిక్కడ ఉండవలసిన పనిలేదు. శీఘ్రముగా లేచి యీ ఆకాశగంగానదియందు స్నానముచేసి దివ్యభోగములను అనుభవింపుము.

## ధర్మరాజు ఆకాశగంగావగాహముచేసి దేవభావమునొందుట

ధర్మదేవుడు తనకొడుకగు ధర్మరాజుతో చెప్పి ధర్మరాజును వెంటబెట్టుకొని ఆకాశగంగాసమీపమునకు వెళ్ళెను. ఆధర్మరాజుతో దేవేంద్రాది దేవసమూహములును మునులును కూడా వెళ్ళిరి. ధర్మరాజు ఆపుణ్యనదియగు గంగయందు స్నానముచేసెను. దేవమునులు మొదలగువారు ధర్మరాజును పొగడుచుండిరి. ధర్మరాజు ఆకాశగంగయందు స్నానముచేసి మంగళస్నానమువలననే మనుష్యదేహభావమును విడిచి దివ్యదేహమును ధరించెను. ధర్మరాజునకు మనుష్యవికారగుణములగు వైరమాత్సర్య స్నేహగర్వదుఃఖాదు లన్నియు నశించెను ధర్మరాజు మనుష్యభావమును విడిచి దేవత్వమునుపొంది పొగలేని అగ్నిహోత్రమువలె ప్రకాశించుచుండెను.

జనమేజయమహారాజా! యీప్రకారము మీ తండ్రికి తాతయగు ధర్మరాజు దేవత్వమునుపొంది దేవేంద్రనారదాది మహాపురుషులచేత స్తుతింపబడుచు తనవెంబడి ధర్మదేవుడు వచ్చుచుండగా తన దివ్యశక్తివలన ఒకచోటికి వెళ్ళెను. ధర్మరాజు ఒకానొక మనోహరప్రదేశమునకు వెళ్ళగా కృష్ణరూపుడైన నారాయణమూర్తిని అచ్చట చూచెను. ఆ నారాయణమూర్తి నవరత్నములుచేత ప్రకాశించుచుండు బంగారుమయమైన సింహాసనమందు కూర్చునియుండెను. నారాయణునియొక్క దివ్యదేహకాంతులచేత దిక్కులన్నియు ప్రకాశించుచుండెను. అట్టి నారాయణమూర్తిని వారివంటి పురుషు లనేకులు

చక్రగదాది ఆయుధములను ధరించినవారలై దేదీప్యమానముగా ప్రకాశించుచు కొలుచుచుండిరి. ఆ కొలుచుచుండు పురుషులు విష్ణు దేవునివంటి గురుతులుగలవారై చక్రగదాద్యాయుధములను ధరించి రత్నఖచితములైన కిరీటములను శిరస్సులయందు ధరించుకొని ప్రకాశించుచు మహోన్నత దివ్యసింహాసనమందు కూర్చొనియుండు నారాయణమూర్తిని సేవించుచుండిరి. ఆనారాయణమూర్తి దగ్గర పూర్వము వలెనే వినయముతో కృష్ణుని సేవించుచుండు అర్జునుని ధర్మరాజు చూచెను.

నరనారాయణమూర్తులగు అర్జునకృష్ణులను ధర్మరాజు చూచి పరమానందమును పొందెను. ధర్మరాజు తన దివ్యశక్తివలన మరియొక స్థలమునకువెళ్ళి పండ్రెండు సూర్యులలో పదమూడవ సూర్యునివలె ప్రకాశించు కర్ణునిజూచెను. కర్ణుడట్లు ప్రకాశించుచు సూర్యునివలెనేయుండెను. ధర్మరాజు కర్ణుని ప్రేమతో చూచెను. ధర్మరాజు మరియొక ప్రదేశమందు మరుద్గణదేవతలతో ప్రకాశించు భీముని జూచెను. ధర్మరాజు అశ్వినీదేవతల సరూపమున అశ్వినీదేవతలనలె ప్రకాశించు నకులసహదేవులను జూచెను. ధర్మరాజు ఉదయకాల మందలి సూర్యునివలె ప్రకాశించు మెరనికాంతిగల ద్రౌపదిని వేరొకచోట చూచెను. ఆదివ్యదేహపుకాంతిచేత అక్కడగల ప్రదేశమంతయు ప్రకాశించెను. ద్రౌపదిని ధర్మరాజుచూచి ఆశ్చర్యపడి తన వెంబడిగల దేవేంద్రునితో యిట్లనెను.

## ఇంద్రుడు ధర్మరాజునకు దేవత్వమునొందిన స్వజనముల జూపి చెప్పుట

మహాత్మా! దేవేంద్రా! యీస్త్రీ యెవతో తెలియజెప్పుము అని ధర్మరాజు అడుగగా దేవేంద్రుడు యిట్లనెను. ధర్మరాజా! యీ

స్త్రీ మహాలక్ష్మి. ఈమె ద్రుపదరాజునకు కుమార్తెగా అగ్నిహోత్ర మందు పుట్టిన ద్రౌపది. ఈమె శివుని యాజ్ఞవలన మనుష్యదేహ మును ధరించి మీకు భార్యగానుండెను. ఆద్రౌపది మీఅయిదుగురికిని భార్యయగునట్లు శివునిఆజ్ఞను పొంది భూలోకమందు పుట్టెను.

ధర్మరాజా! అదిగో వారైదుగురును గంధర్వశ్రేష్ఠులు, మీ అయిదుగురకు ద్రౌపదియందు పుట్టిన పాండవకుమారులగు ఉప పాండవులు. అల్లదిగో! గంధర్వరాజగు ధృతరాష్ట్రుని చూడుము. ఆధృతరాష్ట్రగంధర్వరాజే మీపెత్తండ్రియగు ధృతరాష్ట్రుడై పుట్టి చచ్చెనని యెరుగుము. ధర్మరాజా! అదిగో పంద్రెండు సూర్యులలో ఫలానివాడు కర్ణుడు. అతడు నీకు అన్నయగును. ఆకర్ణుని దేహము సూర్యుని రెండవదేహమని తెలిసికొనుము. ఆకర్ణుడు సూర్యునివలన నీతల్లియగు కుంతియందు బుట్టినందున కుంతీపుత్రుడగును. కర్ణుని దైవవశమువలన రాధ పెంచినందున, రాధేయుడని చెప్పబడెను. కర్ణునిచూడుము. అదిగో! సిద్ధసాధ్య విశ్వదేవసమూహములలో వుండువారిని చూడుము. ఆయా సిద్ధసాధ్యవిశ్వదేవ సమూహముల యొక్క అనగా అంశములవలన సాత్యకి కృతవర్మాది యాదవులు పుట్టి కృష్ణుని వెంబడించుకొని తిరుగుచుండి మృతులై ఆయా సిద్ధ సాధ్యాదులయందు కలిసియున్నారు. సాత్యకి కృతవర్మాది యాదవు లను చూడుము అవి దేవేంద్రుడు. ద్రౌపదిని, ద్రౌపదీపుత్రులను ధృతరాష్ట్రుని, కర్ణుని, సాత్యకి, కృతవర్మాది యాదవులను ధర్మరాజు నకు చెప్పి చూపి మరల యిట్లనెను.

ధర్మరాజా! ఇదిగో వీడు అభిమన్యుడు, చంద్రునివలె ప్రకా శించుచుండు అభిమన్యుని చూడుము. అభిమన్యుడు చంద్రుని అంశము వలన పుట్టినవాడు. నా వెంబడి నానారత్నఖచితవిమానమందు యెక్కి వచ్చుచుండు వీడు నీతండ్రియగు పాండురాజు. ఇతని సమీపమున గం

యిద్దరుస్త్రీలు కుంతీ మాద్రీదేవులు. ఈపాండురాజును జూడుము. అల్లదిగో! వసువులదగ్గర యుండువాడు భీష్ముడు. ఇదిగో బృహస్పతి దగ్గర సంతోషముగా నుండువాడు ద్రోణుడు. ఆ భీష్మద్రోణులను చూడుము. ధర్మరాజా! గంధర్వయక్ష గుహ్యాగణములలో ఉండు ద్రుపదవిరాటులను ద్రుపదవిరాటరాజులయొక్క సహోదరపుత్రులను తక్కిన కేకయ పాండ్యులు మొదలగు నానాదేశపురాజులను చూడుమని అందరిని వేరువేరుగా ధర్మరాజునకు దేవేంద్రుడు చూపించెను. దేవేంద్రుడు మరల ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! భారత యుద్ధమందు నీపక్షముగా యుద్ధముచేసి మృతులై యీస్వర్గమునకు వచ్చినవారినందరిని చూడుము. అని దేవేంద్రుడు చెప్పి ధర్మరాజునకు తనయుద్ధమందు చచ్చినవారినందరిని చూపించెను. జనమేజయ మహారాజా! యీప్రకారము భారతయుద్ధమందు మృతులై స్వర్గమును పొందినవారందరును, ధర్మరాజునకు దేవేంద్రుడు తెలియపరచి చూపెను. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయునితో చెప్పగా జనమేజయుడు యిట్లనెను.

మహాత్మా! వైశంపాయన మునీంద్రా! దుర్యోధన శకుని సైంధవ కర్ణులును వారి కుమారులును. దుర్యోధనుని పక్షముగా యుద్ధముచేసిన రాజులును ఘటోత్కచుడు మొదలగు పాండవ పక్షమందు యుద్ధముచేసినవారును వీరందరును సర్వదా స్వర్గలోకమందే నిలిచి యుందురో లేక కొంతకాలము వుండి స్వర్గమందుండి పిమ్మట మరల మనుష్యలోకమందు పుట్టుటకు వచ్చెదరో ఆవిషయమును వినగోరెదను చెప్పుమని ప్రార్థింపగా వైశంపాయన మునీంద్రుడు యిట్లనెను. జనమేజయ మహారాజా! ఇప్పుడు నీవడిగిన విషయము దేవరహస్యమగును. ఈరహస్యమును పూర్వము వేద వ్యాస మహామునీంద్రుడు కృపచేత శిష్యులగు మాకుచెప్పియున్నాడు.

అతడు చెప్పిన ప్రకారము చెప్పెదను వినుము. ప్రద్యుమ్నుడు సన త్కుమారునియందు కలిసెను. ఇతరులు పొందరాని కుబేరలోక సౌఖ్యమును ధృతరాష్ట్రరాజు పొందెను. గాంధారియు, ధృతరాష్ట్రునితోటే కుబేరలోకమందుండెను. కుంతీ మాద్రీదేవులతో కూడు కొని పాండురాజు. దేవేంద్రుని గృహమందుండెను. అభిమన్యుడు చంద్రునితో కలసి యుండెను. ద్రోణాచార్యుడు బృహస్పతియందు కలిసెను. శకుని ద్వాపర రూపమందు కలిసెను. దుర్యోధనుడు స్వర్గ భోగ నరక దుఃఖములను అనుభవించి కలియందు కలియగలడు. దుర్యోధనుని తమ్ములగు దుశ్శాసనాదు లందరును దుర్యోధనుని వలెనే, స్వర్గనరక సుఖదుఃఖములను అనుభవించి రాక్షసులయందు కలిసిరి. కర్ణుడు తనతండ్రియగు సూర్యునియందు కలిసెను. భీష్ముడు వసువుల అంశమందు బుట్టినవాడగుటవలన భీష్ముడు వసువులయందు కలిసెను ద్రుపదుడును విరాటుడును, ధృష్టకేతుడును భూరిశ్రవు డును శల్యుడును శంఖుడును ఉత్తరుడును విశ్వేలను, దేవతల యందు కలిసిరి. ధృష్టద్యుమ్నుడు అగ్నిహోత్రునియందు కలిసెను. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజుతో చెప్పెను.

జనమేజయ మహారాజా! జ్ఞానరూపుడగు విదురుడు అదివరకే ధర్మరాజునందు కలిసెనుగదా! ధర్మరాజ విదురులిద్దరును ధర్మదేవుని అంశమువలన పుట్టినందున ధర్మరాజ విదురులు ధర్మదేవునియందు కలిసిరి. బ్రహ్మదేవుని యేర్పాటువలన బలరాముడు తనయోగబలము చేత సముద్రమునకువెళ్ళి అనంతుడను ఆదిశేషునియందు కలిసెను, ఈవిషయమును యిదివరకే నీకు చెప్పియున్నాను. తక్కిన వృష్ణిభోజ అంధక వంశస్థులగు యాదవులందరును గుహ్యకగణములయందు గలిసిరి. కృష్ణుడు భోగించు పదియారువేల గోపికాస్త్రీలును దైవనిర్మిత మైన కాలమందు సరస్వతీ నదీజలములయందు మునిగి అప్సరస్త్రీ

లైరి. పదియారువేల అప్సరస్త్రీలును నారాయణమూర్తియొక్క సమీపమందు నిలిచిరి. రుక్మిణీదేవి లక్ష్మీదేవి. రుక్మిణి అగ్నియందు ప్రవేశించి సహగమనముచేత కృష్ణుడగు నారాయణమూర్తిని కలిసెను. తక్కిన యేడుగురు కృష్ణభార్యలును లక్ష్మియొక్క అంశము లగుటవలన వారు రుక్మిణియందు కలిసిరి. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజుతో చెప్పెను.

జనమేజయ మహారాజా! భారతయుద్ధమందు చచ్చినవారును నేను మునుపు ప్రసంగించి చెప్పినవారును, నేను చెప్పనివారును యీ గతిని పొందిరని నాచేత చెప్పబడిన వారందరును తాము యేయేఅంశమువలన బుట్టిరో ఆయా దేవరాక్షస యక్ష గుహ్యక గంధర్వాది సమూహములను చెందిరని తెలిసికొనుము. నీవడిగిన విషయమును తెలిపితిని అని వైశంపాయన మునీంద్రుడు చెప్పెను. జనమేజయ మహారాజా! పాండవ కౌరవుల విషయమైన యీ యితిహాసమును, ఉపాఖ్యానములతో కూడియుండు నట్లుగా యావద్విషయమును నీకు చెప్పితిని. వేదవ్యాస మునీంద్రుడు అనుగ్రహించి నాకు మహాభారతమును చెప్పెను. అతడు ఆజ్ఞాపించినట్లు అతని ఆజ్ఞాప్రకారము వేదవ్యాసుని కృపవలన విజ్ఞానము కలవాడనై మహాభారతము నంతయు నీకు స్పష్టముగా తెలిపితిని. ఆమహాత్ముడగు వేదవ్యాస మహాముని కృపవలన మహాభారతమ నంతయు నేను చెప్పగా నీవును వింటివి. ఈ యితిహాస రూపమైన మహాభారతమును నీవు వినినందున నీవు మిక్కిలి పుణ్యాత్ముడ వైతివి. కృతార్థుడవైతివి. పరమార్థమును యెరిగినవాడ వైతివి. ఆవేదవ్యాస మునీంద్రుడు యీ మహాభారతమును నీకు చెప్పుమని నాకు ఆజ్ఞాపించెను. అతని ఆజ్ఞాప్రకారము యీ మహాభారతము నంతయు నీకు చెప్పితిని. నీవు కృతార్థుడ వైతివి. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజునకు

అతడు సర్పయాగమును చేసినప్పుడు చెప్పెను. హరిహరనాథా! దేవా! జనమేజయుడు చేసిన సర్పయాగమందు జనమేజయునకు వైశంపాయన మునీంద్రుడు చెప్పిన యీ మహాభారతమును ఆసభకు వెళ్ళియుండిన రోమహర్షణునను సూతుని పుత్రుడగు ఉగ్రశ్రవసుడు చక్కగా వినెను. ఉగ్రశ్రవసుడు వేదవ్యాసునకు శిష్యుడై పండితశ్రేష్ఠుడైయుండెను. ఉగ్రశ్రవసునియందు వేదవ్యాసుని కృపయుండుటచేత భారతకథనంతయు ఉగ్రశ్రవసునకు చక్కగా జ్ఞాపకముండెను. ఆవుగ్రశ్రవసుడను కథకుడు ఒకానొక సమయమందు నైమిశారణ్యమను పుణ్యక్షేత్రమునకు వెళ్ళెను. ఆసమయమున శౌనకుడు మొదలగు కొందరు మునులు సత్రయాగమును చేయుచుండిరి. అట్టి సత్రయాగ స్థలమునకు వుగ్రశ్రవసుడను శూద్రుడు వెళ్ళగా శౌనకాది మహామునులు వుగ్రశ్రవసునిచూచి యిట్లనిరి. పుణ్యాత్మా! ఉగ్రశ్రవసుడా! పుణ్యకథను వినవలెనని మేము కోరియున్నాము గనుక యేదైనను పుణ్యకథను మాకుచెప్పుమని యడిగి తగినప్రకారము పూజించిరి. పండితశ్రేష్ఠుడగు ఉగ్రశ్రవసుడను శూద్రుడు సంతోషించి ఆమునులతో యిట్లనెను. మహాత్ములగు శౌనకాది మునులారా! యేవిధమైన కథను వినవలెనని మీకు తలంపుగలదో చెప్పుడు. మీ యిష్టమునకు తగిన కథను చెప్పెదను. అని వుగ్రశ్రవసుడు అడుగగా శౌనకాది మహామునులు యిట్లనిరి.

పుణ్యాత్ముడవగు ఉగ్రశ్రవసుడా! మనోహరమైనది, క్రొత్తగానుండునది, సమగ్రమగు జ్ఞానముకలిగించునది, పాపములను పోగొట్టునది, మొదలగు లక్షణములుగల కథను వినవలెనని మేము కోరుచున్నాము. అని శౌనకాదిమునులుచెప్పగా వుగ్రశ్రవసుడు యోచించి యిన్నివిశేషములుకల కథ మహాభారత మగునని తలచి శౌనకాదిములతో యిట్లనెను. శౌనకాదిమహామునులారా! మీరు అడిగిన

విశేషములుగలది మహాభారతము గలదు. ఆకథను వినుకని సవిస్తారముగా మహాభారత మంతయు చెప్పెను.

శౌనకాదిమునులారా ! జనమేజయమహారాజు సర్పయాగము చేయుచు వైశంపాయనమునివలన మహాభారతము వినినవాడై ఆశ్చర్యపడి పరమానందమును పొందెను. సర్పయాగమును చేయించు యాజకులును, మహాభారతమను ఇతిహాసమును వినినవారై ఆశ్చర్యానందములు గలవారై జనమేజయుని సర్పయాగమును పూర్తి చేసిరి. సర్పయాగ కాలమందు మహాభారతమును వినిన జనమేజయ మహారాజు పరమానందముగలవాడై యుండెను. ఆ సమయమున ఆస్తీకుడను మహామునివచ్చి సర్పములను ఇక చంపవద్దని సర్ప యాగమును నిలుపుమని జనమేజయుని ప్రార్థించెను. అర్జునుని కుమారునకు మనుమడగు జనమేజయమహారాజు సర్పయాగమును పూర్తి చేసి ఆస్తీకముని నిని పూజించి సంతోషపరచెను. ఆస్తీకముని తన నివాసమునకు వెళ్లెను. జనమేజయమహారాజు, ఋత్విగ్జనులకును తక్కిన బ్రాహ్మణులకును, బహుధనాది పదార్థములిచ్చి వినయముతో ప్రార్థించి పంపించెను. బ్రాహ్మణు లందరును తమతమ నివాసములకు వెళ్ళిరి. జనమేజయమహారాజు వైశంపాయనమునిని చక్కగాపూజించి సంతోషింపచేసి వేదవ్యాసమహామునిని దేవోపచారములచే పూజించెను. జనమేజయమహారాజు సకల బ్రాహ్మణులను ఋత్విగ్జనులను మునులను తగినప్రకారము పూజించి సకల జనులచేత స్తుతింపబడుచు మిక్కిలి విభవముతో సర్పయాగ స్థలమునుండి బయలుదేరి హస్తినాపురమందు ప్రవేశించెను. అని ఉగ్రశ్రవసుడను సూతుడు శౌనకాది మహామునులకు చెప్పెను.

శౌనకాదిమునులారా! వేదవ్యాసమహాముని మహామునులలో శ్రేష్ఠుడగును. వ్యాస మునీంద్రుడు సత్యమును జూచినవాడగును. సర్వ

విధులను యెరిగినవాడగును. సకలపదార్థ జ్ఞానస్వరూపవంతుడు. సకలేంద్రియ తత్వములను యెరిగినవాడు. సర్వజ్ఞుడు. వేదవ్యాసమునీంద్రుడు పరిశుద్ధియు, శాంతియు, ఓర్పును కలిగి యింద్రియ మనోనిగ్రహ తపోయోగాది స్వభావగుణములచేత ప్రకాశించుచుండును. వేదవ్యాసమునీంద్రుడు సకలైశ్వర్యసిద్ధులు గలవాడు. సకల సాంఖ్యయోగ భేదములు తెలిసినవాడు. సకల ధర్మములను తెలుపువాడు. పరబ్రహ్మ తత్వవేత్త. వేదస్వరూపుడు. వేదవ్యాసమహామునీశ్వరుడు పాండవులయొక్క కీర్తిని ప్రకాశింపజేయుటకును మరికొందరగు రాజుయొక్క చరిత్రములను జనులకు తెలుపుటకును దేవతలకు దేవుడగు కృష్ణుని క్రీడావిశేషములను వివరించి చెప్పుటకును సకల దేవజాతుల జన్మములను దెలుపుటకును, దేవయోనుల సాయుజ్యములు తేటపడుటకును సకల ధర్మమార్గములను దెలుపుటకును, అయిదవ వేదమనబడు యీ మహాభారత సంహితను నిర్మించెను. వేదవ్యాసమహాముని యితిహాసరూపముగనుండు యీ మహాభారతమును మూడుసంవత్సరములు శ్లోకరూపముగా రచియించెను. ఈ భారతమందుగల విశేషములను చెప్పెదను వినుడని ఆసూతుడు శౌనకాదులతో యిట్లనెను.

శౌనకాది మునులారా! ధర్మార్థకామమోక్షములనునాలుగు పురుషార్థములును లభించుమార్గములన్నియు యీమహాభారతమందు గలవు. ఈ మహాభారతమందు చెప్పబడిన పురుషార్థ సాధనములే యితర గ్రంథములయందును, యితర పురాణములయందును, చెప్పబడియున్నవని తెలిసికొనుడు. ధర్మార్థ కామమోక్షములు లభించు నిమిత్తము యెన్నెన్ని సాధనములు గలవో అన్ని సాధనములును యీ మహాభారతమందు చెప్పబడియున్నవి. ఇందు చెప్పబడని పురుషార్థ సాధనము మరియెక్కడను కలుగనేరదు. పుణ్యాత్ములగు శౌనకాది మహామునులారా! జనమేజయమహారాజు సర్పయాగము చేయు

కాలమందు కరుణాసముద్రుడగు వేదవ్యాసుడు తన శిష్యుడైన వైశంపాయనమునితో యిట్లనెను.

ఓ శిష్యుడవగు వైశంపాయనా! యీపుణ్యాత్ముడగు జనమేజయ మహారాజునకు మహాభారతమంతయు వినుపింపుము. అని వ్యాసమునీంద్రుడు ఆజ్ఞాపించగా వైశంపాయనమునీంద్రుడు వ్యాసమునీంద్రునకు నమస్కరించి యీ మహాభారతమంతయు జనమేజయ మహారాజునకు చెప్పెను. ఆసభయందు నేను నిలిచియుండి వినయ భక్తులతో యీమహాభారతము నంతను వింటిని. ఆవ్యాసముని యొక్క కరుణ నాయందున్నందున వైశంపాయనుడు చెప్పినప్రకారము నేను మీకు వినిపించితిని. ఆవ్యాసునికృప నాయందున్నందున కొంచెమైనను హెచ్చుతగ్గులు లేక మీకు యీ మహాభారతమును చెప్పుటకు సమర్థుడనైతిని. మీకృపవలన నేను సుఖవంతుడను కాగలను. అని సూతుడు శౌనకాదిమునులతో చెప్పెను.

## ఫలశ్రుతి

ఓ మహాత్ములగు శౌనకాదిమునులారా! యీ మహాభారతమును వినినవారికి కలుగు ఫలమును చెప్పెదనువినుడు. అమావాస్య పౌర్ణమాస్య మొదలగు పర్వములయందు తప్పక యీ భారతకథను వినినయెడల అట్టివారికి సకలపాపములు నశించి పుణ్యలోకప్రాప్తి కలుగును. ప్రతిపర్వమందును నియమముకలిగి యీమహాభారతమును వినినయెడల జనులు మోక్షమును కోరినయెడల మోక్షము లభించుచున్నది. ఈ మహాభారతమునందు ఆదిపర్వము మొదలుకొనిస్వర్గారోహణపర్వమువరకు గల కథను చక్కగా వినినయెడల అట్టివారికి

శీఘ్రముగా బ్రహ్మహత్య మొదలగు పాపములు నశింపగలవు. దేవ పితృకార్యములయందు యీ భారతకథను బ్రాహ్మణులకు వినిపించిన వాడు దేవకార్య పితృకార్యములవలన యెంతపుణ్యము కలుగ గలదో అంతపుణ్యమును ఆ వినిపించినవాడు సమగ్రముగా పొందు చున్నాడు. ఈ భారతకథను కొంచెమునైనను శ్రద్ధచేత వినిన యెడల అట్టివానికి యింద్రియములచేతను మనస్సుచేతను చేసిన పాపము నశించుచున్నది.

ఓ మునులారా! యీ మహాభారతమును సమగ్రముగా బ్రాహ్మణులు వినినయెడల అట్టి బ్రాహ్మణులు మూడులోకముల యందునుకీర్తిగలవారై శత్రువిజయముగలవారైప్రకాశించుచుందురు. రాజులు వినిన యెడల దిగ్విజయము గలవారై రాజ్యలక్ష్మిని అనుభ వించుచుందురు. ఈ మహాభారతమును యేజనులైనను భక్తితో వినినను చదివినను అట్టిజనులకు ఆయుర్వృద్ధియు, ఐశ్వర్య ప్రాప్తియు అధికమగు కీర్తియు, సౌఖ్యమును, దృఢమైన జ్ఞానప్రాప్తియు, కలుగు చున్నవి. శ్రద్ధాభక్తులతో యీ భారతకథను యెరిగినవారికి యే కోరికలున్నను అవి ఫలించుచున్నవి. గర్భిణియగు స్త్రీ యీ భారత కథను కొంతయైనను వినినయెడల మంచికుమారుని కనును. కన్యక యీ పుణ్యకథయగు భారతములో కొంతయైనను వినినయెడల మంచి గుణవంతుడగు భర్తను పొందును. ఓ శౌనకాది మునులారా! ఈ మహాభారతమున కంతయు కృష్ణుడు ఆధారుడని తెలిసికొని వినిన వారికి సకలపాపములు నశించి శాశ్వతమైన పుణ్యలోక ప్రాప్తికలుగు చున్నది. మహాభారతమును వినినవారికి సకల సిద్ధులునుకలుగగలవు. మునులారా! యీ మహాభారతము నంతయును వినుచు వేదవ్యాస మహామునియందు భక్తికలిగి యున్నయెడల అట్టివారు సకల

శాస్త్రార్థ జ్ఞానములు కలిగి జనులచేత పొగడబడుచుందురు. వేద వ్యాస మహాముని యందు భక్తిగలిగి యీ మహాభారతమును వినిన వారికి పుణ్యలోకములందు శాశ్వత దివ్యసౌఖ్యమును కలుగుచున్నవి. అని యీ విధముగా సకల పురాణ వేదియగు సూతుడు శౌనకాది మహామునులకు పరమపద ప్రాప్తిని కలిగించు యీ మహాభారత మను యితిహాసము ను చెప్పెను.

ఈ విధముగా భారతమునంతయు సూతునివలన ఆశౌనకాది మహామునులు వినినవారై పరమానందమునుపొంది సూతుని పూజించిరి. హరిహరనాథా! దేవా! ఆసూతుడు శౌనకాది మునులకు చెప్పినప్రకారము నేను నీకు వినిపించితిని. నీవు సర్వలోకములచేతను పూజింపబడుచుండు సద్గురుడవు నీవు సర్వకాలములయందు నన్ను కృపతో చూచుచు రక్షించుచుండుము. ఈ మహాభారతమునంతయు నీకు వినిపించి యీ భారతమునకు నిన్ను ప్రభువును జేసితిని. నన్ను మరువక కృపతో రక్షించుచుండుము.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణసుధాకర లక్ష్మణామాత్య
పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన
తెనుగువచన కావ్యంబగు శ్రీ మహా
భారతమందు స్వర్గారోహణ పర్వము

ము గి సె ను.

---

శ్లో. కాయేనవాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్
కరోమి యద్యత్సకలంపరస్మై నారాయణాయేతి సమర్పయామి॥

అభ్ర శ్యామః పింగజటా బద్ధకలాపః ప్రాంశు ర్దండీ కృష్ణమృగత్వ
క్పరిధానః
సర్వాన్లోకాన పావయమానః కవిముఖ్యః పారాశర్యః పరమ
సురూపం విష్ణుర్ణోతు॥
నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరంచ
వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవింద యోగీంద్ర
ముధాస్య శిష్యమ్॥
శ్రీ శంకరాచార్య ముధాస్య పద్మపాదంచ హస్తామలకంచ
శిష్యమ్
తంత్రోటకం వార్తిక కారి మన్యా నస్మద్గురూన్ సంతత
మానతోస్మి
యదక్షర పద భ్రష్టం మాత్రాహీనంచ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోస్తుతే।
ఇది శ్రీపరమేశ్వర కృపాపాత్రుడును కౌశికగోత్ర పవిత్రుడును,
జయంతి వంశ సంజాతుడును, బలరామమూర్తి జ్యేష్ఠపుత్రు
డునునగు జగన్నాథశాస్త్రిచే యీ మహాభారత మను
తెనుగు వచన కావ్యము పరిష్కరించి
వ్రా య బ డి న ది.
శ్రీ మహాభారతము వచనకావ్యము
స మా ప్త ము

---

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
ఓం తత్సత్ హరిఃఓం – శ్రీ కృష్ణార్పణమస్తు